# మాధవీకంకణము.



ఇది

రమేశచంద్రదత్తుగారు

ఆంగ్లేయభాషనురచియించిన

గ్రంథమునుండి

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారిచే

నాంధ్రీకరింపఁబడినది.



రెండవకూర్పు 2000 ప్రతులు.





ఏలూరు.

రామమోహనముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1916

# పీఠిక.

---

రమేశచంద్రుని గ్రంథరాజములు దిగంతయశోవిరాజితములు. ఆతని చారిత్రకవిజ్ఞాన మనుపమేయము. మన దేశవాసులీ మహామహుని రాజ్యతంత్రజ్ఞునిగమాత్రి మెఱుంగుదురు. ఆంగ్లేయభాషాధురీణు లీయన గ్రంథములు పెక్కులు చదివియుందురు. ఈయన "ప్రాచీనహిందూదేశనాగరికత" యను గ్రంథము బహుజనసేవ్యము. ఆర్థికచరిత్రము ఈయనచే రచియింపఁబడినది మనదేశస్థితిగతులనుగూర్చిన ఆర్థికనీతి విశదీకరించును. ఇయ్యది మున్నె నాచే నాంధ్రీకరింపఁబడినది. ఈయన కవితానైపుణి యెట్లుండునో కేవల మాంధ్రభాషాధురీణులు చవిగొని యెఱుంగరు. ఈనవల ముప్పదిసంవత్సరములకుఁ బూర్వమీయన బంగాళీభాషయందు మాధవీకంకణమను పేర వ్రాసి మాతృభాషను ప్రకటించెను దానిని విపులీకరించి ఆగ్లేయభాషయందు కొన్ని క్రొత్తవిషయములను చేర్చి "తార్తారదాసీసుందరి" యను నామమున నీగ్రంథమును రచియించినాఁడు— గ్రంథప్రాశస్త్యము పాఠకులకుఁ దద్గుణానుభవమునఁ దెలియఁగలదు. దీని నాంధ్రీకరించుపట్టున కొన్నిపట్ల కేవలసారాంశమునుమాత్రమే తీసి గ్రంథక

ర్తయొక్కయుద్దేశములు చెదరకుండునట్లు స్వేచ్ఛగవ్రా సితిని. కొన్నియెడలఁ గేవలభాషాంతరీకరణమె యొన రించితిని. ఎట్లయినను భాషాంతరీకరణమున మాతృకలో ని రసభావము లున్నవియున్నట్లు వ్యక్తంబగుట పొసంగ దు. గుణాగుణములు రసజ్ఞులగుపాఠకులు తెలిపినచో వలయుమార్పులు ముందుకూర్పునఁ బొందుపఱచెదను. దత్తుగారిజీవచరిత్రము జగద్విఖ్యాతమయ్యాను గ్రంథము చదివినవెనుక, కవి యెట్టివాఁడై యుండు ననికుతూహల పడుపాఠకులకు మఱియొక గ్రంథమును జూచికొమ్మనిచె ప్పుటకంటె వేఱొక్కచోటఁ బ్రచురింపఁబడియుండుదా ని నిచ్చుటనే నెలకొల్పుట యుత్తమం బని యెంచి నాచే నాంధ్రీకరింపఁబడిన హిందూదేశ ఆర్థికచరిత్రమునందలి యీయనజీవచరిత్రము నిందు పునర్ముద్రణముగావించితి ని. ఈగ్రంథము నేనాంధ్రీకరణమున కుపక్రమించి నాకు తీరికగలుగునప్పుడెల్ల రాత్రులను వ్రాయుచు రెండుమా సములలో ముగించితిని. లోటుపాటులను గప్పిపుచ్చుట కియ్యది సరియైనకారణముగా పరిగణింపఁబడునెడల దిన మునకు రాత్రులు 9 గంటలకు వెనుక రెండుగంటలకాల మువూత్రమే దీనిని వ్రాసిముగించితినని విన్నవించెదను.

ఇయ్యది యాత్మోత్కర్షకై చెప్పితినని పాఠకులు భావింపకుందురుగాక! నేనీగ్రంథరచనకుఁ బ్రారంభించినవెనుక కొందఱాంధ్రభాషావిశారదు లీగ్రంథమును రచియింపఁబూని నాపూన్కి నెఱింగి తత్ప్రయత్నమును నాకై వదలి నన్ను కృతార్థుం జేసినందులకు వారి కెంతయు గృతజ్ఞుండ నగుచున్నాఁడను. పలువుర పలుచోట్లనీగ్రంథమును రచియింపఁబూనిరని తెల్పుటవలన నీగ్రంథమునందు దేశవాసులకెంత యభిరుచికలదో విదితము కాఁగలదు.

ఉ. ఉన్నదియున్నయట్టులుగ
నుంచినకొన్నిస్థలంబులందు భా
వోన్నతిగల్గకుండునటు
లుంచకయుండిన భావభంగమా
కొన్నిస్థలంబులందు, నటు
కొంతయునిట్టులు కొంతయుంచి భా
వోన్నతి దేని కెట్లుతగి
యుండునొ యమ్మెయిదీని వ్రాసితిన్.

ఏలూరు.
6—3—1916.

ఇట్లు,
తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

# రమేశచంద్రదత్తుగారి జీవచరిత్రము.



రమేశచంద్రుఁడు దేశభక్తులలో నగ్రగణ్యుఁడను మాట జగద్విదితము. ఈయన వంగదేశమున కలకత్తా నగరమున 1843 సం॥రం ఆగష్టు 13 తేదీని జననమందె ను. ఈయనకుటుంబము మిక్కిలి ప్రఖ్యాతినందిన కుటుంబము. ఈయన తండ్రిగారు కుంభినీవారని చెప్పఁబడు తూర్పుయిండియా సంఘమువారి కొలువున డిప్యూటీ కలెక్టరీయుద్యోగము చేసినవారు. ఈయన పెదతాతగారగు రసమాయిదత్తుగారు తనమనుమనివలెనే గొప్పసంస్కృతపండితుఁడు. కలకత్తా స్మాల్ కాజుకోర్టులో జడ్జీపనికి నియమింపఁబడిన స్వదేశీయులలో మొదటివాఁడు.

దత్తుగారి విద్యాభ్యాసము తండ్రిగారు కలెక్టరీపనిచేయుచున్న బంగాళారాష్ట్రమందలి బహుప్రదేశములలో జరిగెను. తండ్రిగారితోపాటు దేశములవెంట దిరిగినకారణముచేత నీయన చిన్నతనము నుండియును ప్రజ

ల యాచారవ్యవహారములును స్థితిగతులును పూర్ణముగ బరిశీలించి చూడఁగలుగుట తటస్థించెను. ఈయనుభవమే ఈయనకు గ్రంథరచనా కాలమున మిక్కిలి యుపయోగకారియయ్యెను, దత్తుగారు, సర్వకళాశాలా పరీక్షలకన్నిఁటికిని హిందూదేశ విద్యాలయములయందే విద్యనభ్యసించి పట్టపరీక్షయందు కృతార్థత నందకపూర్వమే సివిల్ సర్వీసు పరీక్షకింగ్లండునకుఁబోయెను. ఈయనతోడఁ గూడిపోయినవారు సురేంద్రనాథ బెనర్జిగారును బెహరీలాల్ గుప్తాగారును. 1869 సం॥ రమున అనఁగా ఈయనకు 21వ యేట నాపరీక్షయందు విజయమునంది యందీతఁడు తృతీయస్థానమును స్వీకరించెను. ఆకాలముననే ఈతఁడు బారిష్టరీ పరీక్షకు కూడజదివి యందుకూడ విజయమునందెను.

ఫ్రెంచివారికిని ప్రష్యావారికిని యుద్ధములుజరుగుచు బహుకార్యఘూయిష్ఠమైయున్న యాకాలమున నీతఁడు ఐరోపాఖండము నందంతటను సంచారము చేసి హిందూదేశమునకు 1872సం॥ రమున మరలివచ్చి క్రిందితరగతి కలెక్టరీయుద్యోగమును సంపాదించెను. 1883 సం॥ రము ఏప్రిల్ నెలలో నీయనకు మండలాధికారము

చేఁజిక్కెను. అంతకు ముందెప్పుడును ఆఙ్గ్లేయులదొరతనమునం దిట్టియుద్యోగము హిందువుల కిచ్చియుండకపోవుటచే దొరతనమువా రీతనిపై ప్రత్యేక మొక కన్నుంచి ఈతనిదొరతనమును పరికించుచు వచ్చిరిగాని అందీతఁడేమియును సందొసఁగినవాఁడు కాఁడు ఆయుద్యోగమును సమర్థతతో నెఱవేర్చుచు వచ్చినందులకును బంగాళదేశము నందలి జమీందారీరయితులచట్టమును తయారు చేయుటలో దొరతనమువారి కీతఁడు చేసిన సహాయమునకును 1892 సం॥ రమునం దీయనకు సి. ఐ. ఇ బిరుదు లభించెను.

1893 సం॥ రమున బర్ద్వానురాష్ట్రమున కీతని కమీషనరుగా నియమించిరి. ఈకమీషనరీయుద్యోగ మారాష్ట్రమున నాలుగైదు జిల్లాల డిప్యూటీకమీషనర్లపై నధికారము చెలాయించుగొప్పయుద్యోగము. అచ్చటడిప్యూటీకమీషనరీయుద్యోగము మనరాష్ట్రములోని జిల్లాకలెక్టరీయుద్యోగమువంటిది. తరువాత బంగాళదేశము నందలి చట్టనిర్మాణసభలో మెంబరుగా నియమింపబడి 1897 సం॥ రమున నుపజీవితము గైకొనెను. ఇంతటి పిన్నవయస్సుననే ఈయనయుపజీవితము గైకొనుటకు కార

సామర్థ్యతయుండినను తనకీయవలసియుండు లెఫ్టినెంటు గవర్నరీయుద్యోగమును తనకీయమిచే ననికొందఱు చెప్పుదురు దేశాభివృద్ధియందు ఈయనకుఁగల యభిమానముచే గ్రంథములు వ్రాయుకుతూహలముతో విరతివహించిరని కొందఱు చెప్పుదురు.

పిమ్మట 1897 మొదలు 1904 సం॥రమువఱకు నప్పుడప్పుడాతఁడు స్వదేశమునకు తనవారిని చూచిపోవుటకై వచ్చుటతక్క తక్కినకాలమంతయును ఆంగ్లేయదేశమందే వినియోగించెను. ఆదేశమునయున్న కాలములో లండను యూనివర్సిటీ కళాశాలయందతఁడు హిందూదేశచరిత్రములలో నుపన్యాసబోధకుఁడుగా నియమింపఁబడెను. ఈకాలముననే దాదాభాయి నౌరోజిగారును ఉమేశచంద్రబెనర్జిగారును, ఇంగ్లండుననేయుండి హిందూదేశప్రభుత్వసంస్కరణమునకై చేయుప్రయత్నములకీతఁడు సాయపడెను. ఈతఁడు రామాయణమును మహాభారతము నాంగ్లేయభాషను పద్యకావ్యముగా విరచించి ప్రకటించిన కాలమిదియే.

1899సం॥రం డిశంబరు నెలలో లక్నోపట్టణమున జరిగిన దేశీయమహాసభకు అగ్రాసనాధిపతిగావచ్చి దేశ

మునందలి యార్థికస్థితులనుగూర్చిన తనవిజ్ఞానధనమును జనులపై వెదజల్లెను. ఈతనిపరిజ్ఞానము మహాపరిజ్ఞాతయగు కర్జను ప్రభువారి జ్ఞాననేత్రమునకు కలికమువలె పనిచేసెను. భూస్థితితో సంబంధించిన రాజనీతినిగూర్చి యీతఁడుకర్జనుగారిపేర వెల్లడిగ కొన్ని యుత్తరములు వ్రాసి పత్రికలయందు ప్రకటింపగా కర్జనుప్రభువారా యుత్తరములలోనియంశములకన్నింటికిని సమాధానముగ "దొరతనమువారి భూమిపరిపాలనా నీతి" యనియొక గ్రంథమును వ్రాయించిదానిని దేశభాష లన్నిఁటిలోను ప్రకటించి పత్రికచ్ఛేరియందునుఅమ్మించెను. ఈనీతిని ఖండించుచు దత్తుగారుమరల ప్రత్యుత్తరమును వ్రాసిరి. అట్లు ప్రత్యుత్తరము వ్రాయుచునం దెవ్వరు వ్రాసినసంగతులు వాస్తవమో దానినివిమర్శచేయుటకును, మేలైనవని దొరతనమువారు చెప్పఁబడెడు గ్రామములకుఁ బోయిఅచ్చటిరయితులస్థితిగతులను విచారణ చేయుటకును ఒకసంఘమేర్పాటుచేయుఁడని కర్జనుప్రభువారిని కోరెను కానియాప్రభువారందులకంగీకరించినవారు కారు. ఈప్రార్థన ఈయనయొక్కఁడే కాక హిందూదేశవాసులలో ప్రముఖులును ఆంగ్లేయదేశవాసులలో హిందూ

దేశమునం దభిమానముగల ప్రముఖులును మహాజను పూర్వకముగ కూడ జేసినారు. అదివిఫలమయ్యెను. ఈవిషయమై యీయన తరచితరచి చేసినకృషియంతయును శాశ్వతముగా దేశమున నెలకొనుటకై ఈయార్థికచరిత్ర రెండుభాగములుగా రచియించి ప్రకటించెను. ఈగ్రంథమునం దీతని బుద్ధివైశద్యమును అనుభవజ్ఞానసంపత్తియును కార్యవిమర్శనాశక్తియును తేటతెల్లముగ జనులకందఱకును తెలియకపోదు.

హిందూదేశమునకు 1904 సం॥రమునం దీతడు మరలివచ్చినతోడనే కేవలదేశక్షేమతత్పరులగు బరోడా మహారాజు సయాజీరావుగారు ఈయనకు గివిన్యూమంత్రిత్వమునొసంగిరి. ఆయుద్యోగమును రెండుసంవత్సరములు నిర్వర్తించి న్యాయపరిపాలనావ్యాపారమునకును ప్రభుత్వకార్యనిర్వాహకవ్యాపారమునకును సంబంధములేకుండ విడదీసి అయ్యది దేశమునకెంతటి యుపకారముగునో దానిని చేసిచూపెను. వ్యవసాయాభివృద్ధినిగూర్చియు పరిశ్రామకవ్యాప్తినిగూర్చియు ఈయన చేసిన కృషి ఆదేశమున విజృంభించి నలుతట్ల వ్యాప్తమై యున్నది. ప్రాథమికవిద్య యాదేశమున సర్వత్రి జీతము లేకయే

ప్రబలుటకు తగిన యేర్పాటు చేసెను. తరువాత నిరంకుశాధికారకార్యవిమర్శనాసంఘమున సభ్యుఁడుగా నుండుఁడని దొరతనమువారు కోరగా నందులకంగీకరించి హిందూదేశమంతయును తిరిగి ఆసంఘమువారు వ్రాసినరిపోర్టులో హిందూదేశపరిపాలనాసంస్కారములనుగూర్చి తానుమిక్కిలి బలవత్తరముగ నొక్కిపట్టుచు వ్రాసెను.

అది పూర్ణముగ ముగిసినవెనుక 1909 సం॥రం మార్చినెలలో మరల బరోడారాజ్యమున ప్రధానమంత్రిత్వమును స్వీకరించి నవంబరు నెలనడుమువఱకును ఆయుద్యోగకార్యముల మిక్కిలి సమర్థతతో ననుపమానముగ నెరపుచు నాకస్మికముగ వ్యాధిపీడితుండై 1909 నవంబరు నెల 29 తేదిరాత్రి 2గంటలకు తానత్యంతప్రేమతోఁ జూచుకొనుచున్న తనజన్మదేశమును తనకై పరితపించుచున్న స్నేహబృందమును వీడి స్వర్గస్థుఁడయ్యెను.

ఈయన బంగాళిభాషయందు మహాభారతమును ఋగ్వేదమును వచనకావ్యముగ వ్రాసెను. బంగాళాదేశమునందలి జనులందఱునీతని గ్రంథకర్తగా నెఱిఁగినంతబాగుగ రాజకీయవ్యవహర్తగా నెఱుఁగరు. ఈయన యింగ్లీషుభాషయందు వ్రాసినగ్రంథములుకూడ ననేకములు

న్నవి. ఈమహామహుఁడు దేశమునకుఁ జేసినమహోపకారమునకై దేశవాసులెన్వరేరీతి నెంతకొనియాడినను ఈయన ఋణముతీర్చుకొనశక్తులుగారు. ఈదేశభక్తుని మహాదాత్మకొకకానుకగా నీక్రిందిపద్యపంచకమును సమర్పించి యీతనియాత్మకు పునరావృత్తిరహితశాశ్వత బ్రహ్మలోకావాప్తికై పరమాత్మునిబ్రార్థించుచు నీయనజీవితకథన మింతటితో విరమించెదను.

సీ. తనదుర్గతిని బాపు * కొనఁగ భారతమాత
కన్న కాచ్పున వ్రాసిఁ * గన్నబిడ్డ
భారతీయులకడఁ * బ్రభుశక్తి లేదన్న
యపవాదఁ బాపిసి * యట్టి దిట్ట
ప్రజలయం దనురక్తి * ప్రభువు లందాసక్తి
నినుపమంబుగఁ జూపి * నట్టిజాణ
దిగనాఁటిపోయిన * దేశాభిమానంబు
పునరుద్ధరింప మే * కొనిన ప్రోఢ
క్షితి నడచునప్రయత్నసం * సిద్ధికొఱకు
దైవమును సంఘటింపంగఁ * దలఁచి దివికి
నేగుచున్నాఁ డనంగి ర * మేశచంద్ర
దత్తుఁడ స్తంగతుం డయ్యె * ధరణి నుండి.

సీ. ప్రజలకష్టములెల్లఁ * ప్రభులకుఁ దెలుపంగ
వారిభాషను కృతుల్ * వ్రాసినాఁడు
ప్రభులదేశస్థితుల్ * ప్రజలకుఁ దెలియంగ
మాతృభాషను కృతుల్ * మనిచినాఁడు
ప్రజలపక్షముఁ బూని * ప్రభువులకడ కేగి
తివిరి కార్యంబు సా * ధించినాఁడు
ప్రజలచెంతను జేరి * ప్రభులచిక్కుల నెల్లఁ
జాతుర్యముగ బోధ * సలిపినాఁడు
ఉభయపక్షంబులను నీతి * నొక్కరీతి
నెరప యత్నించి నెగడిన * నిపుణులందు
పాటిగల రెండు హిందుదే * శంబునందుఁ
గన రమేశున కాతఁడో * క్కండె కాక.

సీ. సంఘసంస్కరణంబు * జరిగెడుపట్టున
తనవిమర్శనమె ని * దర్శనంబు
దొరతనంబునను సం * స్కరణంబుజరగుచో
భవదుపదేశంబె * ప్రాణపదము
ఆత్మదేశస్థితు * లరయఁ బూనెడునెడ
భవదీయవాక్యంబె * పరమగురువు
వ్యావహారికప్రజ్ఞఁ * బరికించి కనుచోట

తావకప్రజ్ఞయే * దర్పణంబు
భరతఖండంబు నభివృద్ధి * పరచునెడల
పాలకులకైన లోకుల * పాలికైన
నీదువచనపూరణంబె * నియతి యయ్యె
దేశసద్భక్తిసాంద్ర ర * మేశచంద్ర!.

సీ. మితవాదులను జేరి * యతివాదపక్షంబు
తెగనాడి కలహించి * తిరుగ లేదు
అతివాదులను జేరి * మితవాదనీతిని
న్యాయనీతి యని పో * నాడ లేదు
రాజవిద్రోహకా * ర్యములు జేసినవారి
జాడయైనను గంటఁ * జూడ లేదు
ప్రభుపక్షమున జేరి * ప్రజలను దిగఁ ద్రోసి
దొరలని చెప్పుకొనుట * జరప లేదు
సర్వసమముగఁ బ్రభుప్రజా * సమ్మతముగ
మాతృదేశోద్ధరణమె మ * మార్గముగఁ జేసి
స్వస్థతను ధాత్రిఁ బొందిన * స్వచ్ఛమతికి
నీకు స్వస్థతఘనమె ? ర * మేశచంద్ర!.

సీ. ఊహ వచ్చిననాట * నుండియునొక రీతి
కడు మేలిపనిఁ గన్న * కలిమి విడిచి

వయసువచ్చిన దాది * వర్ధింప నెంచి ప్రే
మించినజన్మభూ * మిని త్యజించి
ప్రభుత యిచ్చినది ప్రా * రంభించి సోదర
భావంబునను గాంచు * ప్రజల వీడి
ఆదినుండియు భవ * దాలోచనమె కొన్న
చిరకీర్తియుతు సయా * జీనివిడిచి
ముద్దుసుతునిగఁ గను నార్య * భూమివిడిచి
తోడఁబునిసేయు దేశభక్తులను విడిచి
స్వర్గసుఖమున కొంటేబో * జనున టయ్యొ!
దేశసద్భక్తిసాంద్ర! ర * మేశచంద్ర!

# గ్రంథవిమర్శనము.



చారిత్రవిషయకపరిజ్ఞానమునందు రమేశచంద్రు నకున్న నేర్పుపటిమయొక్క భారతీయున కున్నట్లు చెప్పనొ ప్పదు. చారిత్రవిషయములఁగథారూపమునఁ జదివిన, పాఠకమహాశయులకు నిదర్శనపూర్వకమగు నీతిమార్గము మనస్సునకెక్కఁగలదు. ఈమాధవీకంకణ

వస్తునిర్ణయము.

మనమనగ్రంథకారుఁడు నిరుపమానరాజ నీతిసంపన్నుఁడుచె మహమ్మదీయసామ్రాజ్యనిర్మాతయగు అక్బరుని యొక్కయు ను, ఆతని మంత్రులయొక్కయు, తత్కాలదైశికవ్యవస్థలయొక్కయు చారిత్రమును హృదయంగమంబుగ బోధించనెంచినట్లు గ్రంథమేమాత్రము శ్రద్ధతోఁజదివినను బోధకట్టక మానదు. కథాస్వరూపంబునకు వలయుదానికన్న చారిత్రకవ్యాపారము లిందుపలుతావుల విపులముగ చూపట్టును. దానినిబట్టి చరిత్రాంశముల బాగుగ నెఱింగినపాఠకులు కొందఱికి నవల బంకించంద్రుని నవలలంత మనోరంజకములుగ నుండకపోవచ్చును గాని, చారిత్రకవిషయముల నానుపానులు బాగుగాఁదెలియని

వారి కభిరుచి యీ భాష త్తయినను తగ్గనేరదు. చారిత్రికప రిజ్ఞాన మెల్లెడలను నీయన కావేశపేరితంబై వలదనినను తనంతట తానుగవచ్చి కలమునుండి జారిపడుచుండునటు లిందు తెలిసికొనఁదగు. ఇదియునుంగాక ఆంగ్లేయభాషను వ్రాయఁబడినయీ గ్రంథముహిందూదేశసందర్భముల నెఱుంగని యాంగ్లేయదేశవాస్తవ్యుల కుద్దేశింపఁబడినది. అందువలన చారిత్రికవిషయములు విపులము లనవసరము లనరాదు. అచ్చటివారికి మనదేశపుటాచారవ్యవహారములు సంగతిసందర్భము తెలియకపడవు. ఆకారణంబున సాంఘికాచారంబులుకూడఁ గొన్ని మిక్కిలివివరముగ దెలుపవలసివచ్చెను. అవి దేశీయపాఠకుల కొక్కింతయు ననవసరముగనే కనఁబడవచ్చుంగాని వంగదేశమునకును మనదేశమునకును గల యాచారవ్యత్యాసములను దెలిసికొనఁ దలంచినవారి కవియుననవసరములు కానోపవు.

రమేశచంద్రుఁడు బకించంద్రుని యుపదేశమున దేశభాషను వచనప్రబంధములువ్రాయఁగడంగినట్లు ఈతని జీవచరిత్రయందుఁ గనంబడును. బంకించంద్రుని చంద్రశేఖరమును ఈమాధవీకంకణమును జక్కఁగఁ బరిశీలించి చూచినచో వీరిరువురును చేరి యొక్కమార్గముననుహిం

ద్వైవాహిక సిద్ధాంతములను స్త్రీల పాతివ్రత్య నియమ
ములను జూపింపఁదలఁచి, ఈ రెండు గ్రంథములను వ్రాసి
నట్లు కన్పట్టెను. కథాస్వరూపము పరిమర్శించి చూచిన
రెండింటియందును గూడ, ఒకరియం దనురక్తయై యుం
డిన యువతి మఱియొక్కరిని పెండ్లాడుటయే తటస్థించిన
ది. ఒకరియం దుపస్థితంబై యున్న మనంబును మఱియొ
క్కరిపై మలపవలసివచ్చినది. ఉభయత్ర చిట్టచివరకు వి
జయమే కలిగినట్లు చెప్పవచ్చు. సంపూర్ణవిజయము కలిగి
నను కలుగకున్నను ప్రవాహంబునఁ గొట్టుకొనిపోవునను
రాగంబు విధిచోదితంబైన వివాహబంధకారణంబున నే
టికెదురీది, యానీటివడి నలసటఁ జెందుచు నడుమనడుమ
నిలుచుచు గమ్యస్థానముపై లక్ష్యంబుంచుచు వేసినయడు
గుపట్టు జారిపోకుండఁ గాలూని మనంబెన్ని యొకడుగం
డకు లోను జేయు ప్రస్తిమితము నొందుటమాత్రముకన్న
ట్టికమానదు. పూర్ణవిజయ మీ రెండు గ్రంథములందును
గూడఁ జెప్పఁబడలేదు. గానితన్మార్గమునకుఁ గలిగిన యు
పరోధములన్నియు నుతొలంగించి కథమఱి ముదముట్టెను.
కాని యీసిద్ధాంతముల నెరపుటకో నీ రెండు గ్రంథము
లలోను త్రొక్కినమార్గములు రెండును కేవలభిన్నములు.

హిందువులు మొగముపైనుండి కడిగిన మహమ్మదీయు లు క్రిందినుండి కడిగినట్లును, హిందువులు ఎడమనుండికు డికి వ్రాసిన మహమ్మదీయులు కుడినుండి యెడమకు వ్రాసినట్టును, తద్గమ్యస్థానమును చేర్చుమార్గములు రెం డును భేదించినవి.

శైవలిని చంచలచిత్త. హేమలత నిశ్చలహృద య. ఆమెకు చురుకుపాలు హెచ్చు. దుడుకుదన మధిక ము. ఈమె శాంతమునకు నిధానము. శైవలినికడ ప్రపం చవ్యాపారములన్నిఁటియందునను గూడ విశేషమైన తెలివి తేట లున్నయవి. ఆవులించిన ప్రేవులు లెక్క పెట్టురకము. ఆమెకున్నంతసమయస్ఫూర్తి మఱియొక్క రొకఁ గన్పట్ట దు. హేమలతకు తెలివితేటలు లేకపోలేదు. ఈమె దారి నెపోయి దారినె వచ్చునది. అందువల్లనే శైవలిని మనో వాగ్వ్యభిచారంబులకు లోనై పతితయై యెన్నియో యాతనలం బొందిపశ్చాత్తప్తయై మరల యథామార్గ మునకుదీసికొని రాఁబడవలసివచ్చినది. హేమలత కట్టిదేమి యునక్కఱ లేకుండఁగనే యవిలంఘ్యంబగు ననుబంధం బె ప్పుడు సంప్రాప్తంబయ్యెనో యప్పుడు తనవిధ్యుక్త ధర్మ మును గుర్తెఱింగి దానికి వేయిమనో ధైర్యంబు నవలం

క్షించి పతిధ్యానతత్పరయై నరేంద్రునకు ధైర్యస్థైర్యము లుచెప్పి యాతనికిఁదనపైనుండు మోహానురాగముసు మరల్ప నెన్నియోపాట్లు పడియెను. తో బుతభర్త కావలయునని ప్రేమించి యభివృద్ధినొందించినయనురాగము తుదకుసోదర ప్రేమగ మార్పవలసివచ్చెను. అట్టి కార్యమందలికష్ట మాచేయువారికె యెఱుక. హేమలతానరేంద్రులపునస్సమాగమములు మధురానాథునిసువర్ణదేవాలయమున గావించెను. దేవాలయమునఁ బ్రవేశించుటతోడనే యెంతటియపవిత్రునకైనను ఒక్కింతసదుద్దేశము కలుగకమానదు. అట్టిచో సద్గుణరాసులమాటచెప్పనేటికి? హేమలత గుణరాశి. అట్టినారీమణిసచ్చరిత్రకు భగవత్సాన్నిధ్యంబుసంప్రాప్తంబైన నెట్టిదుర్ఘటకార్యమైనను సుకరంబుగపొసంగఁగలదని యోచించి గ్రంథకర్త తత్సమాగమంబున కట్టిదివ్యస్థలంబు సంఘటించె. హేమలతానరేంద్రులకు జరిగినసంభాషణము గనుఁగొనిన ఎంత రాతిగుండె గలవారికిని మనస్సు నీరుగాక మానదు.

మనుజునకు భార్యయందును తనూజాతయందును సహోదరుని యందును అందఱియందును అనుబంధమునకు

ప్రేమయే మూలము. ఆ ప్రేమ యొక్క యెడ మోహముగా బరిణమించినది. ఇంకొక్క యెడ వాత్సల్యముగా మారిన ది. వస్తుతత్వ మొక్కటియే యైనను మనస్సు దేనియం దేభావమునఁ బ్రవర్తించునో యట్టి భావవికారము క్రమ క్రమముగ నభివృద్ధి పొందుచుండు. పోవుపోవు మార్గము నుండి వెనుకకు మరలించుట దుర్ఘటమే యగును గాని, అట్టిది చేయవలసివచ్చినప్పుడు ఎన్నికష్టములు వచ్చిన నేమి చేసిచూపుట కర్తవ్యము. అన్యథా వర్తించుట పాత కము. ముక్తికంతకును మనమత సిద్ధాంతమును బట్టి యిం ద్రియనిగ్రహమే కారణము. అట్టి యింద్రియనిగ్రహము నే ర్పుటకే యిట్టిపరీక్ష లేర్పడినవి. ఇది తెలియక మనస్సున కిచ్చవచ్చినవారినే పెండ్లియాడుట యుత్తమోత్తమంబ నియు నదియే పతివ్రతాత్వమునకు మూలం బనియు బో ధింపనెంచెదరు. మన పురాణములయందలి స్వయంవర గాథలఁ జదివి చూచితిమేని శ్రీరాముని కాలము నాఁటి నుండియు స్త్రీలకు స్వచ్ఛందమైన స్వయంవరము లేనట్టు కన్పట్టు. గురువులు చెప్పిన లక్ష్యమేదియో యొకటి మన స్సున బెట్టుకొని అట్టివాఁ డెవ్వఁడైనను వానినే వరియిం చుట ఆకాలపుస్త్రీలకు స్వయంవరముగా భావింపఁబడి

యెను. అయ్యది నిశ్చయముగ స్వయంవరమా? స్వయంవర మనిన మనస్సునకు వచ్చినవాని నేవరింపవలయును. ఈదృశంబగుసిద్ధాంతము గ్రంథకర్త దృష్టాంతపూర్వకముగఁ జూపదలంచినట్లుకనిపెట్టఁదగు.

హిందూమతసిద్ధాంతములనుబట్టి లభ్యంబైనపదార్థముతో సంతుష్టి నందవలయును. విధివిహితంబగు వస్తువులందు నీయాసక్తి వర్గమునీకు శ్రేయోదాయకంబని బోధించి నియమించినదానియందు నీమనసును నీవు ప్రవేశపెట్టలేవేని ముక్తిమార్గము నెట్లుసాధింపనోపుదువని మనసిద్ధాంతములు బోధించుచున్నవి. అన్యదేశసిద్ధాంతములును నీమార్గమునె యనుసరించి పోయినట్లు షేక్సుపియర్ మున్నగుగ్రంథకారులువ్రాసినసిద్ధాంతములవలన విదితమగుచున్నది. షేక్సుపియరు తన "వణిక్ప్రవరకోదంతము" (Merchant of Venice)న ప్రహార్షిక (Portia)కునియమించినస్వయంవరకార్యముఁ గనఁగొనిననీసిద్ధాంతమే తెలియఁగలదు.

నరేంద్రునకుఁబ్రివాసగతి లభ్యంబైనది. హేమలతనుండి ఎడఁబాటు కలుగనున్నది. వారిరువురకును జిన్ననాఁటినుండియును దినదినప్రవర్ధమానముగఁ బెఱుగు

చున్న యనురాగవల్లిక యీక్షణయంత్రపోషణ లేకుండఁ
బోవుచున్నది. హేమలత యత్యంతవాత్సల్యంబునఁ దం
నామనిర్ణ చిన మాధవీలతనుండి యొక లతాఖండము
యము. దుంచి దానిని కంకణముగా నలవరించి న
రేంద్రుఁడు బద్ధానురాగంబున "పువ్వులు నే
డో రేపో యెండిపోవును. కొంతమాత్రము విశేషకాల
ముండును. నీకు నాయెడ నెంతకాలము దయయుండునో
యంతకాలము దీనిని జ్ఞాపకార్థముగ బదిలముగనుంచు
కొనుము. నాస్మరణము నీమనస్సునఁ గలుగకుండునని దీ
నిని పనికిమాలినదానిగ నెంచి విసర్జించుము" అని చెప్పి
యామెహస్తము నలంకరించెను. పిమ్మట వారిరువురును
హేమలతాశిరీషుల వివాహానంతరము సువర్ణదేవాలయ
మున సమావేశమైనారు. నరేంద్రుని యెంతటినిగ్రహచి
త్తమో యంతటి బద్ధానురాగము. చిన్నతనంబునుండి
యును కడుంగడు ప్రేమించినయాముద్దరాలిపై ననురాగం
బు మనంబునఁ దగుల్కొనియె చిత్తము ఆమెనుండి మర
లిరాకయుండుటచే నామె సాంగత్యమెంతయో కష్టము మీ
ద నిరాకరింప వలసినవాఁడయ్యెను. ఆమెయెడఁ గలయ
నురాగంబు పరిపూర్ణంబై యుండుటచే తారాసుందరి

నెంతవిశ్వసనీయ మైనను, ఎల్లప్పుడును వెన్నంటియే వచ్చుచుండినను, అతఁడు తనమనంబును మాత్రమామె యెడ కామవికారంబునకు లోనుగానిచ్చినాఁడు కాఁడు. అంతటిమోహానుబంధమున మరలివచ్చుసరికి ఆప్రేమైక నిదానము, ఆసద్గుణఖని యాతనివిడిచి చిన్నఁనాటి చెలికాని శిరీషుని పెండ్లియాడియుండెను. తదనంతర మెంతయోకాలమునకుఁగాని వారియువురకును సమావేశముకలిగినది కాదు. అప్పటికి మాధవీకంకణ మెండిపోయినది. కాఁపయంతయును ముక్కముక్కలైనది. హేమలతకు నరేంద్రుని యెడలఁ గలయనురాగ మెట్టిదియోగాని జీర్ణమై యుండినయాకాడ నొక్క ముక్కయైన నూడిపోకుండ దారముతో గ్రుచ్చి పదిలముగ దాచి యాతని యెట్టయెదుట గంగాప్రవేశము చేసెను. దానితో మాధవీకంకణమును మనగ్రంథమును గూడఁ ముదముట్టినని. అభిజ్ఞాన శాకుంతల నాటకమునకును ఆంగ్లేయ వ్యాఖ్యాతలు “The lost ring” అనగా “నష్టాంగుళీయకము” అని యెట్లు నామకరణము చేసిరో యట్లేదీని కీమాధవీకంకణ నామకరణమెంతయుఁ దగియున్నది.

దీనికి బంగాళీభాషయందు మాధవీకంకణ మని

యును, ఆంగ్లేయభాషయందు "The Slave Girl of Agra" తార్తారదాసీసుందరి యనియు నామములున్నవి. ఇందేదిసమంజసమో మనమాలోచింప వలసివచ్చునెడ బంగాళభాషయందుంచిననామమే తగియున్న దనిచెప్ప నొప్పు.

జలేఖానరేంద్రులకు ఆగ్రాకోటయందు సమావేశము సంఘటిల్లినది. నరేంద్రున కామెయెడ ననురాగ మంకురించుటకు కారణముప్రత్యుపకారము. తాన నారోగ్యతల్పగుఁడై యున్నవేళల నామె తనకు చేసిన యుపచారములకై తన విధ్యుక్తధర్మము నాతఁడు నెఱప నెంచి నరేంద్రుఁడు యామెయెడఁ బ్రసన్నహృదయుం డయ్యెను. ఆతని హృదయంబునం దెల్లప్పుడును హేమలతయే యధివసించియుండుటచే జలేఖా యెంతమనోహారిణియైనను నామెయెడఁ గామతప్తుండు కాఁడయ్యెను. ప్రకృతి సిద్ధం బగు హృదయ వికారం బొకటి రెండుసారు లాతనికామెయెడఁ గలిగినట్లు, మోహవికారమున కక్షరాభ్యాస కార్యంబులగు చుంబనాదిక్రియల కాతఁడు పాల్పడినట్లును, గ్రంథకర్త ఆయాసందర్భంబులఁజూపి యున్నాడు. కాని యామె

యాతనిమనోదార్ఢ్యంబు పరీక్షింపఁదలంచి యాతఁనిలోఁ బలుచుకొనఁ బ్రయత్నించువరకు నయ్యది యాతనిమనంబునుండి యదృశ్యమయ్యెను. మనంబున నెయ్యదిగాఢంబుగనాటుకొనెనో అదియొకదానిలిచియుండునది. ఒకయెడ గాఢానురాగంబున్న యప్పుడుమరియొక్క యెడనట్టిప్రేమం బుదయించుటెట్లు? బద్ధానురాగ యగు జలేఖాసుందరియెడ నాతఁడగపరచిన దంతయును కృతజ్ఞతాపూర్వకంబగు ప్రత్యుపకార మనవలయుం గాని కాముకవ్యాపారభాజనం బగు మోహవిషయం బనరాదు. గ్రంథమునం దాదిమొదలంతమువరకు నెచ్చట జూచినను నరేంద్రునిమనంబు మరియొక్కమాదిరిని ప్రవర్తించునట్లుదృష్టాంతము కానరాదు. గ్రంథమున గ్రంథకర్త ప్రధానకార్యముగా నొనర్పఁదలంచినది వైవాహికసిద్ధాంతమునందలినీతిగాని ప్రత్యుపకారకార్యంబు కాదు. ఆకారణంబున తారాసుందరి యని దీనికిఁ బేరిడుటసమంజసముగాఁ గన్పట్టదు. నరేంద్రునిహృదయమునందు హేమలతపైఁ గలయనురాగ మాజలేఖాయను మచ్చికాతిపై గీటుపుచ్చినగాని జగద్విదితము కానేరదని మాటవాస్తవమె. అగుగాక! సాధనములుగా నుండిన వాని కన్నిటికిని బ్రాధాన్య మీయవచ్చునా?

జలేఖా యనురాగమునే యీ గ్రంథమునందలి ప్రధానాంశముగా బరిగణింపరాదా యందురేమో? అందులకు గ్రంథకర్త తగినసాధనసామగ్రి నొసంగినాఁడు కాడు. జలేఖాయందుఁ గన్పట్టిన దేకపక్ష మోహమైనది. నరేంద్రునిహృదయ మెప్పుడును నందులకంగీకరింప లేదు. అట్లుండినను దానిని ప్రధానాంశం బని చెప్పుదుమా నిన కథానిర్మాణోద్దేశమునకు వ్యభిచారము సంభవము కాక మానదు. ఇందు హేమలతా నరేంద్రులకుఁ గలయనురాగ మంగి. రెండవది యంగము. మనురానియనుచరులు గాయకబాలునివేషమున నరేంద్రుని వెన్నంటి వచ్చి జలేఖాను ఖడ్గమున కెర జేసినపు డామె ప్రాణావశిష్టయై పలికిన కడపటిపలుకులు వినినచో నామె మోహ మెంతటి గాఢంపు మోహమో స్పష్టపడఁగలదు. రాజస్థానమునందలి మరుస్థలంబున పటకుటీరంబున నర్ధరాత్రిసమయంబున వారిరువురును నేకాంతముగ సంభాషించునప్పుడు నరేంద్రుఁడు తనమనంబు మఱియొక్క యువతిపైనున్నదని చెప్పువఱకు నరేంద్రునిహృదయరహస్య మామె యెఱుఁగదు. తనకొఱకై నరేంద్రుఁడు చేసిన కార్యములన్నియు నంతవఱకును మోహకార్యంబులుగనే యామె సంబా

వించెను. అప్పు డాయెకుఁ గలిగిన భగ్నమనోరథం బెట్టిది యో జలేఖా నరేంద్రుని వెనుకఁ జేర గుత్తముగా నిరువు రును మాటలాడుకొనిన సంభాషణమునుబట్టి విదితమగు టలేదా?

ప్రథమ తృతీయఖండముల జలేఖా ప్రసంగమే లే కుండుటయు చతుర్థఖండమునందైనను హేమలతనుగూ ర్చియు తత్కుటుంబమునుగూర్చియు ముచ్చటించు ప్రకర ణముల జలేఖానుగూర్చిన ప్రస్తావము వ్యంగ్యంబగుటయు ద్వితీయఖండమున పూర్ణముగను, చతుర్థఖండమున హేమ లతా ప్రసంగము లేని ప్రకరణములును తీసివేసిన మాధవీ కంకణ కథాసందర్భమునకే మాత్రమును లోటు లేకుండ నుండుటయును గనిపెట్టి చూచిన మొదట బంగాళీభాష యందు రచించిన మాధవీకంకణమునందు జలేఖా ప్రస్తావ మే లేదేమోయని గట్టిసందియముపొడముచున్నవి. నా యూహయే నిశ్చయమైనచో నామవిచారణముంగూర్చి న నాయూనిర్ధారణము వికల్పము లేకుండ నిలిచియుండఁ గలదు.

రమేశచంద్రుని రచనాసైపుణ్యము మిగుల వి [illegible]ణమైనది. ఈనవలయందాతఁడు చారిత్రకవిషయము

ల చిత్రకథాప్రసంగమున నిమిడ్చి దేశదేశముల వెదఁజ ల్లనెంచినాఁడు. ఆఙ్గ్లేయభాషయందు శృంగారవచన ప్రబంధముల రచియించిన రైనాల్డును, వీరశృంగారమిశ్రితంబుగ చారిత్రకవిషయంబులఁబొందుపఱచిన స్కాట్టును, అనుసరించి యీనవలను రసమంజసముగ నిర్మించెను. రైనాల్డునను కరించి ఆగ్రాకోటయందలి అంతఃపురరహస్యములన్నియును బైటఁబెట్టినాఁడు. ఒరున కెవ్వారికిని దెలియకుండ పురుషులకంతఃపుర ప్రవేశ మెట్లుకలుగునో అదియెల్ల విశదీకరించినాఁడు. స్కాట్టుననుసరించి శృంగారవీరకరుణారసము లింపు నననుపమానంబుగ నెలకొల్పినాఁడు. తరుణముదొరకినపుడెల్ల భారతీయులజాతీయధనము సీతులవెదజల్లినాఁడు. ఈతనిగ్రంథములును బంకిం చంద్రునిగ్రంథములును శ్రద్ధతో పఠించినవారలకు మనదేశమునందలి యాచారవ్యవహారములన్నింటికిని ఆదికారణము లెవ్వియో, సంఘమునకవి యెంత క్షేమకరములో వానిని మనమిప్పుడు విస్మరించి యెట్లు భ్రష్టులమైతిమో ఒలిచినఅరటిపండు మాదిరి మనంబునకు గోచరింపకమానదు. హిందూవితంతువుల నిర్బంధవైధవ్యము సంఘమున కెంతయుపయోగకరమో, శిరీషుని సోదరియగు శైవలిని గుణవర్ణనమున బోధించియున్నాఁడు. సెూళీవం

డుగను వర్ణించుపట్టున, నవకుమారుని వాహ్యాళి జనుల నందఱ నేకీభావము చేయుచు రాజునెడ ప్రజల భక్తిగౌరవము లెట్లుండునో విశదీకరించినాఁడు. నవకుమారుని భార్య మధురానివాసము చేయఁబోవుపట్టున హిందూసుందరుల విధ్యుక్తధర్మములు చూపినాఁడు. గోకులదాసుని రాజ్యనిర్వాహకతంత్రంబులం గనుంగొనిన, రాజ్యసంపాదనమునకై యెన్నియేని మాయోపాయముల చేయవలసివచ్చుననియు, న్యాయైక మార్గమందులకు తఱచుగ నుపయోగకారి కాదనియుఁగూడఁ దెలియఁజెప్పినాఁడు. శిరీషునిబలంగమంతయును మధురానగరమునఁ జేరెడుపట్టున, కృష్ణునందు జనుల కెట్టిభక్తితాత్పర్యము లున్నవో వ్యక్తీకరించినాఁడు. జహంగీరునియెడ తప్పు కలిగినప్పుడు మానసింహుఁడు సలీమును తోసిపుచ్చి తనమేనల్లుఁడగు ఖుస్రూకుమారునకు రాజ్యమొసంగుమని బోధింపఁ ఆతనియాలోచనమును గొనక సర్వతంత్రస్వతంత్రుఁడగు అక్బరుచక్రవర్తి హితవచనంబుల రాజకీయధర్మంబులబోధించినాఁడు. తొందరపడి యుపకారములు సేయువారియెడ నెట్టినిర్మలభావంబున ప్రవర్తపవలయునో అయ్యాది నరేంద్రునియెడల శిరీషుఁడుకనఁబఱచినసోదరభా

వంబునను, ఔదార్యలక్షణములవలనను, స్ఫుటపఱచినాఁడు రైనాల్డునవలల ఆంగ్లేయదేశపాలకుం డగుజార్జిప్రభుని ప్రవర్తనమువలె జహంగీరుప్రవర్తనము నీతఁడు గర్హ్యముగఁ జూపనెంచినాఁడు. కేవలకాముకవ్యాపారంబున ప్రవర్తించెడువారలకు కలిగెడుచాపల్యము మంచిచెడ్డలను విచారింపనీయకుండ స్త్రీపురుషవివక్షతయైనఁ గననీయకుండ స్త్రీరూపసందర్శనమాత్రంబున మోహావిష్టులను చేయునని యీతఁడు స్త్రీరూపధారి యగునరేంద్రుని యాలింగన మభిలషింపఁగోరినజహంగీరుని ప్రవర్తనమున బోధింపనెంచినాఁడు. వేమేల? ఇందీతఁడు నెలకొల్పనినీతి వేఱొక్కెడ కన్పట్టు నని చెప్పసాహసింపలేము.

ఇంక పాత్రోచితం బగుగుణపోషణ మీతఁ డెంతసమంజసముగఁ గావించినవాఁడో దానియొప్పుఁ బరిశీలించి చూతము. ఈగ్రంథమునందలి ప్రధానపాత్రము నరేంద్రనాథుఁడు. ఆతనిగుణవర్ణనము మున్ముందుపరీక్షింతము.

నరేంద్రుఁడు సత్కులసంజాతుఁడు. నిష్కపటహృదయుఁడు. మాయామర్మము లెఱింగినవాఁడు కాఁడు. ఆతనికుద్రేకము హెచ్చు. పెద్దకుటుంబములోఁ జేరిన

మానవులు. సామాన్యముగ తమ యొద్దనుండు తప్పులను సైతము మొప్పులుగా సమర్థించుచు వాని నొప్పు వఁకేం కొనకుందురు. అట్టియాభిజాత్యదుర్గుణ మీతఁడు నిఁడు. నికడ లేదని నరేంద్రనవకుమారుల నౌకావిష యికవ్యాపారంబుపట్టున తెలియందగు. జాత్యభిమానమును దేశాభిమానమును నీతనికిమెండు. అక్బరు పాదుషా యెంతటి గౌరవ మొసంగినను, యెంతటి ముద్దులాడి తనకయాచితంబుగ తనంతఁజాలభ్యంబైనను తనజన్మదేశమును విడిచియుండనాతనికి మనసొప్పినదికాదు. దేశము లన్నియును దిరిగినాఁడు. మహావీరుఁడై ప్రవర్తించినాఁడు. యుద్ధకార్యముల నారితేరినాఁడు. చక్రవర్తికడ మన్నన లందినాఁడు. ఎన్నిగౌరవములు కలిగినను ఆతనిమనంబుమాత్రము తనచిన్ననాఁటిచెలిమికత్తెపై నుండి మరలిరాదయ్యెను. కృతజ్ఞతాభావ మాతనియెడ మెండు. స్వాతంత్ర్యమునం దభిలాష హెచ్చు. జలేఖా పొందుచున్న బానిసజీవనమును గని యామెనందుండి విముక్తం జేయుటకై యాతఁ డెంతపరితపించెనో యెంత యెంత లాయాసముల నందెనో ద్వితీయఖండమున తత్కథాసందర్భమును పఠించినచోఁ దెలియఁగలదు. తనకు

జలేఖా చూపినయుపకారమునకు ప్రత్యుపకారము చూపి తనకృతజ్ఞతం దెలిపెను. బానిసత్వమునందియున్న జలేఖానుగూర్చి తద్విముక్తికై నరేంద్రుండు పడినసంతాపమును అందులకాతఁ డొనర్చినసాహసకార్యములును ప్రశంసనీయములు.

నరేంద్రునినిష్కాపట్యము, ఔదార్యగుణవిశేషము, వీరపురుషలక్షణములు, మానసింహునకాతనియందు కనికరముపుట్టించెను. తత్కారణంబున జగద్విశ్రుతమైన యశస్సంపాదనమైనది.

అన్నియును బాగుగనేయున్నవిగాని అయిదువతన మొక్కటిమాత్రము తక్కువయనినయట్లు ఆతనికదృష్ట మొక్కటియేలోపము. నరేంద్రుఁడెంతసద్గుణఖనియో యంత మందభాగ్యుఁడు. అదృష్టదేవత యాతని కెప్పుడును ప్రతికూలముగనే పనిచేసినది. మొదటినుండియును అత్యంతవాత్సల్యంబున పెంచి పెద్దను జేయుచున్న నవకుమారునియెడ, నౌకావినోదసమయంబున ఆత్మదేశమండలియభిమానమును నావేశ మొకటి యావరించి నవకుమారుని ప్రాణముమీఁదికిఁ దెచ్చెను. అంతకుమున్ను కొలఁది కాలమునుండి నవకుమారునకును భార్యకును

హేమలతానరేంద్రములవివాహమునుగూర్చినచర్చలు జరుగుచున్నవి. నవకుమారునిభార్య నరేంద్రునిపక్షమును బూని పనిచేయుచున్నది. గోకులదాసు ప్రతికూలముగ పనిచేయుచున్నవాఁడు. ఉభయుల యోచనలునుగూడ నాతనిమనంబున కుచితముగనే తోఁచుచున్నవి. భార్యచెప్పినదానినిబట్టి యుభయసంస్థానములు నేకీభవించుమార్గము కన్పట్టెను. గోకులదాసు చెప్పినమార్గమునునుగూడ నట్టిదియే చూపట్టెను. మొదటిది సన్మార్గము. ప్రతిస్పర్ధగలకుటుంబములు రెండును కలియుటకు తగినసాధనము. రెండవది స్పర్ధ మఱింతబలపడుటకు కారణము. తంత్రము కుచ్ఛితతంత్రము. కాని గోకులదాసునచ్చచెప్పినకొన్ని కారణములనుబట్టి యీ రెండవదికుచ్ఛితతంత్రమైనను, తన్మూలమున తనవంశప్రతిష్ఠ నిలుచు ననియును, అందువలన యశస్సంపాదనమగుననియు పొడకట్టెను. అట్టిసమయమున నీదుడుకుకార్యము సంఘటిల్లినది. నవకుమారునిమనస్సు పూర్ణముగ గోకులదాసుపక్షమునఁ జేరినది. హేమలతయు తజ్జననియు నత్యంతవిషాదమునొందిరి. అదియే రాజ్యపరిచ్యుతికి కారణమైనది. ఇదియంతయును అదృష్టదేవతామహిమంబు గాక మఱియేమగును? తల్లి

దంద్రులిరువురును హేమలత సీతనికిచ్చియే వివాహము చేయవలెనని సంకల్పించుకొనిరి. ఆవును దూడయునుండ గ నడుమ గుంజార్చిననుసామెత నిజముగమంత్రిమత్రియొ కని గాలికిఁగొట్టుకొనిపోయెడువానిని తెచ్చి నడుమ ప్ర తిష్ఠించి వానికిహేమలతను వివాహముచేయించెను. దీనింబట్టి.

"తానుదలఁపనొకటి * దైవమొండుదలంచు
ననెడినుడియథార్థ. * మగునుగాదె"

మనుజుఁడు కేవల మదృష్టదేవత యెట్లునడపిన నట్లు న డచువాఁడెకాని స్వతంత్రుఁడు కాఁడని తేలుచున్నది.

" కర్మమునఁ బుట్టు జంతువు
కర్మముననువృద్ధిబొందుఁ * గర్మమునఁ జెడుఁగా
కర్మము మూలము జగతికి
కర్మమె సుఖదుఃఖములకుఁ * గారణముధిపా "

అను భాగవతవచనమిందు సార్థకమగుచున్నది. దీనినే షేక్స్పియరు తన (Twelfth night.) ద్వాదశయామి నియందు.

"Fate show thy force, What is decreed must be,
We are not masters of ourselves ; let it be."

దీనియర్థమిది.

"కర్మమా! నీదుబలమెల్లఁ * గనఁబఱుపుము
కర్తలముగాము మాచేయు * కార్యములకు
లిఖిత మెటులుండెనో యట్లు * లేగదయగు
జరుగఁదలచిన తెన్నన జరుగనిమ్ము"

అని చెప్పియున్నాఁడు. ఈ సిద్ధాంతములను సాదృశ్యరూపంబుగ గ్రంథకర్త మనకుఁ జూపందలంచినాఁడు. ఇంకొక్కటిజూడుడు. నరేంద్రుఁడు కేవలమును మందభాగ్యుఁడే కాకుండిన, తన యెడ ననురాగముగల జలేఖాను పరిణయము కాలేకపోయెను. అనురాగముగల హేమలత లభ్యము కాకపోయెను. తల్లి కిష్టముండెను. తండ్రికిష్టముండెను. వధువున కనురాగముండెను. వరుఁడందులకు భీష్మించుకొనికూర్చుండెను. మంత్రి గోకులదాసు కేవలనిమిత్తమాత్రముగాని యయ్యది యన్యథాకరించుట కేవల దైవనియుక్తి కాదా?

జలేఖా విషయమునఁగూడ నియ్యదియట్లె జరిగినది. జలేఖాకు పరవశానురాగముండెను. నరేంద్రునిన కామె

యెడ దయకుదిరెను. ఒక్కొక్కప్పుడయ్యది మోహకార్యముగాఁగూడఁ బరిణమించు తరుణము లభ్యమయ్యెను. అట్టిచో వారిరువురకును వైవాహికానుబంధము సంఘటిల్లకపోవుట యెట్లు? ఇది విధివిక్రృతికాదా?

ఈవిధివిక్రృతి తుదకెట్లుగా పరిణమించినది? హేమలతను పెండ్లాడిన శిరీషునకు మనశ్శాంతి లేకుండబోయినది. నరేంద్రుఁడాశాభంగమునకు లోనయ్యెను. హేమలత గుండె కుదుటఁబెట్టుకొనలేకపోయెను. తల్లి సంసార పరిచ్యుతికిదియ మూలమయ్యెను.

దీనివలన మనము నేర్చుకొనవలసినది పరస్పరానురాగముగల యువయువతీమణుల కెడబాటుగలిగిన నయ్యది వారొక్కరికేగాక తత్సంబంధ బాంధవ్యమున నున్నవారికెల్లరకుఁగూడ దుఃఖభాజనంబగునని యెడి నీతి.

ఇంకొక్కటి హేమలత తాను స్వయముగ మనంబున సంకల్పించుకొనిన దానికంటె తల్లి యుపదేశించిన దానికంటె, తండ్రియొక్క యుపదేశమే ప్రాముఖ్యమనియు అదియే శ్రేయోదాయకంబనియు, గృహమునకెవ్వండు యజమానియై ప్రవర్తిల్లునో వానికి సర్వస్వాతం

త్ర్యము లేకుండిన ఆగృహనిర్వాహకమున కన్నియు నంత రాయములే సంఘటిల్లుననియు, మంత్రివలె నుపచరించు భార్య యుపదేశమైనను భర్తకు దిక్ప్రదర్శన మాత్రంబ కాని ఆజ్ఞారూపంబుగ వెలయరాదనియును, అత్యల్పవయస్కలును ప్రపంచానుభవవిహీనలునగు బాలికలు తాముగ పతుల నన్వేషించు కార్యముల స్వతంత్రలై మెలంగరాదనియు, వారిమనంబులట్టి వయస్సున దూరదృష్టికి చాలియుండునవి కావనియును, తలిదండ్రులు బిడ్డల శ్రేయోభివృద్ధినిగూర్చిన సదుపదేశము గలవారుగాన మహదైశ్వర్యకాములగు వారెందఱెందఱో యుండ సద్గుణసంపన్నుఁడొకని తన యిచ్చవచ్చినవానిని తనసుతకు భర్తగావిధించుట కర్తవ్యమనియు, నిందు సాదృశ్యరూపముగ బోధించి హిందూసిద్ధాంతగౌరవమును చూపనెంచినాడు. ఇదికూడ మనమందు నేర్వఁదగినవిషయము.

హేమలతపతివ్రతాతిలకము. హృదయమునిష్కపట హృదయము. కానినరేంద్రుని వలెనూత్నముగ బయలువడునదికాదు. ఎంతటిదుర్ఘట కార్యంబు నైనను సాధింపఁగలమనోదార్ఢ్యం బీమెకడ నున్నది. లేకున్న నరేంద్రునిపై గాఢముగఁ దగుల్కొనిన యనురాగమునె

ట్లుమరలింపఁగలిగెను. ఈమెది లోతుగుండె. త
అచిచూచినకాని యీమెహృదయమునం దేమి
హేమ యిమిడియున్నదో తెలిసికొనుట కవకాశము లేదు
లత కాని నరేంద్రుని సందర్శింపవచ్చునప్పటికి తన
హృదయము నెంతదిట్టపఱచుచుకొన్నను, ఆతని
నొంటరిగ సందర్శింప లేకపోయినది. దానికొ
అక్కె శైవలినివలన నెంతయోబోధ కావలసివచ్చెను,
కొంతవడికి మనస్సు గట్టిచేసికొని విధ్యుక్తధర్మమును నె
రవేర్చఁదలంచి యాతని నెదుర్కొన సాహసించెను. దీనికే
మికారణ మందురా? ఈవివాహ విషయము దైవప్రే
రితంబు కానితనకు నరేంద్రునియెడ ననురాగంబు లేక
పోవుట చేత కాదని నరేంద్రునకుఁ దెలుపుటకు. ఆమె
హృదయానురాగము నరేంద్రునియెడ నెట్టులున్నదో
యెండిపోయిన మాధవీకంకణము ముక్కలనుపదిలపఱచి
యుంచుటవలననే తెలియుచున్నది. ఎట్టిమోహమున్న
ను విధిసంఘటితంబు లవిలంఘ్యములు. దైవ మేమార్గ
ము మన కుపయోగకారియని విధించునో దానిననుస
రించుట యాతనియనుగ్రహమునకు పాత్రులగుటకుమా
ర్గము. అనుగ్రహ సంపాదనమునకు అధికారి యిచ్చువ

చ్చినట్టు మెలంగుటయే సాధనము. ఆశ్రితవత్సలుం డగు భగవంతుండు భక్తులపై కృపచూపకయున్న వారికెన్ని ప్రాణసంకటములగు కార్యములు నియమించి, వానిని నిర్వహించి తనయిచ్ఛ నెఱవేర్చుదురో లేదోయని పరిశీలించిచూచును. అట్లు పరికించి పరికించి వారికివల యు నభీష్టంబు లొసంగు. హేమలత యీ హిందూసిద్ధాంతమును, పతివ్రతానియమంబులును బాగుగ నెఱింగి దమయంతి సావిత్రి, మున్నగు సాధ్వీమణులవలె మనోనిగ్రహ కార్యంబున నపను త్రయా నరేంద్రునకు పురుషార్థంబుల ప్రబోధించెను. సావిత్రి, దమయంతి, మున్నగు వారికంటె నీమెచారిత్ర మెక్కుడు సంస్తవనీయమని చెప్పవచ్చు. ఏలయున నాసాధ్వీమణులు తమహృదయంబు తొలుదొల్త నెవ్వనియందు లగ్నంబయ్యెనో వారినె పెండ్లియాడిరి. భర్తలతోడ కూడి పెక్కుకడగండ్ల బొనైరి. పిమ్మట నెన్నికష్టములువచ్చి పడినను మనంబుబందలి యనురాగంబులు వారలకు తోడునీడయై యుండె యాకడగండ్లనుండి గట్టెక్కకలిగిరి. తన్మూలమున తమహృదయాభిలషితంబగు పదార్థంబు సాధించుటకుం గలయడ్డంకు లన్నిటిని వదల్చుకొనిరి. హేమలత కట్టె

దైవసాహాయ్యము కలిగినది కాదు. చిన్నటి నాటనుండి యును తనమనంబభిలషించియున్న పురుషుని భర్తగా గ్రహింప సంప్రాప్తంబు కాదయ్యెను. నరేంద్రునియందు ప్రస్థితంబయిన మనంబును శిరీషునియందు ప్రవేశపెట్టవల సివచ్చెను.

చిరకాల మొక్కచోట వేఱునాటుకొనిన వృక్షమును మఱియొకచోట ప్రతిష్ఠింపవలసి వచ్చినది. మొక్క లేతగానున్నపుడు మఱియొక్కచోట నాటిన నది సుకరముగ ఫలవంతమగుట కలదుగాని, కాలము దాటినవెనుక నట్టిపని యొనరించిన నయ్యది సామాన్యముగ మరల దలయెత్తి బ్రదుకుగాంచుట దుర్లభము. అట్టిదుర్ఘటప్రయత్న మీమె సాధించినది. పితృభక్తికిని పతిభక్తికినిగూడ నిదానమైనది. ఆముష్మికంబు నపేక్షించినది. ఈమెచారిత్రమునకు వారిచారిత్రములు తీసిపోవునని చెప్పిననది యతిశయోక్తి యగునా? దైవయుక్తి వలననీమె చేపట్టినవాఁడైనను ఈమెమనంబునకనుకూలించువాఁడె యైనాఁడు.

బాల్యమునుండియును నరేంద్రునియందు పెంపొందిన యనురాగమును పితృనియోగమున నైనను మ

ఁతియొక్కన్నిపైకి మలపుట హేమలతకు కర్తవ్యముకాదా అను సందియము కలుగవచ్చును. అనురాగమనినను ప్రేమయనినను దయయనినను మోహమనినను ఒక్కవ్యక్తికే వేఱువేఱునామములు. అంతఃకరణవృత్తులవలనకలిగిన వని మున్నుచెప్పియుంటిని ఇప్పుడీ హేమలతకు సంప్రాప్తముకానిది ఐహికవిషయంబగు కామ కవ్యాపారంబుగాని ఆముష్మిక ఫలప్రదాయకంబగు దయాశూన్యత్వముకాదు. ఈమెకు నరేంద్రునియందలి యనురాగము దినదినప్రవర్ధమానమై పెఱుగుచునే యున్నది. అయ్యది యిప్పుడును నిలిచియుండినది. ఆతనివలని యింద్రియసౌఖ్యవ్యాపారము కేవలము ప్రాపంచికము. ఆప్రాపంచికవాంఛ నేయామెయిప్పుడు నిర్జింపనెంచినది. అయ్యది పత్యనురాగమనుకొనుటకుమారుగ సోదరప్రేమయనుకొనుచున్నది. భావనాభేదమాత్రమున సాంకర్యము కలుగఁబోదు. ఇదియే పై పూర్వపక్షమునకు సమాధానము.

జతేఖాయాగ్రాకోటయందలికాసా! కాసాలవృత్తులు కడునీచములైనవి. వీరలకు పెండ్లిండ్లుండవు. నిత్యానువాసినులగు పణ్యాంగనలవలెనేవీరిజీవనము స్వచ్ఛందజీవనము. కానియీసుందరి యందఱివలెగాక తనస్వాతం

త్ర్యలాభమునకు మొదటినుండియు ననభిలషించుచున్నట్టు గన్పట్టు. ఈమెరూపరేఖావిలాసములసమానములు. జలేఖా తన్మూలమున విగతపౌరుషులగు వర్షవరులుసైత నామెనుజూచినపుడెల్ల కామసంతప్తులై తత్సంపర్కము నభిలషించినట్టుగనుపట్టు. ఈమెతో నరేంద్రుడు స్త్రీవేషమున నంతఃపురమునసంచరించుపట్టున సలీముకుమారుని సంభాషణమును ఆతనిభావచాపల్యముంగాంచిన నీమెవాక్రుచ్చినటు లీమె కన్యాత్వగౌరవము నిష్కల్మషముగ నిలిచియుండినదాయని సందియముతోఁపకమానదు. కాని యామె స్వాతంత్ర్యమునకై పెనగులాడిన పెనగులాటంగాంచిన నయ్యది నిజమనియుందోఁచు. ప్రప్రథమున నీమె నిష్కల్మషప్రవర్తనమున కొకింతసాంకర్యంబు కలిగినట్టు కన్పట్టినను నిష్కపటముగ నరేంద్రుని వెన్నంటివచ్చి రాజస్థానమున నాతనికంగరక్షయొనర్చుచు ఆతనిప్రాణము కాపాడుటయును, అతనిప్రాణసంరక్షణకై తనప్రాణములవిడుచుటయు, ఆసందర్భమున దెబ్బతినిపడియుండినవేళ గుండెచెఱువగునట్లుగ పరిదేవనంబు సేయుటయు, గనుంగొనినతుదకది కేవల నిష్కపటానురాగముగామారి ఏకాగ్రతనొందినది. ఆమోహానురాగము త

న కనుకూలింపమిం జేసి అవకాశమున్నంతవఱకు వెన్నంటి ప్రాణముల నర్పించినట్లుగనుపట్టు. ఈమెనిష్కల్మషత ననుమానింపఁదగినపట్లు రెండుమాత్రమే యుండినవి. మనుహూరునకు బాహాపరీరంభ మొసంగివచ్చుపట్లుననొకచోట. జహంగీరుమున్న నిన్న నేనెఱింగియే యుంటినని వచించుచోటనొకట. ఈరెండింటినిబట్టి యీమె వర్తనమనుమానింప తగియేయున్నను, ఈమెసమయానుకూలంబగు మార్గంబునదాటుకొనివచ్చు చాకచక్యముగల మేధానిధాన యగుటచే తనవర్తనమునకు మాలిన్యము కలుగకుండ తనచమత్కారవచనంబుల వారిని వలలోవేసికొని వచ్చియుండుననియైన యోచింపవచ్చును. నిష్కపటుఁడగు నరేంద్రుఁడు తనయెడ బద్ధానురాగంబున ప్రవర్తించుచున్నాఁడని యీమె మనంబున తలంచినపుడునైత నాతనిమనోదార్ఢ్యము పరీక్షింపఁదలంచిన యీబుద్ధిశాలిని అంతసత్వరముగ వారికి తన యభిమానధనంబు చూరపుచ్చియుండు ననితలంప మనసొప్పకున్నది.

ఈమెసమయస్ఫూర్తియు, సాహసధైర్యంబులును దూరదృష్టి దూరశ్రవణంబులును ప్రశంసనీయములు. అట్టిసమయస్ఫూర్తియే లేకుండిన ఆగ్రాకోటయందు న

రేంద్రుండు ప్రచ్ఛన్న వేషంబున సంచరించు రాత్రియాతడు తప్పక చిక్కులకు లోబడవలసినవాడే. ఆసాహసధైర్యంబులచేతనే వేషమైనను మానకుండిన నరేంద్రుని జనానాలో నికేఁగొని చని ఆతనికే యుపాయంబును రానీయకుండఁగొని వచ్చినది. మనుహూరుని యనుచరులు పగతీర్చుకొనుటకు ఎంతదూరమైనను చనుచుందురని యొఱింగికనుగలిగి మెలంగుటయును గాయకబాలుని రూపంబున అతఁడుమరలి వచ్చునపుడు వెన్నంటివచ్చుటయును గూడ నామెదూర దృష్టిదూరశ్రవణంబుల కుదాహరణంబులు. ఈమె వీరురాలని చెప్పుటకు కత్తిచేతఁబుచ్చుకొని అట్టి నట్టడవియందొంటరిగా సంచరించుటయే సాక్ష్యమిచ్చును. నరేంద్రునిహృదయము మఱియొక్క యువతిపైనున్నదని చెప్పినపు డాతనిచిత్తవృత్తి యెంతవఱకుయథార్థమోకనుఁగొనుటకు మధురానగర ప్రాంతముల కరిగి శిరీషుని పరివారముతోడ మాటలాడివారి కిచ్చుటిసంగతులును నరేంద్రునకు హేమలత సమాచారమును గూఢముగ తెలియఁబలికినపట్టు ఈమెదూరశ్రవణమున కుదాహరణముకాదా? వీనినిబట్టి యామెకు నరేంద్రుని యెడలగలమోహ మెంతగాఢమైనదియో తెలియకపోదు.

శిరీషుఁడు శాంతుఁడు. ఎవరిహృదయంబు నెట్టి వారియొక్కనిముసంబులో గ్రహింప నేర్చినవాఁడు. క్షమాశీలుఁడు. ఎదుటివారి లోపముల నెల్ల క్షమించుస్వభావము గలవాఁడు. హేమలతమనోనిగ్రహ వ్యాపారమునం దాతని కెంతయో విశ్వాసము. ఈతనికి శిరీషుఁడు. రాజకీయ వ్యాపారమునందు గల ప్రజ్ఞ యనుపమేయము. గూఢతంత్రజ్ఞుఁడగు గోకులదాసుని తాంత్రికము లీతనికడ పనికివచ్చినవి కావు. గోకులుని యుద్దేశము ప్రతిస్పర్థికుటుంబమువారి రాజ్య మపహరించి తనప్రభునిరాజ్యముతోఁ జేర్పవలయునని. నరేంద్రునకు శిరీషునకు గలయనురాగంబు పెంపున నిష్కపటహృదయుండగునరేంద్రున కట్టియన్యాయ మేమియును జరుగకుండ కాపాడవలయునని యీతనియిచ్ఛ గోకులుని యక్రమప్రవర్తనవలన వీరనగర మమ్ముడగుటకు సిద్ధపడియుండినది కాననయ్యది యాతఁడే నివృత్తి చేయవలయునని యాతనికోరిక. శిరీషుఁడు వేయఁ బోవుముందు కాళ్లబంద మంతదూరదృష్టిగలగోకులదాసుకూడ కానలేకపోయినాఁడు. గోకులదాసునియందలి యీయక్రమప్రవర్తన మొక్కటియే యాతనికి గిట్టనిది కానియా

తనియెడ శిరీషునకు విశ్వాసము హెచ్చు. తనయైశ్వర్య మంతయును గోకులదాసువలన లభించినదని యాతఁడె యుంగును. ఆతనిస్వభావమది విస్మృతింగనునట్టిదికాదు. దేనివలన తనప్రజలకుఁగాని మఱియొద్దలకుగాని నష్టము కలుగుచున్నదని యాతఁడు కనిపెట్టెనో, ఆగుణమును గోకులదాసునుండి నిర్మూలము చేయవలెనని శిరీషునికో రిక. అందులకుతాను తనబొక్కసమునంగల రొక్కమం తయును వెచ్చించి స్వార్థపరిత్యాగంబున నరేంద్రునియా స్తియంతయును నిలిపియుంచినాఁడు.

ఇందలియాతని యుద్దేశములు రెండు. నరేంద్రు ని పెండ్లాడఁదలంచిన హేమలతకు ఈరాజ్యాపహరణం బున తనయందసూయపుట్టునను నదియొకటి. ఆతనికొ ఱకు తనకోశద్రవ్యమునెల్ల వెచ్చించి తద్రాజ్యమునిలిపిన తనయెడ నామెకనురాగము పుట్టుననుటయొకటి. పాప మా హేమలత కామెకోడనయే యామెకుగాని కంటి లోనుండి ముక్కులోనికిని ముక్కులోనుండి కంటిలోనికి ని వచ్చెడుస్వభావము కలిగినదికాదు. శిరీషునెడ తనవి ధ్యుక్తధర్మముల మనఃపూర్వకముగ నిర్వర్తించినది. ఆ తనిమనంబున కానందం బుదయించునట్లు నిష్కపటము

గ సంచరించినది. నరేంద్రుఁడేమైపోయెనో యనితొట్రు పడుచుండు. నామెమనంబున కాతనిజాడ లరసి యాతని గొనివచ్చి మరలరాజ్యమున ప్రతిష్ఠించినగాని యారటక లుగబోదని యెంచి తథావిధంబగు ప్రయత్నంబునకులో నయ్యెను. ఇదియంతయు హేమలతమనస్సున నూరటక లుగుట కని చెప్పుటచే నాతనకి నరేంద్రునియందు స్వత స్సిద్ధమగు ననురాగము లేదని చెప్పుట కాదు. తనవల్ల నా తనికి జరిగిన మనఃక్లేశమున కియ్యదియాతడు ప్రతిఫలంబ గునని కూడ యోచించియుండు. స్వభావసిద్ధముగ నీతడు మిక్కిలి దయాళుఁడు. నరేంద్రున కత్యంతాప్తుడై యె లంగువాఁడు. నరేంద్రు నెట్టకేలకు గ్రంథకర్త హేమల తకు చూపినాఁడు. కాని శిరీషునిసమావేశము సంఘటిం చినాఁడు కాడు. వారిరువురకునుసమావేశమైననెట్లుండునో నరేంద్రుఁడు గ్రేకపరుఁడు. శిరీషుఁడు తనకెపకారము చేసి నాఁడని భావించునేమో? అట్లయిన పాకము చెడిపోవునే. నరేంద్రునకట్టియుద్రేకమునుండి మరలించి ప్రవర్తింపఁ జేసినరంగమెద్దియును లేదే? అట్టిప్రవర్తన మీజన్మమున నాతనికి పట్టుపడునా? దీనియందలి సందిగ్ధభావంబుల విచారించియే గ్రంథకర్త చక్కఁగ వారిరువురకును సమా

వేశంబు లేకుండ చేసినాఁడు. అయ్యాది కథాసందర్భము న కంతయవసరము కాదని వదలినను వదలియుండవచ్చు. గ్రంథము తుదముట్టించునపుడు గ్రంథకర్త పాఠకులహృదయములు కరఁగించి హేమలతా నరేంద్రులవిశ్లేషములకు సంతాప మొందచేయుచు నంతరంగంబున కరుణారసతరంగములు వెల్లువలై పాఱ మాధవీకంకణమును తుదముట్టించెను.

గోకుల దాసు

గోకులదాసునందుగల స్వామిభక్తియు, కార్యనిర్వహణమునందుగలపూన్కియు అనుపమానములు. ఈతనికి కార్యనిర్వహణసాధనము కేవలసిద్ధుష్టముగనే యుండవలయు ననునియమము లేదు. పర్యవసానమే ప్రధానము. ఆతనియెడఁ గలగూఢతాంత్రికములంగనిన నంతటిదుర్మార్గములుమఱియొక్కెడఁ గానరావు. రాజకీయవిషయముల సేవల నిష్కల్మష కార్యంబులు వినియోగింపవని చెప్పుదురు. ఎంతటి నిష్కల్మష చిత్తులైనను రాజ్యాభివృద్ధి నొనరించు పట్టున దుస్తంత్రములకు లోనుగాకుండ నుండినవారు లేరు. రాజ్యతం

త్రజ్ఞులు పైకిచెప్పునది యొక్కటి, చేయునది మఱియొక్కటి. భారతయుద్ధమున శ్రీకృష్ణుని ప్రవర్తనమును రామాయణమునందలి, వాలి నిగ్రహణసమయంబున శ్రీరాముఁ డొనరించిన కార్యములును నిర్దుష్టములైనవనిచెప్పనొప్పునా? అట్లే వీరనగరమునుండి తనయేలిక దేవీపురమునకు వచ్చుపొంటె గోకులదాసుని వర్తనమును, కొంతవఱకవసరమని చెప్పనగుంగాని దేవీపురముతో వీరనగరమును కలుపుకొనుటకు నాతఁడు చేసిన దుష్ప్రయత్నములు మాత్రము కేవల మాతనియందుగలపట్టుదలయే యని చెప్పకతీరదు. ఈతనిదుర్మార్గము లన్నిఁటిని కప్పిపుచ్చు మేలిగుణ మసమానమైన యాతనిస్వామిభక్తియే. సమయము వచ్చినప్పు డాతనికి గల దూరదృష్టియును శాంతభావమును ప్రశంసనీయములు. నవకుమారుఁడు మొగలాయీలతో తలపడనున్నప్పు డీదూరదృష్టియును, ఉపదేశమే కాదా? ఆతనికి విజయము సమకూర్చినవి. నవకుమారు నీతఁడు తనచేతిలోని కీలుబొమ్మవలె నాడించినాఁడు. హేమలతానరేంద్రుల వివాహమునకంతరాయము కలిగిన దీతనివలననేకదా! శ

షునకు నవకుమారునియింట ప్రవేశము కలిగినదీతనివలన నేకదా. గోకులదాసే లేకున్న మనకు మాధవీకంకణమే లేకుండియుండును.

నవకుమారుఁడు విశేషప్రజ్ఞాసమన్వితుఁడు కాఁడు. భార్యయొద్దకుఁబోయి యామెచెప్పినమాట బాగుగనున్నదని యందులకుఁ దలయూఁచివచ్చును. మంత్రి, తనయొద్దకు వచ్చి యతఁడు చెప్పినదానికి వల్లెయనును.

నవకుమారుఁడు.

చివరకు తరతరములనుండి వచ్చుచున్న స్పర్థయె యాతనిమనంబును వశము చేసుకొని గోకులదాసుని ప్రేరణమున విజయము నొందినది. ఈపగయే హేమలతానరేంద్రుల మనస్తాపంబులకుఁ గారణమైనది.

పతివ్రత యనిన నవకుమారుని భార్యయే పతివ్రత. ఆమె యేయిల్లాలు. ఆమె నెరపవలసినవిధ్యుక్తకార్యములలో లోటుపడిన దొక్కటియును గానరాదు. భర్తకు సమయము వచ్చినపుడు మంత్రిగా నుండి పనిచేసినది. గృహిణీధర్మముల నిర్వర్తించునపుడు స్వతంత్రురాలై ప్రవర్తించినది. భర్తను వశంవదునిం గావించుకొనిన

నవకుమారు నిభార్య.

చండశాసనుండగు గోకులదాసుకూడ నామె యాజ్ఞ యనిన గడగడ వడఁకుచుండెను. హిందూసిద్ధాంతములనుబట్టి పత్నీధర్మమెంతవఱకు విధ్యుక్తముగనుండునో యంతవఱకు తనకూఁతువివాహవిషయములంగూర్చి భర్తతో స్వతంత్రించిముచ్చటించెను. ఎంతవఱకు తనయుపదేశము భర్తమనంబున పనిచేయు నని యామె తలంచెనో యంతవఱకే చెప్పిచూచినది. శిరీషునివివాహమున కొడంబడినది ఆమెకు భర్తయందుఁగల యధికారము తక్కువచేత కాదు. గృహిణీధర్మముల పూర్ణముగ నెఱింగినయాచారశీల కావున తన విధ్యుక్తధర్మ మెంతవఱకున్నదో యంతవఱకు ప్రవర్తించి తనయుపదేశము త్రోపుడుపడినప్పుడు యజమానుని యాజ్ఞలప్రకారము నడచుకొనియెను. ఇప్పట్టున నవివేకవతులగుయువతులు ఇట్టిగృహిణీమార్గముల సంచరింపనేర్తురా? "కార్యేషుదాసీ, కరణేషు మంత్రి &c., &c., అనుప్రమాణవచన మీయామెయెడనన్వర్థమైనది.

హేమలతానరేంద్రుల వివాహ విషయమున భర్తవిముఖుండగుట కనిపెట్టినది. మరల పల్లెత్తలేదు. అట్టిపూ

న్నిఁగలసతి మఱియొక్కతెయైనచో తనమతమునకు ప తివ్యతిరేకముగ ప్రవర్తించినచో హేమలతాశిరీషులకు పెం డ్లియగునా? ప్రతికుటుంబమునకు యజమానుం డొక్కఁ రుండుండవలయును. ఇద్దఱుండరు. భార్యయైనకావలయు ను. భర్తయైనకావలయును. వారిలో వారికి పనిపాటల విషయమున సమానబాధ్యతయుండియున్నను సంపూ ర్ణస్వాతంత్ర్యము సర్వత్రఅన్నిజాతులయందునుగూడ పు రుషునియధీనమై యుండు. భార్య భర్త కర్ధాంగియైనను ప్రకృతిసిద్ధంబుగ పురుషునకు లభ్యంబైనశారీరక పాట వంబువలన నతండు పూర్ణస్వాతంత్ర్యమునకు తగినవాఁ డు. అదియె భగవదుద్దేశంబు. భర్తమరణానంతరము హిందూసుందరు లందఱును ఆచరింపవలసినవిధ్యుక్తక్రి యలీమెయందు చక్కఁగ వర్ణింపఁబడినవి. అంత్యదినము ల సాంసారిక సుఖములనెల్ల పరిత్యజించి మధురానాథుని సేవించుచు ఆతనిదేవాలయంబునందె యధివసించి కా లము గడపెను. ఇదియే యనుబంధములను వదలించుకొ నుటకు మార్గము. ఈయనుబంధములను క్రమక్రమముగ వదలించుకొనకున్న మనుజున కవసానసమయమునకు క లుగుదుఃఖమున కింతయని మేరయుండునా? ఎంతవఱ

కీయనుబంధ్ధములనుండి మనుజునకు విముక్తి కలుగునో
మరణ మంతసుఖప్రదముగ నుండు. మన పూర్వు లేర్ప
ఱచినవానప్రస్థసన్న్యాసాశ్రమస్వీకరణాది కార్యములును,
వానియుద్దేశములును చక్కఁగాతఱచిచూచిన నంయుగల
మోక్షసాధనము విదిత మగును.

# మాధవీకంకణము.

## ప్రథమఖండము.

## మొదటిప్రకరణము.

### పుష్పం పుట్టినతోడనే పరిమళము.

1590 సంవత్సరమున ఎలిజబెత్తురాణి సర్వోత్కృష్టసామ్రాజ్య నిర్మాణమునకై పశ్చిమఖండమునఁ బునాదులు వేయఁ బ్రారంభించెను. ప్రాగ్దేశంబున మహాపురుషుండగు అగ్బరు శ్రీమంతంబును నభ్యుదయపరంపరాభిశోభితంబును నగు సామ్రాజ్యమును స్థాపించుచుండెను. ఒకనాఁటి సాయంకాలమున గంగాతీరమున ముగ్గురు పిల్లలాటలాడుకొనుచుండిరి. ఆప్రదేశం బత్యంతమనోహరంబై, విచిత్రశోభాసంపూర్ణంబై పురాణప్రసిద్ధంబై యలరారుచుండెను. అత్యాయతనంబగు గంగాతరంగిణి ప్రాఙ్ముఖంబునఁ బండ్రెండుయోజనంబులు నిరర్గళంబుగఁ బ్రవహించి యాస్థలంబుకడ రాజమహాలు కనుమల చుట్టునుమలపుతిరిగి యంతనుండి దక్షిణాముఖంబుగఁ బ్రవ

హించును. ఈయిఱుకుగంతల సందునుండి విజయయాత్రికు లెందఱెందఱో పశ్చిమమునుండి ఫలవంతంబులగు వంగదేశ సముద్రప్రదేశంబుల దిగితమవ్యూహకార్యంబుల కది స్థానభూతంబు గావించి తమతమ రాజ్యములను స్థాపించియుండిరి. పూర్వమొకప్పు డత్యున్నతస్థానము నందిన "గార్" "తాండా" "రాజమహాలు" పట్టణంబు లిప్పుడు కేవల నామమాత్రావశేషంబులై యున్నవి. కాని యందొకటి మున్ను హిందూరాజుల రాజధాని. ఒక్కటి యాఫ్గన్ప్రభువుల ప్రభుస్థానము. ఇంకొక్కటి మొగలాయి పాదుషాల ప్రధానపట్టణము. పదునాఱవ శతాబ్దమునందు బంగాళా దేశమునందనేకవిప్లవములుజరిగినవి. దానిని బట్టియే యాదేశ ప్రభుత్వము పదింబదిగ మారుచువచ్చెను. ఈకాలమునం దీప్రదేశమున నాఱితేరినసామంతవీరులును, నిశ్చలులగు ప్రజానాయకులును జాలమంది బయలుదేఱిరి.

పిల్లలందఱు నిసుకలో నాటలాడుచుండిరి. తూర్పున వెనుకదిక్కుగా మాల్డాదేశమందలి సారవంతములగు సముద్రప్రదేశములు,ఆవైపుల నేపుగఁ బెఱిగి పచ్చగఁ గానిపించుచుఁ జూడశృంగారములై యొప్పువరిచేలు. ఈచేలకు

దరిదాపులఁ వరుసలుదీర్చి పెరిగియున్న పేరుమో సిన మామిఁడితోఁటలు, ప్రపంచమునందెంకొక్కయెడ నూదిరికైనను లభియింపని యందలి మేలిరకముపండ్లు, సస్యములపచ్చదనముచేమిక్కిలి సైర్యమునొందిననీడలు, చూడమనోహరముగ నుండెను. దర్పోద్ధత యగుత రంగిణి వారికి ముందుభాగమునందున్నది. ఆనది కవ్వాల రాజమహాలు కొండకనుమలు నడుమనడుమ చీలి విజృంభించియున్నవి. ప్రొద్దుగుంకు సమయమైనది. సరకుపడ వలెన్నియో రాత్రిమజిలీకై యచ్చటఁ గట్టివేసియున్నవి. ఆపడవలలోఁ గొన్ని, బియ్యము, చక్కెర, ఉప్పు, నూలు బట్టలు, పట్టువస్త్రములు, బంగాళాదేశమునుండి యుత్తర హిందూస్థానమునకుఁగొనిపోవుచుండెను కొన్నిబీహారు దేశపు అపరదినుసులును, బనారసు, బుటేదారు మున్నగు వలిపెంపు పట్టువస్త్రములును, ఇత్తడి సామానులును, కొనితెచ్చుచుండెను. మఱికొన్ని పశ్చిమఖండము నందలి పెద్దపెద్ద నగరములనుండి రకరకములసరకు సామాగ్రులఁ గొనితెచ్చుచుండెను. ఆదినములలో హిందూ దేశవాణిజ్యమునకు గంగానదియే పెద్దరాచబాటగా నుపచరించుచుండెడిది. తీర్చికట్టిన పడవలు వేలకొలఁది యానదీ

గర్భంబునఁ గ్రిందనుండి పైకిని పైనుండి క్రిందకును రాకపోక
లు సేయుచుఁ గన్నులపండువగ నెట్లు విహరించుచుండెడివో
యా విషయములను కాలము చెల్లిన వృద్ధు లిప్పటికి
గథలక్రిందఁ జెప్పుచుందురు. ధూమశకటముల మూల
మున వాణిజ్యమిప్పుడు చుఱుకుగా జరుగుచున్నది. పడవ
లలోను బండ్లలోను ప్రయాణము చేయు దినములకన్న
నిప్పుడు రాకపోకలును సుకరముగనే జరుగుచున్నవి.
కాని ప్రజలకిప్పుడు పూర్వమున్నంత విశ్రాంతియున్నట్టు
కన్పట్టదు. ఆదినములలోఁ బురుషులును స్త్రీలును గూడఁ
దమతమ కులవృత్తులననుసరించి పనిపాటలను జేసికొనుచుఁ
గడుపులో నిచ్చల్ల గదలకుండ నుండెడివారు. ప్రాగ్దే
శమునందనుశ్రితముగ నుండు కేవలజీవనమున కేయంత
రాయమును లేకుండ జనులెల్లరును దమతమ పల్లెలనుండి
సుఖజీవనము సేయుచుండెడివారు.

సంజవేళ నక్షత్రముల వెలుతురున నానదీతీరమున
బాలకు లిద్దఱిసుకలో బొమ్మరిండ్లు గట్టుచుండిరి. తన్వాం
గియును, దరళనయనయు నగు బాలిక యొకర్తు వారి
బొమ్మరిండ్లవంకఁ దదేకవీక్షణంబుగఁ జూచుచుండెను.
ఇతరఖండంబునందువలె మనఖండమున సంధ్యారాగము

విశేషకాల ముండదు. తేజోనిలయం బగుసూర్యబింబం బస్తమించిన వెనుకనొకయరగంట లోపుగనేగదా చీకఁటులలముకొనుట! ఆవరిసగమున నున్నపిఠనగరప్రదేశం బంధకారముచే నదృశ్యము. దానిచుట్టు నున్నమామిడి తోపులును జెట్లసందు నుండి మినుకుమినుకుమను దీపప్రకాంతులునుమాత్రము దృశ్యము. నదీతీరము గ్రమక్రమంబుగ నత్యంతపరిశాంతం బగుచుండెను, ఆదినమునకుఁ దమపనియంతయును దీరిపోయినదను సంతోషముననుబోలె పడవలవాండ్రుపాటలు పాడఁజొచ్చిరి సాయంకాలభోజనంబునకై పడవలమీఁది పొయ్యిలు మండుచుండెను.

బాలు రిరువురును సమానవయస్కులు. ఆకారమునందును శరీర ప్రకృతియందును మాత్రము భేదించి యుందురు. వారలవయసు కొంచెమించుమించు పదునైదేండ్లుండును. శిరీషుఁడు సుదర్శనుఁడు. బలిష్ఠుఁడు. దృఢశరీరుఁడు. యౌవనపంతులకుండవలసిన దేహదార్ఢ్యమంతయు నాతనికడఁ జేరియున్నది. బలిష్ఠులగుపిల్లవాండ్రు చాలమందివలెనే యాతఁడు స్వభావసిద్ధముగ సాధువర్తనుండై యలరుచుండెను. నరేంద్రుని ముఖవర్చస్సు

తేజోవంతము. రూపరేఖా విలాసములు సుకుమారగద్యోత
కములు. శిష్టాచార సంపద్విశిష్టములు. మన దేశమునం
దిట్టియాకార విశేషములవలన సత్కుల పరిసూనతయు,
వంశప్రతిష్ఠయును ద్యోతకమగుచుండును. నీలంపుముం
గురులు మాటిమాటికి నరేంద్రుని ఫాలతలంబున వచ్చి
పడుచుండెను. ఆతఁడినుకలోనటునిటు పరువెత్తుచున్న
ప్పుడు శ్యామల నయనంబులు సంతోషతరంగితంబులగు
చుండెను; కాని యాతఁడు స్వభావసిద్ధముగఁ గోపిష్ఠిం
బఃవత్తరుండగు నాతనిసంగడికాఁడీతని మొగమేమాత్ర
మెఱ్ఱబడిననుఁ దప్పించుకొని పోవుచుండెడివాఁడు.

శిరీషునికుటుంబము శ్రీమంతమైనది కాదు. వంశ
ప్రతిష్ఠయైన హెచ్చైనది కాదు. కాని ప్రపంచయాత్ర
జయప్రదముగ నడుచుటకు వలయు సౌజన్యము, శాంతత,
సౌమ్యత మొదలగుసద్గుణము లన్నియు నతని యొద్దనుం
డెను. నరేంద్రునకు వంశానుక్రమణికగ వచ్చుస్వాస్థ్య
ములు విరివిగ నున్నవి. ఆచుట్టుపట్టుల నాతనివంశప్రతిష్ఠ
యు మిక్కిలిప్రఖ్యాతమై యున్నది. పరంపరానుగలికమై
వచ్చుశరీరసౌందర్యమువలెనే సూక్ష్మగ్రహణశక్తికూడ
నాతనికి జన్మముతోడనె యంకురించినది. కాని యెంత

దివ్యమైన శేముషీవిలసనమున్నను శాంతాదిసద్గుణంబులు లేక ప్రపంచకవ్యవహారంబుల విజయంబు సమకూడదు. అవి లేకుండుటవలన ననర్థంబు లెన్నియో సంప్రాప్తంబు లగుచుండును. అట్టి శాంతగుణసంపర్క మాతనికడ లేక యుండెను.

నక్షత్రము వెలుంగున బొమ్మరిల్లాట లాడుచుండిననాటిసాయంతనసమయంబున నరేంద్రునకు నిశ్చయముగ నట్టియుపజయమే సంఘటిల్లినది. సామాన్యముగ నాతఁడు బుద్ధికుశలతయును, వివేకమునుగలిగిన వాఁడై యుండియు నాదినమున సహజంబుగనుండుతనయుద్రేకంబునకొక్కింత లోనైనవాఁడు. దగ్గఱనుండి మెలపున సంచరించుచు మిన్నక చూచుచున్నయాచిన్నిబాలికయే యీయుద్రేకంబునకుఁ గారణము. హేమలతకేండ్లు పండ్రెండు. ఆచక్కెరబొమ్మ మార్దవంబునకును, సౌశీల్యంబునకునుబుట్టినయిల్లు. నరేంద్రునకును నామెకును నాబాల్యస్నేహము. పిల్లల కెంతటి యనురాగోద్రేకత యుండునో యంతటియనురాగవిశేషమున నాతఁడామెను ప్రేమించియున్నవాఁడు. తలిదండ్రులు లేనిపిల్లల కుండురహస్యదుఃఖము లన్నియును నాతఁడెప్పటికప్పుడామె చెవిని

వేయుచుండెను. ఆమెయును నాతనికష్టంబుల ననుతాపంబున నాలకించుచుండెను. ఆతనిమనంబునఁ బుట్టుపెద్దపెద్దకోరిక లన్నియును నతిగోప్యంబుగ నామెకడనేకరువు వెట్టును. ఆమెమనసు మిక్కిలిమెత్తనది. రాగయుక్తుండగు నాబాలునిబాధ లేవియో, ఆతని కోరికలేవియో, యేలయాతఁడు పరితాపమునందుచుండెనో, యామె కేవియు గోచరింపవయ్యెను. కాని, యాతనింగూర్చి యనన్యసామాన్యంబగు బరితాపంబునొందుచు ననామాన్యానునయంబుల నాతని నూరార్చుచుండెను. అట్టివారియువురును నేకాంతసౌహృదసంబంధంబు నడసియయ్యది కేవలహృదయస్థంబై గుప్తంబుగ నుండుటచే నొండొరులు నెంతయో సంవేదనము నొందుచు వర్తిల్లుచుండిరి.

అట్లుండగ వారియుభయులమధ్యను శిరీషుఁడు వచ్చి చేరెను. ఈచిన్నదానియందాతనికి స్నేహభావము. అది యాటలయందలిచెలిమి. అంతకన్న శిరీషుఁడెచ్చుకోర్కి యును విశదీకరించి యెఱుంగఁడు. ఈముద్దుగుమ్మ హృదయము నాకర్షింతమను వెఱ్ఱియూహ యాతనికిఁ బుట్టినట్లైనను గనుపట్టఁడు. ఆదేశమునందామెతండ్రి సర్వాధికారి. తండ్రికీమెయొక్కతెయె కుమార్తె కాని శిరీషునినిర్మల

నయనంబులఁ గుప్త యోచన లెవ్వియో యన్నట్టు యోచనాశీలంబులై యెప్పుడాతని దృష్టి ప్రసరణములవలన స్ఫురించుచుండెను. ఆయోచన లేవియో యెవ్వరికిని నూహింపశక్యముగాకుండెను. రహస్యంబుగ నాతని హృదయంబున నెంత పెద్దయూహలున్నను వాని నెప్పు డాతఁడు వెలువరించువాఁడును కాఁడు.

ఆగదియందు హేమలత శిరీషుని బొమ్మరిల్లు పూర్తియగునంతవరకును శ్రద్ధగఁ జూచుచున్నది. ఆతనికది యెంతో యానందముగ నుండెను. ఆతం డాపనియం దెంతయు శ్రద్ధాళుండై పనుగు జెందక పూర్తిసేయుచున్నవాఁడు. నరేంద్రునకది యస్వస్థతకుఁ గారణంబై మనస్సునఁ గినుకజనింపఁ జేయుచుండెను హేమలతా శిరీషులవంకనసూయతో రహస్యముగఁ జూచుచుండెను. కాని యారహస్య మెంతయడచిపెట్టవలెనన్నను లోపల నిమిడి యుండుటలేదు ఇట్లొకగడియవఱకును జరిగినది. శిరీషుని బొమ్మరిల్లు పూర్తియైనది. ఇల్లుచక్కఁగ సంపూర్తియగుటగాంచి సంతోషముతో హేమలత చప్పట్లుచరిచెను. ఆయానందోద్రేకము నరేంద్రునకు మనశ్శల్యము య్యె

ను. చేతులకు వడఁకు పుట్టెను. అందుచే నాతని బొమ్మరిల్లు చెడిపోయెను.

అంత శిరీషుఁడు "చెలికాఁడా! నీవు పేరములు చాల గొట్టెడివాఁడవే నేఁడు నీవు చేసినపని యేదియో చూపు"మని యడుగుచు నా బాలికతోఁ జెట్టాపట్టాలు పట్టుకొని నరేంద్రుఁడున్న యెడకరిగెను. ఆతఁడూరక నైశ్చల్యము చెడినిలువబడియెను. నరేంద్రుఁడు పడిపోకుండ మిగిలియున్న యినుకకుప్పగూడ కాళ్ళతో దన్నివైచి ధూర్తుండై "ఈసాయంతనము నేనేమియును బని చేయఁ దలఁచికొనలేదు. దానికేమిగాని నీవు నన్నుఁ నేఁడేల యీ మేటియొద్దనకు రమ్మనినాఁడవు? ఇంతలవ పిబాలిక నిచ్చట నేలయాపితివి? ఈపాటికి మాతలిదండ్రులు తారులాడుచుందు" రనియెను.

"ఆమెతండ్రి యడిగిన యెడల నేను జవాబు చెప్పెదను. ఏమిచెప్పవలెనో నేనెఱుంగుదును. నీకుమాత్రము నే నేమియును జెప్పను. నరేంద్రా! చేతకానితనమునకు తోడు మోటుతనము కూడనా?

ఇల్లాపాడై పోయినది. మతి చెడిపోయినది"

"నాబొమ్మరిల్లు పోయిన నుండుటకు నాకింతకంటె మంచియిల్లున్నది. కొందఱు జేయిల్లునుగూడ లేనివారున్నారు. వారిమాట యేమి?"

ఇయ్యది శిరీషునకుఁ దిట్టినట్టు. ఇప్పుడాతఁడు హేమలతతండ్రియింట బ్రతుకుచున్నాఁడు. శిరీషునకుఁ గోపము వచ్చినది. కాని యాఁపుకొని నరేంద్రుని యున్నతికిఁ దగినట్లు గౌరవముగ జవాబుచెప్పెను. "నరేంద్రా! నాస్థితిగతులు నేనెఱుఁగనివి కావు. అందున నాకాక్షే జాత్యము లేదు. తలవంపులును నీవు నీకులగౌరవముల నెఱింగి నీతాతప్రతిష్ఠనుబట్టి మాటాలాడుచుండుమని నాకోరిక."

"శిరీషుఁడా! మాతాతగారిప్రతిష్ఠను జ్ఞాపకముచేసి పుణ్యముగట్టుకొంటివి. ఆయన బ్రతికియున్నదినములలోఁ జాటుచాటున నొదిగి తిరుగువారందఱును నిప్పుడాయన నాకొప్పగించిన జాగీరంతయును విచ్చలవిడిగఁ గొల్లబెట్టుచున్నారు. నాచెలికాఁడుమాత్రము మాజిత్తుతెఱుంగకుండ నున్నవాఁడా?"

శిరీషుఁడు శాంతముతో "నరేంద్రా! నీయిష్టము వచ్చినట్లు మాట్లాడుము. ఈమెకొఱకై తండ్రి తోటి

పడుచుండును. హేమలత నింటికిఁ దీసికొనిపోయెద" నని చెప్పెను.

నరేంద్రుఁడు శిరీషునకు దగ్గరగఁ బోవుచున్న బాలికను గాంచి కుపితుఁడై "శిరీషా! ఈహేమలతను నీ కెవ్వ రొప్పగించినారు? ఈమెకు నీసంరక్షణ యొన్నాళ్ల నుండి?" అనియడిగెను.

"నేనామెకు సంరక్షకుడను కాను గాని నీవంటిపిచ్చివానిబారి బడకుండ సంరక్షించుటకు నాకు బాధ్యత యున్నది"

"నీవావల నుండుము. ఈమెనాతోడ నాటలకు వచ్చినది. ఆమె నాతోడనే యింటికివచ్చును." అని నరేంద్రుఁడు కేకలువైచెను.

"నీవర్తన మింతకంటెఁ గొంచెము చక్కఁ జేసికొందువేని నరేంద్రా! నీ వామెను తీసుకొనిపోవచ్చును. నీవంటి శిష్టాచారవిహీనునకీమె నీ రాత్రియొప్పగించి పోనోపను" అనియెను.

"ఛీ! కులహీనుఁడా! దూరముగ నుండుము. ఆమెప్రక్కను నిలువబడుటకైనను నీకర్హత లేదుపొమ్ము."

ఈనిందా వాక్యములకు శిరీషుని బలిష్టమగు దేహము కంపించెను. ఉన్నచోటనేయుండి నరేంద్రునివంక తదేక వీక్షణముగఁ జూడసాగెను. కోపము నాపుకొనెను. మరలనేమియు ననఁడయ్యెను జడుపుచెందినయా చిన్నదానికిఁ గైదండయొసఁగి యింటిదారి పట్టెను.

ఇది చూచెడుసరికి నరేంద్రుని కాగ్రహము మఱింతయు దీవ్రమయ్యెను. నోరు మెదపకుండ నాతనియెడ శిరీషుఁడు కనఁబఱచిన యీతిరస్కారమున కున్మత్తుఁడై తన సత్త్వకొలఁది నరేంద్రుఁ డాతనిపైఁ బడెను. హేమలత యలజడినొంది కెవ్వున నార్చెను. శిరీషుఁడు నరేంద్రునకుఁ దీసిపోవువాఁడు కాఁడు. ఉద్రేకించియున్న యాబాలకుని నడుము గట్టిగఁబట్టుకొని తృణప్రాయముగ నెత్తి యిసుకలోనికి విసరివైచెను నరేంద్రుండసహాయుండై రోజుచుఁ బడిపోయెను.

ఆబాలికకన్నుల యెదుట జరిగిన యీపరాభవంబున కాతండెంతయు లజ్జితుండై యొడలినిండ నలముకొనినదుమ్మును ధూళియును దులిపికొనకయే రాయి యొకటి యెత్తి శిరీషునిపై రువ్వెను. ఆరాయి శిరీషుని కుడికంటిపైఁ దగిలి పెద్దగాయమయ్యెను. శిరీషుఁడిసుక

లోఁ గూలఁబడి తనపై బట్టలతో రక్తము నెట్టుటైన నాపు కొనఁబ్రయత్నించెను.

హేమలత యిదియంతయుఁ జూచుచు నూరకుండెను. ఆమెమనస్సున నొకమూల పరితాపమును నొకమూల తిరస్కారభావమును బొడసూపి కన్నుల నశ్రుకణంబులు తళతళ మెఱయఁజొచ్చెను. అంతనామె యేటిలోనికిఁబోయి తనచీరచెరగుఁ దడిపి శిరీషుని మొగమున స్రవించుచున్న రక్తము దుడువఁజొచ్చెను.

శిరీషునిగాయ మంత యుపద్రవకరమైనది కాదు గానియాతఁడు నెమ్మదిగ లేచి నిలువఁబడుసరికి రక్తము క్రిందికి స్రవించుచుండెను. అంత నాతఁడు శాంతముతో "హేమలతా! ఇంటికి రమ్ము. పొద్దుపోయినది. ఇంకనిచ్చట తడయరాదు" అని చెప్పెను. వారిద్దఱును చెట్టాపట్టలు బట్టుకొని నరేంద్రునివంకఁ జూడకుండ నింటిదారిబట్టిరి. నరేంద్రుఁడొక్కఁడును నచ్చటనే మనోవ్యథపాలై చీఁకటిదళముగఁ గ్రమ్మువఱకును నిలిచియుండెను. అప్పుడాతనిమనస్సున నెన్నియో దుర్యోచనలు పుట్టెను. అనుశ్రుతవంశ ప్రతిష్ఠగల కుటుంబమునఁ బుట్టి పిచ్చివానివలెఁ బ్రవర్తించెను. చిన్ననాఁటినుండియుఁ దనయం

దనురాగముతో మెలఁగుచున్న యాచిన్నదానికడఁ దన గౌరవమెల్లఁ బోఁగొట్టుకొనియెను. శిరీషుఁడు కులగౌరవములేని యాశ్రితుండై యయ్యును మిక్కిలి యౌదార్యభావముతోఁ దనచెలిమికానిని తక్కువసేయక మధురహృదయయగు హేమలతకు సంతోషముఁగలుగ బ్రవర్తించెను. ఇది యాతని ప్రపంచయాత్రయందలి భావిఫల సూచనయౌ నేమొ?

## రెండవప్రకరణము.

---

### అన్యోన్య వివాదగలకుటుంబములు.

కొన్ని వత్సరములనుండి వీరనగరమునఁ గదలికగల కార్యములు విశేషముగ జరుగుచున్నవి. నాలుగుశతాబ్దములనుండి బంగాళాదేశమును అఫ్గన్ రాజులు కడు పుణోనిచల్లకదలకుండ రాజ్యముసేసిరి. ఇప్పుడు మహాపురుషుండగు నగ్బరుచక్రవర్తి ఉత్తర హిందూస్థానమునందలి మొగలాయి రాజ్యమును బలపఱచినాఁడు. ఆకారణమున బంగాళాదేశమునఫ్గన్ రాజుల రాజ్యమునకు విచ్ఛిత్తికలిగెను. 1574 సంవత్సరమున అక్బరు స్వయముగ పాట్నానగరమును జయించెను. తరువాత సంవత్సరములో బహోత్సాహులును, ధైర్యవంతులునగు మొగలాయిలకును, పరాజితులయ్యును వెనుకంజవేయని యాఫ్గనులకును బంగాళాదేశమున సమరకార్యములు మెండుగఁ గలిగెను.

హిందూజమీందారు లాదినములలో సామంతరాజులయ్యును తమతమ జాగీరులలో తమతమ జనపదంబులలో రాజులవలెనే సర్వాధికారములతో మెలంగు

చుండిరి. హిందూదేశమునందలి జాతీయైశ్వర్యమంతయు ను పల్లెటూళ్ళయందు దర్శనీయమై కన్పట్టును. జమీందారులు తమపై యధికారులకుఁ గప్పముఁగట్టుచు యథేచ్ఛముగఁ బరిపాలించుచుండిరి. వారిజాగీరులలో దండనాధికారులును ధర్మవిమర్శనాధికారులును వారే. సంక్షోభమేమియును లేకుండఁ బ్రజలను సంరక్షించుభారము వారియందే యుండెను. వారు దేశమునందలివిద్యల ఖిలముగాకుండ సంరక్షించిరి. కవిత నాదరించిరి. పరిశ్రామికముల వృద్ధిజేయుచు పనివాండ్రకు హెచ్చరిక కలుగఁజేసిరి. పైప్రభువులకు వలయునపుడెల్ల కాల్బలమును గజాశ్వాందోళనాదికములుమున్నగు సిబ్బందియును సమకూర్చుచువచ్చిరి.

మనకథాకాలమున వీరనగర మట్టిపురాతనవంశ ప్రతిష్ఠగల యొక హిందూసామంతపరిపాలకుని యేలుబడి క్రింద నున్నది. అక్బరు పాట్నానుజయించి మొగలాయీరాజ్యమును బంగాళాదేశమున వ్యాప్తమొనరించినపుడువీరనగరసామంతుడు తనపూర్వప్రభువులగు నాఫ్గనుల పక్షమునందుండి శాయశక్తుల సాయము చేసెను. అప్పటి ఆఫ్గన్‌పరిపాలకుఁడు దాయూద్‌ఖాన్. ప్రభు

భక్తివలన నాతనికిఁ జివరకు రాజ్యపదభ్రష్టతయు, వన వాసంబును, సంప్రాప్తమయ్యెను. దానికైన నియ్యకొని యోఁగాని యాతండు స్వామిద్రోహంబున కొడంబడిన వాఁడుకాఁడు. ఆసామంతుండు వీరనగరమును విడిచిపో వుటచేతనే మొగలాయీ దండనాయకులగు తోడర్ మల్లుఁడును, "మునయము"ను, ఆవీరనగరరాజభవనంబుల నశ్వశాలలుగ నొనర్చిరి. దాయూద్‌ఖానుఁడు గూడఁ బరాజితుఁడై బంగాళాదేశము నక్బరుకిచ్చి సంధిచేసికొని యుత్కలదేశమునకుఁజనియెను. ఈసంధియైనవెనుక వీర నగరసామంతుఁడు తననగరంబునకుమరలి క్రొత్తరాజున కు కప్పముఁగట్టి యాతనిచే సామంతరాజ్యమునకు పట్ట భద్రుఁడయ్యెను.

దాయూదుఖానుఁడు సంధిషరతుల ననుసరించిన వాఁడు కాఁడు. కొలఁదిదినములలోపలనే యాతఁడు బం గాళమును మొగలాయీలవద్దనుండి తిరుగ వశ్యముచేసి కొనియెను. వీరనగరసామంతుని మరల సైన్యసహాయ ము చేయు మనియెను. శూరాగ్రేసరుండగునావృద్ధసా మంతుండుమాత్ర మిందుల కంగీకరింపఁ డయ్యెను. ఆత నికడకువచ్చిన దూతతో దాయూదుఖానునితో తనపలు

కులుగా నిట్లుపలుకు మని ప్రతివచనంబిచ్చెను. "ఏనాఁడురాజ్యము సంరక్షించుకొనలేక మీరురాజ్యపదభ్రష్టులైతిరో నాఁడె రాజ్యలక్ష్మిమిమ్ము విడిచిపోయినది. మీరు మహాపురుషుండగునక్బరునకు రాజ్యమునెల్ల సమర్పించితిరి. పట్టాభిషిక్తులగురాజు లాడినమాట తప్పఁబోరు. అట్టిపని కియ్యకొనుట మావంశాచారముకాదు. నేనిప్పుడీ ఆగ్రాసార్వభౌమునె నమ్మియుండెడివాఁడను."

దర్పోద్రేకసూచకంబై యవజ్ఞాసంభృతంబైన యీ సందేశంబునకు దాయూదుఖానుం డెంతయు క్రుద్ధుండై యావృద్ధసామంతుని శృంఖలానిబద్ధుం జేసి కొనితేరను, వానినగరం బంతయు నిర్మూలనంబుసేయను సైన్యంబులను బంపెను. కాని శూరశిఖామణి యగు నావృద్ధుండు ముందుగనే మెలకువ గనియెను. విశాలవప్రపరిరక్షితంబై తీక్ష్ణధారాశూలప్రస్థాపితంబై యలరారు శిలానిర్మితసాలంబు నొక్కదాని తననగరంబుచుట్టును నిర్మాణమొనరించి సురక్షితముగ నుండెను. అహోరాత్రములాయుధపాణులై రక్షకభటులు సర్వదిక్కుల బురుజులనుండి కనుగలిగికాచుచుండిరి. దట్టంబులగు పొదలమాటున నేర్పరులగువిలుకాండ్రు విల్లునమ్ములు చేతబట్టుకొని తం

డోపతండములుగఁ బొంచి యుండిరి. అట్టిచోఁ గనుగప్పి కోటపైఁబడుట కెట్టివారికిని సాధ్యంబు కానేరదు. వీరాగ్రేసరుండగునావృద్ధశిరస్కుండు తనఖడ్గంబునొఱనుండి వెడలించి కరంబు నలరించి "చచ్చినపిత్రుపితామహాసంవర్ధితంబైన యీనగరంబుననే చావవలె, నిలిచిన సమరరంగంబున నిలిచి యీనగరంబునె కాపాడవలయు" ననుకృతనిశ్చయంబునఁ గాచుకొనియుండెను.

సమరకార్యవిధివిధానంబుల నలక్షణంబుగ నెఱింగినసైన్యంబులనెదిరించి సమరశిక్షాముఖం బెఱుఁగనిసంరక్షణదక్షత యెంతకాలముపనిచేయఁగలదు? ఇంతలో దాయూదుఖానుఁడు మఱియొకచో నింతకన్న బ్రబలముగుశత్రువుల నెదుర్కొనవలసివచ్చెను. రాజాతోడరుమల్లుండు తానునియమించిన ప్రదేశాధికారులతోడ బంగాళాదేశమునకు మరల దండెత్తివచ్చి అక్మహాల్లువద్ద దాయూదుఖానుని చుట్టుముట్టెను. ఆయుద్ధముతో నాఫ్గనురాజులప్రతాపమంతయు చల్లారెను. నాఁటితో వారిరాజ్యలక్ష్మి యంతరించెను. దాయూదుఁడు పట్టుపడియెను. 1576 సంవత్సరమున నాతఁడు శత్రువులచే గతాసుండయ్యెను. రాజాతోడరుమల్లుడు స్వయముగ వీరనగరసా

మంతుని మందిరమునకు విచ్చేసి యాతని గౌరవించి సార్వభౌముని చే నూతనముగ నొసంగఁబడిన రాజ్యపట్టము ను సబహుమానంబుగ నొసంగెను.

దానికి సమీపమున దేవీపురమను జాగీరున్నది. ఆదేశసామంతుఁడు అఫ్గనులఁ జేరి యీ సార్వభౌముని యాగ్రహమునకు బాత్రుండయ్యెను. తత్కారణంబున రాజ్యంబునకు దూరముకావలసివచ్చెను. తోడరుమల్లుఁడా జాగీరును గూడ వీరనగరసామంతునకే పట్టముగట్టెను. శూరశిఖామణియగునావృద్ధుండు ప్రభుభక్తికనురూపంబగు గౌరవంబు వడసి తనపుత్రుని పౌత్రుని తోడరుమల్లుని సింహాసనముకడకుఁ దోడ్తెచ్చి తానును తనవంశజులును నక్బరుకుటుంబమునందు విహితవిశ్వాసముతో మెలంగ ప్రతినచేసెను. ఆదినమున వీరనగరమున నేమూల చూచినను పండుగగానుండెను. పురజనులందఱును అక్బరుపేరుచెప్పి కొట్టికోలాహలము చేయుచు నారాత్రియు దీపావళిచేసిరి. అంబారీలచే నలంకృతమైన యేనుంగులపై తోడరుమల్లుఁడును తత్పరివారంబగు వీరవారంబును నూరేగుచుండఁ దత్పుర సౌధోపరిభాగంబులనుండి

పుణ్యాంగనలు మేలిముసుంగుల సవరించుకొనుచు సుగంధపుష్పాక్షతలను వారలపైఁ జల్లిరి.

పిమ్మట కొన్నినెలల కావృద్ధుండారముగ్గిన పండువలె కాలముతీరి పరమపదమునందెను. అతనికొమరుండాతనిస్థానమున నియుక్తుండై యాతండును కొలఁది కాలములోనే తండ్రిమార్గంబు ననుసరించెను. ఇంక వార్ధలవంశాంకుర మొక్క పౌత్రుఁడుమాత్రమున్నవాఁడు? ఆతని వయస్సప్పటికి రెండేండ్లు నిండలేదు. రాజ్యము వంశానుగతికంబగుటచే నాబుడుతఁడె యాజాగీరున కధినాథుండు కావలసివచ్చెను. ఆబాలకుఁడే మనన రేంద్రుఁడు.

తండ్రియును, తాతయును గతించరి. నరేంద్రునకు వెనుకదిక్కు సమర్థులగువా రెవ్వరును లేరు. ఆతని రాజ్యస్థితి మిక్కిలి చిక్కులలోనుండెను. అది నిలుపుట దుష్కరమైన కార్యము. రాజ్యభ్రష్టుఁడై యున్న దేవీపుర సామంతుండు తృణప్రాయుఁడుగా నెంచ దగినవాఁడు కాఁడు. అనేక సంవత్సరములనుండి వీరనగర దేవీపుర సామంతవంశములు రెండును నన్యోన్యవైరములతో మెలంగుచున్నవి. తరతరములనుండి చిరప్రవర్ధిత వైరానలంబు

చల్లారకుండ నిలిచియుండినది. నడుమనడుమ వివాహసంబంధములవలన వారి వైరానలంబు కొంతతడనుక విశ్రాంతి నొందుచుండెడిది. కాని యాబాలిక పరిణతవయస్కయై పుట్టినింటినుండి యత్తింటపాదుకొనినతోడనే భర్తృవంశాచారమునే యాపెయు ననుసరించుచు మరలమరల నాయనలంబు రవుల్కొనఁ జేయుచుండెను. పిల్లలకీవైరం బుగ్గుపాలతో లభ్యంబగుచుండును. మాతృసంబంధికు లందఱియెడ శత్రుభావంబు ప్రేరేచి నీకా గర్భశత్రువు లెవ్వరనిన వీరేయని, వ్రేలుపెట్టి చూపినట్లగుచుండెను.

ఉభయ రాజ్యంబులవారును తమతమస్థితి కనుగుణంబైనబలంబుల సంరక్షించుచుండిరి. వారిలో వారికి కలహములు పుట్టనిక్షణమే లేదు. ఈకలహములుమాటలతో తీరునవికావు. వానికారణములును నంతగొప్పవికావు ఏచెఱువునొద్దనో, యేకాలువయొద్దనో, యేసంతపేటయొద్దనో లేనిపోనిదానికేదోయొక కలహము సంప్రాప్తంబై యుభయపక్షంబులను వందలకొలఁది సైనికులకు పనికల్పించుచుండెను. విజయంబుగాంచిన సైనికులు తమయాయుధబలంబున గెల్చిన గెలుపుధనంబునఁ

డాము శ్రీమంతులగుటయేకాక తమయేలికలకు విశేష ముగ వరువూనముల నొసంగుచుండిరి. ఇట్టి చిరప్రవర్ధితంబగు వైరంబును బహుళంబులగు నాంతర కలహంబులును గలిగియుండియు నునాయావంశనాయకులిరువురు ను సేనర్చారుననో యేమత సమ్మేళనముననో యేసంతర్పణ సమారాధనములనో సమావేశంబగుచు సముచితగౌరవంబుల నెదుర్కొనుచుఁ బరస్పరసమాదరంబుల నానందించు చుండెడివారు.

దేవీనగర సామంతుడు నవకుమారుఁడు ఆతనికి వీరనగరవంశముపై ననుశ్రితముగ నుండదగినయసూయయంతయును బరిక్రమణరూపముగఁ బొందియుండెను. ఇతనిది లోతుగుండె. స్వభావసిద్ధముగ మంత్రాంగమున నెక్కువనిపుణుఁడు. తనపగవారియైశ్వర్యమనినఁ దన పూర్వునికంటె నాతఁడెక్కువ యసూయతోఁ జూచుచుండెను. జనులు నవకుమారుని నక్కజిత్తులును నాతని కుచ్ఛితపు తంత్రములునుజూచినప్పుడెల్ల నరేంద్రునితాత వీరపురుషోచిత ప్రవర్తనంబును నాతని నిష్కపటవ్యాపారమును వేనోళ్ళఁ బ్రశంశించుచుండిరి. వృద్ధశిరస్కం

డగు నాచక్కనయ్య యొక్కడతారసిల్లినను తనలాఘవం బున కెంతయు లజ్జించి మనోవ్యథపొందనితరుణంబు లేదు.

అక్మహాల్లునొద్ద దాయూదుఖానుడు మొగలా యీలు ముట్టడించిరి. నవకుమారుఁడీతరుణమును గనిపె ట్టి సామంతసహాయము విశేషముగ నవసరమని దగ్గఱ వారలనందఱ నాహ్వాయము చేసెను. నవకుమారుఁడు వీరనగరమును రూపుమాప నింతకన్నఁ దరుణము లేదని యును దీనిని బోనీయరాదనియును దలంచి శీఘ్రముగ పోయి దాయూదుతోఁ జేరెను. తనసైనికుల వీరనగరము ముట్టడిసేయ నియమించిపంపెను. అక్మల్లునొద్ద రాజా తోడరుమల్లునకుఁగలిగిన విజయమువలన నవకుమారుని యాశలన్నియు నిరాశలయ్యెను. ఆతఁడెంత యుత్సాహ ముతోఁ బనిచేసెనో యంతనిరుత్సాహము కలిగెను. ఆత నికున్న సర్వస్వమ్ము సర్వమ్ముహతమగుటయె కాక రా జ్యముగూడఁ బూజ్యంబయ్యెను. వీరనగరసామంతున క య్యది బహుమానంబుగ నొసంగఁబడియెను.

కాని నవకుమారున కెప్పుడును నిరుత్సాహంబనున ది లేదు. ఆతనికిఁ బిక్కచెదరు లేదు. ఇల్లును రాజ్యమును

వీడి ప్రవాసగతుండయ్యెను. అయినదేమియో యయ్యె
ను. ఇంకేఁదరుణము రాదా? అప్పుడుమరలవీనిని జయిం
పకపోవుదుమా? కానిమ్ము ఎంతకాలము వీరిదినము లి
ట్లుండును? ఎంతకాలముతప్పించుకొని పోఁగలరు? చూ
తము. అని పొదమాటుననున్న పులివలె నోడుపు వేసి కృత
నిశ్చయుండై కూర్చుండి యుండెను. ఆతనికి గోకులదా
సునొతఁడు నచ్చినబంటు. బంటనుటయేకాని యాతని
నెచ్చెలికానిగ భావింపవలయును. ఆతఁడే నవకుమారు
నిమంత్రి. మంత్రికూడ, ప్రవాసమునకు రాజుననుసరించి
పోయెను.

గోకులదాసు మొగలాయిలకును ఆఫ్గనులకును
జరుగుచున్నపోరు తీఱువఱకును దాయూదుని చేరవద్దని
నవకుమారుని నిరుత్సాహపరిచెను. అతి సాహసికుండగు
నవకుమారుం డీయుపదేశంబులఁ బెడచెవింబెట్టెను. కా
ని తరువాత నెంతయు పశ్చాత్తప్తుండయ్యెను. వారుభ
యులును సమయముకొఱకుఁ గనిపెట్టి యజ్ఞాతవాసము
చేయుచువేచియుండిరి.

అట్టితరుణము దొరకకపోలేదు. తోడరుమల్లుడు
వంగదేశమును విడిచిపోయెను. నరేంద్రునితండ్రియును

జాతయనుగతించిరి. అతిసాహసికుండగు నవకుమారు
డు తనపూర్వబలంబులఁ బోరుసేయఁ బ్రయత్నములు
చేసెను. కేవలబాహుబలంబునఁ దనదేవీపురమును తాను
ముందు స్వాధీనము చేసికొనినచోఁ బిమ్మట దనప్రభుత్వ
మునకు రాజశాసనము నెట్లైన సంపాదింపవచ్చునని యా
తనియూహ. కాని యోచనాపరుండగు గోకులదాసున
వకుమారుని మదుకుకార్యముల బ్రవేశింపనీయక మరల్చె
ను. గోకులుండు నవకుమారునితో తోడరుమల్లుడు మరల
బంగాళమునకు రాగలడు. అతడు వీరనగరకుటుంబము
నేమత్రియుండఁడు. ఆపసిబాలకున కపకృతిఁ జేసినవానిం
జూచి యాతఁడు సహించువాఁడునుగాఁడు. ఆతఁడు పి
ల్లవానికభయహస్త మిచ్చినాఁడు. మత్రియితరసాధనము
లు యోచింపవలయును గానియిదికార్యము కాదు. ప
ద్దవాడెప్పుడును జెడ్డవాఁడు కాడు. అని చెప్పియప్పటికో
దార్చెను. వారైనను విశేషకాలమోపిక పెట్టునవసరము
లేకపోయెను. ఆఫ్గను లందఱును విజితులైరి. మొగలా
యీనాయకు లందఱును నమ్మకట్టి సార్వభౌముని పైఁ
దిరుగబడిరి. తోడరుమల్లుడు బంగాళదేశమున కీవిప్లవము
నడిగింప మూఁడవసారి వచ్చెను. తానుజయించిన బం

గాళారాజ్యమంతయు మొగలాయినాయకులు ముక్కల
క్రిందఁగొట్టిచక్కఁగ ననుభవించుచుండిరి. ఇదియేమి య
నినఁబ్రభువులను ధిక్కరింపఁజొచ్చిరి. కాని అక్బరు యీ
తాఁతాఁలకు లొంగెడు వాఁడు కాఁడు. సామ్రాజ్యసం
స్థాపనకును దానిదృఢీకరణ కార్యంబునకును ఆతనియొద్ద
బాహుబలమునకన్న నౌదార్యబలంబును వివేచనాబలము
ను హెచ్చుగనుండెను. అదియే యాతనికి చక్రవర్తిపద
మొసంగినది. ఆతఁడు మహమ్మదీయులకును హిందువుల
కును భేదములేకుండఁ బ్రవర్తించెను. తోడరుమల్లుఁడు
హిందూ సేనానాయకుఁడు. ఆఫ్గనులయొద్దనుండి బం
గాళమును రెండుతడవలజయించినాడు. 1580 సంవత్సర
మున బహుళంబులగు సైన్యంబుల నన్నాహపఱచి యా
మొగలాయీనాయకుల సంరంభమునణఁగింప అక్బరు
తోడరుమల్లును మరలఁబంపెను.

ఈతడవనతఁడొక్క సేనానాయకుఁడుమాత్రమేకాదు,
బంగాళరాష్ట్రము కంతకునుఁ బ్రదేశాధిపత్యపదవిఁ గూ
డనందివచ్చినాఁడు. భాగల్‌పురమునొద్ద ముప్పదివేల సైన్య
ముతో శత్రుబలంబుల కోహటించి మాంఘిరుపట్టణము
వరకునుబోయెను. ఈ రెండుపట్టణములుగూడ దేవీపురము

న కనతిదూరమున నె యున్నవి. క్రూరుఁడై తనపైతృకరాజ్యంబునకు విచ్ఛిత్తి కలిగించిన యాసేనానిపై నాతనిశత్రుబలగముతోడఁ గూడిపోవుట యుచితమా? కాదా? యనినవకుమారుఁడు బహువిధములనాలోచించిచూచెను.

గోకులదాసు "బుద్ధికుశలతయందుఁగాని పరాక్రమవిశేషమునందుఁగాని తోడరుమల్లునితో హిందూదేశమున సములు లేరనియే చెప్పవలయును. ఆతని నిప్పుడెదిరించుట స్వవినాశమును సంపూర్తిఁగా వించుకొనుటయే. ఈవిప్లవ మణంచుటకై తోడరుమల్లునకు మనముసాయముపోయి యిదియడఁగినవెనుక నాతనిదయకుఁ బాత్రుల మగుదుము." అనియెను.

" మొన్న నాలుగు సంవత్సరముల క్రిందట దాయూదుఖానునకుఁ దోడ్పడి తన్నెదిరించిన వానిని రాజా క్షమించుననునాశ యున్న దానీకు?"

"రాజా యంతపగఁబట్టెడి స్వభావము కలవాఁడు కాఁడు. ఆతఁడౌదార్యవంతుఁడు. ఆఫ్గనురాజులయందుఁ బూర్వమెవ్వరు భక్తివిశ్వాసములతో మెలంగిరో యట్టివారు మొగలాయీ రాజులయందుఁగూడ భక్తి

విశ్వాసములు చూపి నమ్మికపుట్టింతురేని వారిని తప్పక యాతఁడుత్కమించి గౌరవించును."

"గోకులా! తరతరములనుండి యున్న నారాజ్యమునుండి నన్ను వెడలనడిచిన యీయగ్బరు సులామునకు నేను పాదాక్రాంతుఁడ నగుటయెట్లు?"

"నవకుమారా! మీతండ్రులు బంగాళాదేశమున ఆఫ్గను చక్రవర్తుల నెందఱినో సేవించియున్నవారు. అదృష్టవశమున బంగాళాదేశమున కిప్పుడు మొగలాయీలు ప్రభువులైనారు. వారలకా ప్పుండవై మెలంగుము."

"మంత్రిపుంగవా! నీశాంతత యెంతయుఁ బ్రశంసనీయము కాని నామనోవికారములు నన్ను మఱియొక వైపునకు లాగుచున్నవి. నేనీ యవినీతుని సేవింపనోపను. తిరుగబడిన మొగలాయీనాయకుల గలిసి వానిపై కరిగి నాపగఁ దీర్చికొనియెద"

"నవకుమారా? బాగుగ యోచించి మఱి పనిచేయుము. నేనునీ యెడ మిక్కిలి భక్తితాత్పర్యములు కలవాఁడను. మాతండ్రితాతలు నీకుటుంబము నెట్లుకాచి

యుండిరో యట్లే నేనును మిమ్ము అనేకశతవత్సరంబులు సేవించి యుండెదను."

సనకుమారుఁడు దాక్షిణ్యత తగ్గ ప్రశాంతుఁడై నెమ్మదిగ యోచించి చూచెను. మంత్రిపుంగవుని యుపదేశమే యుక్తముగా గన్పట్టెను. గణనాతీతంబగు పరివారంబుతోడ రాజాతోడరుమల్లునకు సాయముచేయఁ గృతనిశ్చయుం డయ్యెను.

తోడరు మల్లుఁడు మిక్కిలి వివేచనాపరుండును దూరదృష్టి దూరశ్రవణము కలవాఁడును. అందువలననే యాతఁ డాయుగమున దండనాయకులయం దగ్రేసరుండని పేరువడసెను. రాజకీయదివ్యాకర్షణయం దగ్రగణ్యుం డయ్యెను. ఆతండుతనబుద్ధినైపుణ్యంబున విప్లవకరులైన నాయకులతో నీషత్తయినను ముఖ్యరంబు లేకయే వారినందఱవశ్యులఁజేసికొనియెను. బంగాళాదేశమునందలి హిందూజమీందారులందరితోడను గ్రమక్రమముగ సఖ్యముఁ గావించెను. భాగల్పురమునందున్న విప్లవకారుల విడుదలకేవిధమైన సరంజామ చేరకుండఁ జేసెను. ఆ జమీందారులందరిలోనున

వకుమారుఁడు మిక్కిలి పట్టుదలగను నెక్కువ జయప్ర దముగను బనిచేసెను. ఆతఁడు జమీందారు లందరియొద్ద కునుబోయి హిందూనాయకుల నందఱ సార్వభౌముని పక్షమునకు మరల్చెను. మాంఘీరుపట్టణమున కేకాంత ముగబోయి విప్లవకారుల భావిసంచారసూచన లన్నియు ను తోడరున కెఱింగించి వచ్చుచుండెను. ఆతని ప్రయత్న ములన్నియును ఫలించినవి. హిందూజమీందారు లంద ఱును మొగలాయీనాయకుల విసర్జించిరి వారికిఁదినుబం డారము లెవ్వియుఁ జేరకుండఁజేసిరి ఆనాయకు లందఱు ను దిండిలేక మలమలమాడి చెట్టుకొకపక్షిగ నలుదిక్కులఁ బఱచిరి వారిశిబిరములును స్కంధావారములును నిర్జన ప్రదేశములై పోయెను.

సార్వభౌముని యెడ నత్యంతభక్తివిశ్వాసములు క లిగి ప్రవర్తించిన భటరాజుల కెల్ల సముచితగౌరవ మొ సంగుసమయము తటస్థమైనది. తోడరుమల్లునకు వారం దఱిలో నవకుమారుం డగ్రేసరుండుగఁ గన్పట్టెను. అతని బిలిచి "నీకేమి వలయునో కోరుము. ఈరాజ్యమును నిలు పుటలో నీ వెక్కుడుగఁ బనిచేసి రాజానుగ్రహంబునకుఁ బాత్రుండవై తివి. తన యెడభక్తివిశ్వాసములు కనపఱచిన

వారల సార్వభౌముండెన్నఁడును మఱచువాఁడు కాఁడు." అని చెప్పెను.

"అవక్రపరాక్రమ ధౌరేయులగు మిమ్ము నేఁగోరు కోరిక యొక్కటియున్నది. నేను మున్ను మీయెడ నొనరించినయపచారంబు మన్నింపుఁడు. మాపూర్వులు తరతరములనుండియు అఫ్గనురాజుల కొలిచియున్నవారలు ఆకారణమున మేమును వారి నప్పుడు సేవింపవలసినవారమైతిమి. ఇదియే నేఁగోరువరము"

"నవకుమారా! నీయభిప్రాయంబు నాకు బోధపడలేదు. బంగాళాదేశమునకు వారు పూర్వపరిపాలకులు. వారియెడ భక్తివిశ్వాసములు కలిగి ప్రవర్తిల్లుట ప్రశంసనీయమె కాని యయ్యది లోపముగానెట్లు పరిగణింపనగు? మహాపురుషుండగు నీసార్వభౌముండు పూర్వపరిపాలకులయెడ భక్తివిశ్వాసములతోఁ బ్రవర్తించినవారినెవ్వరిని యింతదనుక దండించి యెఱుంగఁడు."

నవకుమారున కేమిచెప్పుటకును తోఁచదయ్యెను. తరుణము దాఁటుచున్నది. ఇతరరాజు లందఱును బహూకరణార్హులై వేచియున్నవారు. గోకులదాసు తోడరుమల్లుని

గుట్టుమట్టు లన్నియు నెఱింగినవాఁడు. అతని నెట్లువశ్య ము చేసికొనవలయునో యితఁడెఱుంగును. అతివినయ ముతో నిష్కపట చిత్తముతో సత్ప్రవృత్తితో నిట్లు సం భాషించెను.

“ ఓమహాప్రభూ ! మాయేలిక తమతో నిట్లు నివే దింప నాజ్ఞాపించుచున్నాఁడు. ఆయనలోప మింకొక్కటి యున్నది. దాయూదుఖాను ప్రతిజ్ఞాభంగము గావించి రాజనీతిని బరిత్యజించి సార్వభౌమునిపై దండెత్తివచ్చిన పుడు మాయజమానుండు సార్వభౌముని యెడ రాజభ క్తివిస్మరించి అక్మహల్లుకడ మరల నొక్కసారి దాయూ దుఖానుతోఁ జేరెను.”

అనునప్పటికే, తోడరుమల్లునిబొమలు ముడివడియెను. “ అట్లయినయెడ నాతఁడు కావించినది రాజద్రోహమే దాయూదున కీద్రోహమునకేకదా శిరచ్ఛేదమైనది ” అని గుప్తస్వరంబున స్పష్టముగాఁ బలికెను

“ ఓ యుదారశీలా ! అయ్యది జరిగిపోయినది. మాదొర మీకడఁ గపటభావంబున నేమియును మఱుం గుపఱుచుటలేదు. వీరివంశము మూఁడువందల సంవత్సర

ముల పైనుండి ఆఫ్ఘనురాజులకొలిచియుండినది. ఆవిశ్వాసమూలంబగు నుత్సాహంబున నందీభూతుండై విస్మృతప్రతిజ్ఞుండయ్యెను. సార్వభౌముండిట్టిలోపమును క్షమించి మొగలాయి వంశమునందు వీరి భక్తివిశ్వాసములఁ బూర్వపరిపాలకులయందువలె నాటికొనుమార్గముఁ గావింపుఁడు."

తోడరుమల్లుఁడు యోచనానిమగ్నుండై మౌనముద్రిండయ్యెను. గోకులదాసు తన్ముఖవికాసంబుల మనోభావంబుఁ గనిపెట్టి "దేవీపుర వీరనగర సంస్థానములు రెండును, ఆఫ్గనురాజులకడ రాజభక్తియందును బలపరాక్రమములయందును ప్రతిస్పర్ధములై మెలంగుచున్నవి. మరల నొక్కసారి సముద్రవేలావలయితసామ్రాజ్యభోజ్యుండగు నీమహాసార్వభౌముని సేవనంబున వారలప్రతిస్పర్ధ ప్రజ్వరిల్లనిండు" అనియెను.

తోడరమల్లుఁడు కన్నులపైకెత్తి "వీరనగరమా? అవునవును. జ్ఞప్తికివచ్చినది. శూరశిఖామణియును వృద్ధశిరస్కుండునగు తన్నగరనాయకుండు ఎందఱెందఱో మమ్ముఁ బరిత్యజించిపోయినపుడు అతివిశ్వాసమున గొల్చి

యున్నవాఁడు. మున్నాతని యాతిథ్యమున నొక్కసారి యామోదించితిని. మరలనొక్కసారి యాతని శౌర్యంబునకును భక్తివిశ్వాసములకును సార్వభౌముని సత్కారంబులు నివేదింప మనసగుచున్నది" అని యెను.

"ఓయుదారశీలుఁడా! ఆపురుషుండిప్పుడెహికసత్కారంబుల కందకుండఁ బోయినాఁడు. ఆయనప్రక్రమధారేయుండు మీరానగరమును విడిచిపోయినకొలదికాలముననే యశోధనంబును గౌరవప్రపత్తియును నీలోకముపాలుజేసి స్వర్లోకంబున కరిగెను. ఆతని పౌత్రుండిప్పుడు చిన్నబిడ్డఁడు ఆతఁడే వీరనగరమునకుఁ బ్రభుండు. దేవీపురముగూడఁ గొంతకాలమునుండి యాతనియధీనమునందున్నది."

అనునప్పటి కొక్కింతవిశ్రాంతి యొదవెను. తోడరుమల్లుం డాలోచనాధీనుండయ్యెను. ఆతని బలుకరింప నెవ్వరును సాహసింపలేకపోయిరి. తనయదృష్టము ఫలించినను శుష్కించినను నిదియె తరుణంబనినవకుమారుండు తలంచెను. గాని యాతడును మాటలాడుటకు సాహసింపలేకపోయెను. తోడరుమల్లుఁడు తనతీర్మానము నెత్తింగించి యాయంశముఁ బరిష్కరించెను.

నవకుమారా! నీమంత్రిపుంగవుండు నీపక్షమున మిక్కిలి జక్కగ మాట్లాడినవాఁడు. నీవీనడుమ సార్వభౌమునకుఁ జేసిన సాయము నీపక్షముగ నెక్కువవని చేయుచున్నది. అయ్యది యుగ్రబహుమానంబుల నందకుండఁ బోరాదు. నాలుగువత్సరంబుల క్రిందట జరిగిన లోటుపాటునెల్లఁ బరిశీలింప సార్వభౌమున కిప్పుడు సమయము కాదు. నీపూర్వలోపముల నన్నిఁటిని ప్రభువరుండు క్షమించినాఁడు. ఇఁకముందు మీభక్తివిశ్వాసములనమ్మియుండును. కానియొక్కటిమాత్రమున్నది చిన్న బిడ్డండగు వీరనగరపరిపాలకునకు దేవీపుర మొప్పగించి కొలదికాలమే యైనది. ఇంతలో దానిని వీరనగరంబునుండి యెడసేయుట కర్తవ్యముకాదు. ఇంకను కొంతకాలమైనఁ గాని నీరాజ్యము నీకులభింప నేరదు. ఈనడుమ సార్వభౌమునకు నీభక్తివిశ్వాసంబులు కనఁబఱపవలయు. ఇప్పుడు వీరనగర దేవీపురరాష్ట్రంబులు రెండింటికిని నీకు దివానుపద మొసఁగుచున్నారము. ఆచిన్నబిడ్డనికి నీవే సంరక్షకుండవై మెలంగుము. ఆతనికిప్పుడు యోగ్యుండగు సంరక్షకుండు కావలయు. సమర్థుండగు పరిపాలకుండు కూడ వలసియుండు. ఆతనికి వయసువచ్చినయనం

తరము దేవీపురము వీరనగరమునుండి వెలిసేయుదుము. ఈకార్యమున నీవు విశ్వాసపాత్రుండవై మెలంగి దాని నుద్ధరించితివేని నీరాజ్యము నిన్నుచేరును. ఇట్టిపూర్వారాష్ట్రీయసంస్థానమును నిర్మూలింప సార్వభౌమునభిమతంబు కాదు. ఈకార్యమును విశ్వాసయుక్తముగ నెఱవేర్పుము. నీపైతృకరాజ్యమును మరల స్వగ్రహింపుము. అవిశ్వాసమున కెడగలిగి యుండవలయునుసుమా! స్నేహితులగు వారియుపకారంబుల నీతోడఁదుమల్లుం డెన్నటికిని మఱవఁడు శత్రువర్గముల నూటాడవెనుదీయఁడు."

ఈపుణ్యవచనంబు లాలోచనామందిరంబున నెల్లెడఁ బ్రతిధ్వనించెను. ఈయుపదేశంబులు మనస్సునకు వచ్చెను. వక్రకుమారుని హృదయంబుకుంగెను. తరతరములనుండి ప్రతిస్పర్ధిగానుండిన శత్రుకుటుంబమునేఁ దానేదివానుపదము నంది నిర్వాహకుండై మెలంగుటయాతనికి విషప్రాయముగఁ నుండెను. రాజశాసనమైనపిమ్మట నాతనిహృదయమునుండి యెద్దియో వెలువడనుండిపెదవులు మెదల సంసిద్ధమయ్యెను. కాని విశ్వాసపాత్రుండగు గోకులుండు స్వామికార్య సంరక్షకుండయ్యెను. వెనుకటి విప్లవంబునకు క్షమాపణంబు కలిగెను.

ప్రవాసవృత్తి తొలంగెను. దివానుపదము లభ్యంబ య్యెను. నవకుమారునకు దేవీ పురవీరనగర రాష్ట్రము లు రెంటికిని కొన్నిసంవత్సరముల వఱకును సంపూర్ణాధి కారముచే జిక్కెను, దేవీపురముమరల లభించునన్నరా జాజ్ఞయాతనికి బురోమార్గంబయ్యెను. ఎప్పటికైననీ కుటుంబమునకు దేవీపురము మరల లభ్యంబగునని మనసు నకు విశ్వాసముకలిగెను. ధీమంతుండగు గోకులదాసు నిబుద్ధి యోచనలన్నియును బ్రత్యక్షముగ గోచరించెను. తోడరు మల్లున కాతండు సప్రణాముండై "ఓయుదా రశీలుఁడా! మీరుచూపిన యీయనుగ్రహంబునకు మా ప్రభుండు సంతోషమగ్నుండై యానందపారవశ్యమున మాటలాడ నేరకున్నవాడు. మహనీయుండగు నీహిం దూదేశసార్వభౌముని యౌదార్యంబునకు సమర్థంబగు ననుగ్రహంబు మీవలన లభించుటంజేసి యయ్యదిమా కెంతయు సంస్తవనీయంబై ధన్యాత్ములమైతిమి. ఈయ నుగ్రహంబుమాప్రభుండు కోటిగుణితంబుగఁ బరిగణిం చుచున్నాడు. ఈమేలు జన్మమున్నంత వఱకునాతఁడుమ అవకభక్తివిశ్వాసంబులఁ గృతజ్ఞుండై ప్రవర్తిల్లుచుండు. ఓమేధానిధీ! నీకుదీర్ఘాయు వగుఁగాక! ఆఫ్గనురాజుల

యెడ దేవీపురవీరనగర రాష్ట్రములు ప్రతిస్పర్ధగలిగి యె ట్లుప్రవర్తిల్లెనో యట్లేయీ రెండు సంస్థానములును నొక టి నొకటి మించి మొగలాయీ రాజ్యమునెడనప్రమత్త తతోఁ బ్రవర్తిల్లుచుండు.

నవకుమారుండు సతీసుతాసమేతుండై వచ్చి వీ రనగరమున దివానుపదమునఁ బ్రవేశించెను. ఆతనిప్రియ తనూజ హేమలత. నిరుపమాన సౌందర్యవతి. హేమల తానరేంద్రులిరువురు నన్యోన్యానురాగంబున దినదిన ప్రవర్ధమానులగుచుండిరి. నవకుమారుండును సద్గుణఖ నియగునాతని సతీతిలకంబును వారినిరువుర నతిశ్రద్ధాభ క్తులతో లాలించి పెంచుచుండిరి, గోకులదాసుకూడ న వకుమారునను సరించివచ్చెను. తనపూర్వులవలనే దేవీపు రసంస్థానముసుద్ధరింప నెన్నియో యుపాయముల నెన్ను చుఁ బనిసేయుచుండెను.

ఇదిజరిగి యిప్పటికిఁ బదివత్సరములైనది. రాజా మానసింహుఁడిప్పుడు బంగాళారాష్ట్రమున కధినాథుం డు. ఈతఁ డక్బరుచక్రవర్తికడ మతియొక్క హిందూసే నానాయకుఁడు. ఈతనికాలమున రాష్ట్రీయసంస్థానము

అక్నహల్లినకు మార్పుజెందెను. దానికే రాజమహాలని పేరువచ్చెను. రాజమహాలనగా రాజుగారుండుస్థానమని యర్థము. రాజమహాలునకును వీరనగరమునకును గొన్ని నిముసముల ప్రయాణము. హేటులతానశేంద్రులిద్దఱును వీరనగరమున శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిం జెంది భాసిల్లుచుండిరి. కాని యీవదియేండ్ల నడుమ వారి రువురకును మధ్య శిథిలుండను, నాతఁడు మఱియొక్కఁడు వచ్చి ప్రవేశించెను.

---

## మూడవప్రకరణము.

---

### సదుపదేశము.

నవకుమారుఁడు మిక్కిలివివేకముతోడను, మిగుల జాగరూకతతోడను దేవీపురవీరనగర సంస్థానముల కార్య భారమంతయును వహించి నిర్వహించెను. ఆకాలమున రెండుజమీనాలును సరియైన కట్టడిలోనికి వచ్చినవి. మొగ లాయీలకును, ఆఫ్గనులకును కలిగినయుద్ధములమూల మునఁ బాడుపడినజనపదము లన్నియును బాగుపడినవి.

జనులు తిరిగివచ్చి తమతమయునికిపట్టులఁ జేరికొనిరి. వ్యవసాయకులును, పనిబాగులవాండ్రును, అలజడి చెంది పూర్వము విడిచిపోయినయిండ్లన్నియును మరల బాగుచేసికొనిరి. వ్యవసాయము లేక బీడుపడి యరణ్యములవలె నున్నపొలము లన్నింటియందును మరల కట్టుమోపిరి. తమతమపొలములలోఁ దుపాకిగుండ్లును, విరిగినతుపాకిముక్కలును బల్లెటూళ్ళలోని ప్రజ లేరి తెచ్చుచుండిరి. వారితండ్రులు పూర్వము తామాయాప్రదేశములయందుఁ గాంచిన సిపాయీలరాకపోకలును వారివారియెదురుసన్నాహములును, కథలక్రిందఁ జెప్పుచుండిరి. దాయూదుఖానును తోడరుమల్లును వెన్నంటి చనినపూర్వపుసిపాయీలు చెట్టుక్రింద నెగడులు వేసికొని కూర్చుండి తామొనరించినసాహసకార్యములన్నియు నేకరువు పెట్టుచుండిరి. వారి నెన్నిమాఱులు విన్నను మరల మరల విననవలె ననుకుతూహలమె కాని యభిరుచి తగ్గుటలేదు. ఏండ్లుగడచినకొలఁది యాయద్భుతచర్యల కథాకథనంబువలన వింతవింతచవులు పుట్టుచుండెను. ఆకథలకొఱకై చెవికోసికొనెడివార లందఱును వీరపురుషులకాలమునాఁటివార లని తలనెఱిసినకథకులచుట్టును జేరి చెవులొరఁబె

ట్టుకొని వినుచుండిరి. ఆవీరపురుషుల పౌరుషకార్యములు, ఈకాలపువయసుకాంద్ర కత్యద్భుతకార్యనిర్వహణములుగఁ గన్పించుచున్నవేగాని వారి కేమాత్ర ముత్సాహము కలిగించుట లేదు.

ఎంతటియనుమానపురుషున కైనను, ఎంతటి జాగరూకతకలవాని కైనను నవకుమారునిసంస్థానకార్యనిర్వహణవిషయంబున నీషత్తును లోటుకన్పించుట లేదు. వీరనగరమునందలి పూర్వసేవకుల నందఱినిలిపియుంచి వారలకు బహుమానము లొసంగుచుండెను. నరేంద్రునిపితామహుండనిన నెంతోగౌరవముగ మాట్లాడుచుండెడివాఁడు. నరేంద్రుని పూర్వులు కట్టించినధర్మశాలలును గుళ్లును, గోపురములును, తదితరములగు ధర్మకార్యనిర్వహణమందిరంబులును సంరక్షించుచుండెను. పరిపాలనమంతయును బూర్ణమగునధికారముతోఁ జెలాయించుచుండెను, గాని జనుల కందఱకును భీతి కలిగించెడునట్లు డాంబికవేషమించుకంతయును గనఁబడకుండఁ జేసికొనెను. మానసింహమహారాజు బంగాళారాష్ట్రమున కధిపతియై వచ్చి వీరనగరమును సందర్శించినప్పుడు తోడరుమల్లుచేసిన యీయేర్పాటును జూచి మిక్కిలి సంతోషించె

ను. నవకుమారుని భక్తివిశ్వాసములకు మెచ్చియాతనికి బిరుదుపట్టములనొసంగెను. వీరనగరనాయకునకు యుక్తవయస్సు రాగానే దేవీపురమును వీరనగరమునుండి విడఁదీయుదుమని చేసినరాజవాగ్దానమును మరల నుద్ఘాటించెను.

నరేంద్రుని పితామహునికాలమునయున్న నౌకర్లందఱును, నెంతకాలమునుండి సేవచేయుచుండినను వారిబుద్ధి కంతకన్న నెక్కువ పొడకట్టినదికాదు. కాని యందులో కొలఁదిమంది యున్నవారు. వారియోచన లంతకంటె దూరముగఁ బోయినవి. ఆతని మొగమెప్పుడును నవ్వుచునే యుండెడిది. వర్తనమువలన మిక్కిలి దయాళుండని కన్పట్టుచుండెను. కాని యాతనిమనంబున నేదియో దురూహ యొకటి యున్నట్లును దాని నెట్లయిన నిర్వహింపఁ జూచుచున్నట్లును గన్పట్టెను. వారిది కనిపెట్టిరి. కనిపెట్టిరో లేదో కాని వారిమనంబులను నట్లుభావించిరి. ఎట్లయినను ఉభయసంస్థానములయందలి పెద్దపెద్దతలకాయలనెల్ల వశ్యముచేసికొనియెను. వారి కందఱకును నాతనిమాటయన్న గురుపదముగ నున్నది. వీరనగరమునుండి బయలుదేరినచారులు ప్రతిగ్రామమునందును

ప్రతివీధియందును దిరుగుచున్నట్లు వారు కనిపెట్టిరి. దేవీపురమునందలి కోటకొమ్మలు కొత్తళములు మున్నగునవన్నియును మరమ్మత్తులగుచున్నట్లు తెలిసికొనిరి. దేవీపురరక్షక సైన్య మభివృద్ధినొందుచున్నట్లు లెక్కించిరి. దీని గూఢార్థమంతయును వారికి బోధపడియెనది కాని పైకిమాత్ర మెవ్వరును సాహసించి చెప్పలేకపోయిరి.

నరేంద్రుఁడిప్పుడు చూడ సుందరముగ నున్నవాఁడు. నవయౌవనారంభునివలె నత్యుత్సాహంబునఁ బ్రవర్తిల్లుచున్నవాఁడు. దూరదృష్టిగల యాపూర్వసేవకు లందఱును నరేంద్రుని దూరముగఁ దీసికొనిపోయి యాతని చెవిలో నీయనుమానములన్నియు నూదుచుండిరి.

రాజాతోడరుమల్లుఁడు మిక్కిలి సమర్థుఁడగు సేనానాయకుఁడు. మానసింహమహారాజు సమర్థుఁడగు పరిపాలకుఁడు. దాని కించుకంతయును సందియంబు లేదు. వారీనవకుమారుని కుచ్చితమార్గములఁ గనిపెట్టినవారు కారు. "నీ పైతృకరాజ్యమంతయు నాతఁడిప్పుడు పిడికిటఁ బట్టియున్నవాఁడు. ఆతఁడీపట్టు సడలనిచ్చువాఁడు కాఁడు. ఓవయస్యుఁడా! కనుగలిగి మెలంగుము." అని చెప్పుచువచ్చిరి.

పట్టణంబునకు నడుమ బహుజనసంకీర్ణమై యుండు ప్రదేశంబున రాజవీవితోడ నతిరమణీయంబుగ రాజమందిర మలరారుచుండెను. ఆమందిరము నాదేశమున రాజబారీయందురు. వానినే మనము గ్రంథముల రాచనగరులని వాడుదుము. అందు కొన్ని భాగములు కట్టి రెండు మూడువందల వత్సరములైనది. అవి యిప్పుడో క్కుంచుక సికస్థపడియున్నవి. తక్కినభాగము లప్పుడప్పుడవసరముల వెంబడిని కట్టఁబడుచు వచ్చెను. సభామంటపము నూతనముగ నర్యేంద్రుని పితామహునికాలమున నిర్మింపఁబడినది. వీథివైపుననున్నది. బాజారునుండిచూచిన నదియెంతో డాంభికముగఁ గనిపించును. పూర్వపు జమీందారుఁడుతోడరుమల్లున కాతిథ్యమిచ్చినదియు నవకుమారుఁడు మానసింహునకీనడుమ విందులు చేసినదియు నీమందిరముననే.

వెలుపలియింటికి విశాలమైన ముందువాయొకటి యున్నది. దానిచుట్టును వేలువేలుభవనము లెన్నెన్నియో కట్టఁబడియుండెను. విస్తీర్ణమగు నాసంస్థానములోని ప్రజలందఱును నన్నిదిక్కులనుండియును గుంపులు గుంపుగ వచ్చి యుదయాస్తమయముల నీప్రదేశమున

మూగుచుందురు. ఈదేశమునందుఁ బూర్వమునుండియు జనులను దూరముగానుంచుటయు, వ్యవహారము రహస్యముగా జరిగించుటయు వాడుక లేదు. జమీందారుల యిండ్లన్నియును బహిరంగమగు కచ్చేరీస్థలములే. సామంతరాజులందఱును నిరంతరమును బ్రజలతోడఁ గలసిమెలసి తిరుగుచుండెడివారు. వారిని తమచుట్టుప్రక్కల నిలుపుకొనుచుండెడివారు. కచ్చేరీ లన్నియు నీమందువారుఁ జూట్టునుండు క్రిందియంతస్తులోనున్నవి. గ్రామాధికారులందఱును వచ్చితాము తమతమగ్రామములలో జమచేసిన సొమ్ము లన్నియును దెచ్చి యిచ్చుటనే యిరసాలుచేయుచుండిరి. లెక్కజమాఖర్చు లన్నియు నిచ్చటనే తేల్చుకొనుచుండిరి. అతివృష్టి, అనావృష్టి దోషములవలన ముదరాలను గోరిన యర్జీదారులమనవు లన్నియు నిచ్చటనె ఆలనచేయఁబడుచుండెను. పంటచెఱువులు త్రవ్వించుకొనుటకును, దుక్కిటెడ్లఁ గొనుటకును, ఇండ్లు మరమ్మతుచేసికొనుటకును వలసినసొమ్ము పెట్టుబడులకై యర్జీలిచ్చటనె దాఖలగుచుండెను. ఇచ్చట నెతగవులు పరిష్కారమగుచుండెను. తీర్పులు తీర్చుచుండిరి. జమీందారులు నియోగించినదండనాయకు లిచ్చటనె నేరములను విచారించి శి

క్షలను విధించుచుండిరి. అప్పుడప్పుడీతీరుమానముల జ
మీందారులు స్వయముగఁ దీర్చుచుందురు. ఏపనియును
లేకుండగనే తమదేశప్రజల కేవిధమైన యలజడులులేకుం
డ నెమ్మదిగ దేశమును పరిపాలించుదేశనాయకులఁ జూ
చిపోవుటకై జనులు తండోపతండములుగ నీమండువా
లోనికె వచ్చుచుఁ బోవుచుందురు.

ఈక్రిందిభవనంబునకుఁ బైన మండువాకుఁ జుట్టు
ను రెండవయంతస్థున్నది. ఇది కాపురమునకేర్పడ్డది. రా
జుగారిస్వంతిగృహము లన్నియును ముందుభాగమున ను
న్నవి. మండువాకు వెనుకభాగమున వరుసగఁ గొన్ని యు
భ్యంతరమందిరంబులున్నవి. అవిజాలరులవలె నుండును.
ఇందు రాణివాసజనముండును. వీనిలో మిక్కిలిదర్శని
యంబైనభవనంబొకటి నరేంద్రునకుఁ బ్రత్యేకవాసస్థల
ముగ నుండెను. హేమలతయును తజ్జననియును మంత్రి
యొక్క సాధారణభవనంబున నివసించుచుండిరి. రాజ
బంధులగు స్త్రీజనమంతయును దేశాచారమునుబట్టియీ
దివ్యమందిరమునఁ దమతమబిడ్డలతోవచ్చి తలాయొక
మూలను దలఁ దాచికొనుచుండిరి.

ఈయాడువాండ్రగదులకు వెనుక నింకొకమండు

వా యున్నది. అచ్చట నున్నవారందఱును నాయింటి పరివారజనము. ఆమండువాలో నేమూలఁ జూచినను గృహకృత్యజీవనమును తత్సంబంధములైన కార్యములే కంటఁ బడుచుండును. ఒకమూల ధాన్యమును ఒకమూలబియ్యమును రాసులక్రింద బోసియుండును. దినమును వచ్చి పడుచుండు పాలుపెరుగు కూరలు మున్నగునవి మఱియొకమూల నుండును. ఉదయము మొదలు రాత్రి రెండుజాములు తిరుగువఱకును వండెడియన్నము వండుచునే యుందురు. మండెడుపొయ్యి మ్రండుచునే యుండును ఊపిరిసలుపకుండఁ బనిచేయు గృహిణులును బరిచారికలును ఉదయాస్తమయము లచ్చటఁ బనిచేయుచునే యుందురు. చిన్నపిల్లలేవిరో యల్లరిచేష్టలు చేయుచుఁ గదలికపుట్టించుచుందురు. ఈలోపల మండువాలో నొకమూల నిలువెల్పు దేవాలయమున్నది. అక్కడ దేవతార్చనబ్రాహ్మణుఁడు వచ్చి గంటలు వాయించియు శంఖము లూదియు నుదయాస్తమయము లారాధన చేయుచు మంత్రము లేకరువు పెట్టుచునేయుండును.

ఈమందిరమున కంటియుండు నారామములు చాలదూరముగనున్నవి. అచ్చట నొకపెద్దపుష్కరిణియు

న్నది. దీనిచుట్టును పండ్లచెట్లున్నవి. దీనికినలుతట్లను గోడ యున్నది. ఆగోడకక్కడక్కడ చిన్నచిన్న ద్వారములున్నవి. ఆద్వారములనుండి పట్టణములోనికిఁబోవచ్చును. ఎంతగొప్పకుటుంబములోఁ జేరినవాండ్రయ్యును మనహిందువులలోని యాచారమునుబట్టి యాఁడువాండ్రు పట్టణమును వేడుకకై చూడఁబోయిన తప్పిదము లేదు. వారుదయమున లేచి పుణ్యనదీజలముల స్నానములు చేసి వత్తురు. దూరముగనున్నను దేవాలయములకుఁ బోయి స్వామిని సందర్శింతురు. గౌరవప్రపత్తిగలప్రక్కయింటివాండ్రఁ జూడఁబోవుదురు. జమీందారీకుటుంబములోని స్త్రీజనము ఇట్టిపనులకుఁ బోవునపుడు సామాన్యముగ నీపాణిద్వారముల వెంటఁ బోవుచు నుందురు. వెలుపలిమందు వా ద్వారములను సామాన్యముగ వాడుక చేయరు.

నవకుమారుని భార్య పూర్వకాలమునందలి జమీందారీకుటుంబములో నున్న యాఁడువాండ్రలో మిన్నయని చెప్పనొప్పును. ఆపౌఢమహానీయురాలు. వ్రతములన్నను తదుద్యాపనము లన్నను మతవిషయములగు కర్మ లన్నను నామె కెంతో శ్రద్ధాభక్తులు. అంతమంది కుటుంబమునకు యజమానురా లయ్యును గృహకృత్య

ధర్మములు నిర్వహించుటలో నామెకువినుఁగన్నది లేదు. అరుణోదయమందె లేచి ప్రతిదినము గంగాస్నానమున కేగి దేవతాదర్శనము చేసికొని ప్రొద్దస్తమానమును నింటిపను లన్నియుఁ జక్కఁబెట్టుచుఁ గాలముఁ బుచ్చుచుండెను. ఆమెయర్చించు దేవాలయము తన్మందిరారామమున నున్నది. నరేంద్రుని పితామహుఁడు కట్టించినాడు. రాజదర్పములనిన నామెకించుకంతయు నిష్టము లేదు. ఇంటిలోనున్న మగవాండ్రును బిల్లలును భోజనము చేసిన వెనుక గాని యామె మధ్యాహ్నభోజనము చేయుట లేదు. పిమ్మట నొక్కింతయలపు తీర్చుకొనును. మరల సాయంకాలమున నింటనుండెడిజనమును పేరుపేరువరుసను గనుఁగొని భోజనముపెట్టి పిమ్మట నేమూలనో కూర్చుండి తానుగూడ క్షుత్తుఁదీర్చికొని యిల్లుచక్కఁబెట్టి శయనాగారమునకుఁ బోవును. ఆమందిరమున వసియించుబంధుగు లందఱును, కుటుంబజనమును ఆమెమాట కడుగుదాఁటరు. ఏయోచన కావలసివచ్చినను ఆమె నడుగక యేపనులును జేయరు. ఆమెబుద్ధివిశేషమును బరికించి భర్తతన సంస్థాన వ్యాపారములందుఁగూడ నామెను సంప్రతించి దాని ననుసరించి పోవుచుం

డును. కొన్ని సమయములయందామె తనయిచ్ఛానుసారముగఁ బ్రవర్తించుచుండును. నవకుమారుఁడును బ్రగల్భుఁడు. ఆతఁడెంత సంస్థానమున కధిపతి యైనను నట్టి సమయములయం దామె కెదురు చెప్పలేకపోయెడివాఁడు.

నవకుమారునిభార్య నరేంద్రుని పుత్రవాత్సల్యమునఁ జూచుచుండెను. ఈమెవీరనగర వంశమువారి యాడుపడుఁచు. ఈవాత్సల్యమునకుఁ గారణమిదియా? లేకున్నాతని వంశౌదార్యమును నాతనిముఖ వికాసమును, తల్లిదండ్రులు లేని యాతని యసహాయతను గాంచుటచే హృదయమునందామె కాతనియెడఁ గలిగినయవ్యాజప్రేమయా? ఆమె హేమలత నొకకన్నుగాను నరేంద్రు నొకకన్నుగాను జూచుకొనుచుండెను. వారుభయులును తోఁటలలో సలిలవాటికల నాటలాడుకొనుచుండుటఁ జూచిముసిముసినవ్వులు నవ్వుకొనుచుండెడిది. అంతటిప్రేమతోడఁ జూచికొనుచున్నయట్టి తల్లికి హృదయమున వారిభవిష్యత్తునుగూర్చి యోచనకలుగకుండునా? కలుగకుండిన నామెను మనము స్త్రీయని చెప్పవచ్చునా?

హేమలతకుఁ బంద్రెండేండ్లు వచ్చినవి. పెండ్లియీడు సమీపించినది. నరేంద్రున కించుమించు పదునాఱేండ్లున్నవి. తల్లియొకనాఁడు ప్రాతఃకాలమున స్నానముజేసి వచ్చుచుండ వారిరువురును తోఁటలో నాటలాడుచుండిరి. నరేంద్రుడు కొలనినుండి జలముతెచ్చుచుండెను. హేమలతనీళ్ళు పోయుచుండెను. ఆమాధవీలత నామె స్వయముగా నాఁటినది. హేమలతతల్లి యచ్చట నొక్కించుక నిలువఁబడి పరమానందముగ నాట లాడుకొనుచున్న యాపిల్లలవంకఁ జూచెను. ఆదినముననే యామెహృదయమునఁ గృతనిశ్చయయయ్యెను. ఆతోఁటలోని దేవాలయమున దేవతాసందర్శనము చేయునపుడామె ప్రార్థనములలో మాతృవాత్సల్యమునఁ బొడమిన యీమనోరథముగూడ సమ్మేళనమయ్యెను. మధ్యాహ్న మొక్కింత ప్రొద్దువేళ ననకుమారుఁడు భోజనముచేసి విశ్రమించియున్నపుడు, ఇతనిభార్య వచ్చి ప్రక్కనుగూరుచుండెను. ఉదారసౌశీల్యద్యోతకంబులై హృదయంగమంబులైయొప్పు నామెవీక్షణంబులు భర్తృనిరీక్షణంబులతో మేళవించునట్లు ఆమె నాతని పైవింతగ నత్తమిల్లి సంభాషింపఁజొచ్చెను. వారిరువురకును నీక్రిందిప్రసంగముజరిగెను.

“ప్రాణేశ్వరా! నేఁడు మీ మొగమేమియో వ్యాకులపాటును జెంది విన్ననై తోఁచున్నది. మీనయనంబులు కాంతిఁదొఱంగి వెలవెలఁబోవుచున్నయవి. విశ్రాంతి యొక్కింతయును లేక పనిచేయుచుండుటచే దేహారోగ్యము చెడిపోవుచున్న దని భయపడుచున్న దానను.”

“కాంతా! పురుషుండ నేకధర్మములఁ బ్రవర్తిల్లవలయును. ఆతనిమనోవ్యధలును విశేషముగనే యుండును. అయ్యవి స్త్రీలకెఱుంగవగును”

“అయినను భార్య భర్తమనోవిచారములఁ బంచుకొని సంతోషపూర్వకముగ వానిఁదొలంగింప నరయుచుండునుగదా! కొన్నిదినములనుండి మీమనస్సున నెద్దియో నూతనవిచార మొకటి పట్టి పీడించుచున్నదని తలంచెదను. మీసతి మీకష్టములను బంచుకొన నర్హయేయనియప్పుడప్పుడు మీరే సెలవిచ్చుచుండురు.”

“ప్రాణేశ్వరీ! నీవు చెప్పినది నిజమగును. ఒక్కొక్కవత్సరము పైఁబడినకొలఁది నామనమునం దొక్కొక్క వ్యధ యధిక మగుచున్నది. నీయుపదేశ మెంతయును బ్రయోజనకారి యని నేనెఱుంగుదును. నరేంద్రుఁడు ప

ద్ధవాఁడగుచున్నాఁడు. ఆతనిస్థానము నేఁడోరేపో యతని యధీనమగునా."

"నాథా! మంచిమంచివార లందఱును మీయెడ నెంతయు నాదరంబున మెలంగుచున్నవారలు. రాజమహాలునుండివచ్చిన మహారాజు గారు కూడ జననీజనకవిరహితుఁడై యసహాయుండై యున్న పిల్లవానినెంతోవృద్ధిలోనికిఁదెచ్చితిరనియు, నాతనితండ్రుఁబసంస్థానము ఆతనికంతకంటె బాగుగ నొప్పగింతు రనియును మిమ్ముఁ బ్రశంసించి యుండిరి. మీపేరును కీర్తియును దేశమునఁ జాలదూరము వ్యాపించియున్నది."

"ఏమీ! నాతండ్రితాతలువీరికన్న హెచ్చుగనోసమముగనోఅడుగుపెట్టిరి. అట్టియీదేశమున వీరిక్రిందివాఁడనై వీరిరాజ్యవ్యాపారములఁజక్కఁబెట్టుచు కాలక్షేపము చేయుచుండుట నీకు శ్రోత్రవంతముగనుగీర్తిదాయకముగనున్నదా? కాంతా! నీవిప్పుడు దేవీపురరాజునకుఁ బట్టమహిషివి. రాజభార్య కుండవలసినయౌదార్యము నీయొద్ద కనబడదేమి?"

"ప్రాణేశ్వరా! ఆయవమానము మీకెట్టిదియో నాకు నట్టిదియే. కృపాళుండగు భగవానునియనుగ్రహ

మున మనరాజ్యగౌరవంబు మనకులభింపఁగల్గదు. మనము సుఖింపఁగలము."

"భగవదనుగ్రహమున నేమి! మనకు మనరాజ్యము చేకూఱుట. నవకుమారునకు స్వతస్సిద్ధముగ నుండు తెలివితేట లాతని విడచిపోవవేని దేవీపురము పూర్వముకన్న మిన్నగఁ బేరును గీర్తియునుబడయఁగలదు."

"ప్రాణేశ్వరా! అది యట్లే యగుఁగాక! మున్ను మన మెన్నెన్నియో యిడుములఁ గుడిచితిమి. భగవానునియనుగ్రహంబున గట్టెక్కితిమి. భవిష్యత్ప్రాభవలంబునకుఁగూడనట్లె యాతఁడుమార్గముచూపఁగలఁడు"

"ప్రాణేశ్వరీ! మనసు విడిచి మాటలాడుము. నీ మాటలధోరణింబట్టి యీవిషయమున నెద్దియో పలుకఁదలంచినట్లు పొడకట్టుచున్నది. నీయోచనాబలంబున నెద్దియో పలుకఁ దలంచినట్లు పొడగట్టుచున్నది. నీయోచనాబలంబున నేను చాలసారులు సఫలమనోరథుండనైనాఁడను."

"నాథా! మీతనయ హేమలత కిప్పుడు వయసెంతో యెఱుంగుదురా?"

"ఎఱుంగ కేమి? పం(డెండేండ్లున్నవి మనము దే వీపురము వచ్చునాఁటికి రెండేండ్లు. అది జరిగియిప్పటికిఁ బదివత్సరములైనది."

"ఆమెపరిణయ సంబంధమును యోచించుటకిది యింకను సమయముకాదా?"

"కాంతా! నీవుచెప్పినది యుక్తముగనేయున్నది. కాని నామనస్సునందింకనట్టి తలంపు పుట్టలేదు. మనమి పుడు దేవీపురసంస్థానమున కధీశ్వరులమైయుండినచో నీపుడమింగల క్షాత్రవంతులగు మహారాజు లందఱు నువచ్చి యామెకరగ్రహణమున కాసించియుందురు. మ నము నీరనగరమునం దిట్లు హీనస్థితియందున్నవాండ్ర నెవ్వరీ పరిణయంబున కాసింతురు?"

"నాథా, నేనిన్ని యెఱింగినదానను కాను. దే వీపుర రాజకన్యక నాసించువరులెందఱో యున్నవారని మాత్రమెఱుంగుదును. వారందఱును దగినవారు నగు దురు. దగ్గఱసంబంధములును దూరపుసంబంధములును గూడ నిరంతరము నాయొద్దకు వచ్చుచునేయున్నవి. కా ని యీబిడ్డ వరప్రసాదిని యగు మనయేకపుత్రిక. దీని నె

డఁ బాయుటయనినఁ గడుపు తఱుగుకొని పోవుచున్నది. జీవితేశ్వరా! ఈయేకపుత్రీకావియోగమును సైచి నేను నఁజాలను."

"కాంతా! వలదు వలదు. హేమలత నీకెంతయు ద్దులపట్టియో నాకు నట్టిదియే. నారాజ్యమున కంతకును నామెయేకర్త. ఆమెకు వరుండుకాఁగలయాతఁ డెంతటి ప్రగల్భుఁడైనను దేవీపురరాజ్యమునకుఁబట్టము గట్టిన లదనువాఁ డుండఁడు. మనకాలము చెల్లినపిమ్మట నీరా జ్యము వారిదేకాదా?"

"ఈనడుమ మీరువీరనగరరాజకుమారుని నరేం ద్రుని జూచితిరా?"

"ఆతని నేను తఱచు చూచుచునే యుందును. ఆ తనిప్రశంసయేల?"

"ఆతఁడు మిగులఁ జక్కనివాఁడు. రూపవంతుఁ డు. అంతతేజోవంతమైనవర్చస్సును, అంతటి యౌదార్య ప్రవర్తనమును నాయీకనులకింతవఱకునుగనఁబడలేదు."

"అవునవును. ఆతని మొగము చక్కనిదే యగు ను. ఆతని పాండిత్యము నిరుపమాన మైనదని యాతని

యూహ. ఆతఁడెప్పుడు విచారములతో మునిఁగి తేలు చుండును. ఎవ్వరో తాంత్రికులు కొందఱాతనికి దురుపదేశములు చేయుచున్నారు. ఆతఁడిప్పుడు కొంటెయోచనలలో మునిఁగి తేలుచున్నవాఁడు."

"నాథా! వంశమునుబట్టియును, అవస్థనుబట్టియును గూడ నిట్టివికొన్ని వచ్చుచుండును. వానిని మనము పాటింపవలయును. ఆతఁడు గర్విష్ఠి యనుచున్నారు. అతని గర్వమునకుఁ దగిన కారణము లేదాయేమి? ఆతని తాతతండ్రులెక్కిన సింహాసనమె యాతఁడెక్కెను. అయ్యది యాతని కుచితాలంకారము కాదా?"

"హా! హా! హా! ఈచెడుపిల్లవాఁడెన్నఁటికిని తాత వంటివాఁడు కానేరఁడు. అతఁడు నాకుఁ జేసిన దేమియును లేదు కాని, యాతనియొద్ద పౌరుషలక్షణము లున్నవి."

"నాథా నన్ను మన్నింపవలయును. ఈవిషయమున నాఁడుదాని యభిప్రాయమే గణనీయమైన యభిప్రాయము. వీరనగరరాజ్యము నేలిన పూర్వనాయకుల కెవ్వరికి నీతఁడు తీసిపోవువాఁడు కాఁడు."

నవకుమారుఁడు నవ్వుచు "అట్టిపురోభివృద్ధిసూచన లేవియును నాతనియొద్దఁ గనిపించుటలేదు." అనియెను.

"మరల మనవిచేయుచున్నదానను. ఆఁడుది మొగము చూచీ చూచుటతోడనే యిట్టిసంగతులను కనిపెట్టఁగలదు. కొన్నిసంవత్సరములనుండి నేనాతనిని, ప్రొద్దునను సాయంతనమునను గూడఁ బరిశీలించిచూచుచున్నదానను. పురుషునిహృదయరహస్యములను బాగుగఁ గనిపెట్టఁగల దొక్కయాఁడుదియే."

"ఆతని కేమియోచన లున్నవో నేనెఱుఁగనుగాని నాకుఁ గనఁబడుచున్నవన్నియును గొంటెపనులును గర్వపుయోచనలును."

"మీరు సెలవిచ్చినది నిశ్చయమే యైయుండవచ్చును గాని అంతగర్విష్ఠియును, అంతతిరస్కారశీలుఁడును, మనహేమలతను జూచినతోడనే అతిసాధువృత్తి నవలంబించి గొఱ్ఱెపిల్ల యగును. ఆమె చెప్పినదెల్ల దాసునివలెఁ జేయుచున్నాఁడు. ఆమెచిఱునగవులఁ గాంక్షిం

చుచుండును. ఆమెకన్నులనుండి యశ్రుకణములు రాలిన నాతనిప్రాణములు పోయినట్లు లగును"

"ఏమిది ? ఈయపాత్రపుపనులన్నియు నేమిటి? ఈతఁడు మనచిన్నదానిచుట్టును బదింబదిగఁ దిరుగుచుండుటఁ దఱచుగాఁ గన్నులఁ బడుచున్నది. నీవాకుఱ్ఱవానిని కొంచెము జాగరూకతోఁ జూచుచుండవలయును".

"నాథా ! ఆతఁడు పసివాఁడు. పసివాని హృదయమెట్లులుండునో యాతనిహృదయము నట్లులేయుండును. ఆతనికిఁ జేయుట కేమున్నది? ప్రపంచమునకంతకును మూలాధారము పెండ్లికదా ! మన హేమలత నాతఁడట్టివివాహమునఁ బెండ్లాడును. వారియనుకూలదాంపత్యము దేవీపురవీరనగరరాష్ట్రముల కైక్యము నెరపును. మీపూర్వులకు లభించిన ప్రతిష్ఠకన్న మీప్రతిష్ఠ యధికము కాఁగలదు."

"ఓవీరపత్నీ ! అదినీకుఁ బుట్టవలసినయుద్దేశమే? నీవునాకు భార్యవైయుండి యీయుభయకుటుంబములకును గలవైషమ్యము లెఱింగియుండి యిట్లు పలుకుటయుచితమగునా ? నేను విధివశంబునఁ గొన్ని నాళ్ళువీరనగ

రంబునఁ గొలిచియుండవలసివచ్చి యట్లు చేయుటచే నావంశప్రతిష్ఠ యంతయును మఱచితినని తలంచితివా? మూఁడువందల సంవత్సరములనుండి పరస్పరవైషమ్యములచేఁ బెనంగి, నేఁడు నాయీముద్దులపట్టిని యీ దేవీపురసంస్థానమును, ఈకొండికవానికి సమర్పించుటకంత యనాథ ననియే తలంచితివా?"

మఱుమాట సహింపని స్వరముతో "నాథా! మీయుద్దేశమేమియో నాకు బోధపడలేదు. మూఁడువందల సంవత్సరములనుండి స్పర్థగలిగియున్న యీ రెండు సంస్థానములు నేకమగు ననియును, ఈయుభయసంస్థానములకును హేమలత పట్టమహిషియగుట యధికప్రతిష్ఠయనియును దలంచుచుంటిని. మనకు వేఱుపుత్రుఁడు లేఁడు. మనకుమార్తె నెవ్వఁడు పెండ్లియాడునో యాతఁడే మనపుత్త్రుఁడు. మనరాజ్యమునకాతఁడె యధీశ్వరుండుఁ నరేంద్రుఁడె యామెను బరిణయము కాఁగలఁడు"

నవకుమారుఁ డామె యీతీరుమానము ముందఱ వెనుకాడెను. మౌనముద్రఁ దయ్యెను. అంతనామె మృదుమధురస్వనంబున "ప్రాణేశ్వరా! నేను నరేంద్రుగుణ

గతుల విచక్షణముతోఁ జూచితిని. అం దేమియును గొఱఁత కనిపింపదు. అత్యుత్సుకుండగు నీవయసు కాఁడు మనః పూర్వకముగవచ్చి దేవీపురమున వసియించును. పెండ్లికి ముందుగనే యీయేర్పాటులు చేయవలయును. దేవీపురముతో స్పర్ధకలిగి, వర్ధిల్లువీరనగరము యథావిధముగ దేవీపురమునకధీనమై స్వాతంత్ర్యమునందుండినచో నింక నాపురప్రతిష్ఠను గూర్చి చెప్పవలసిన దేమున్నది? దేవీనగరజృంభణమునిన మీకెట్టియభిమానమున్నదో నాకును నట్టెయభిమానమే యున్నది. దేవీపురకులస్త్రీ లెట్టు యోచింపవలయునో యట్లేయోచించి పలుకుచున్నదాన ను." అనిచెప్పెను.

నవకుమారుఁడు భార్యవాదము హేతుయుక్తముగ నున్నదని తలంచి యూరకుండెను. వీరనగర దేవీపురముల నడుమనుండు ప్రతిస్పర్థ లన్నియు నొక్కసారిగ నంతరించిపోవును. మిక్కిలియగు సౌఖ్యముచేకూరును. వీరనగర సంస్థానమువచ్చి దేవీపురముతోఁ జేరెనేని దేవీపురరాజ్యగౌరవమును బలమును స్వాస్థ్యములును నెంతయేని వృద్ధిఁగాంచును.

నవకుమారుఁడు తుట్టతుదకు "అట్లయిన యోచింతము. లెమ్ము" అనియెను భార్య తనయుపదేశము కొంత పనిచేసినదని తలంచెను. నరేంద్రుఁ డాసమయమున మాధవీకుసుమముల బుట్టనిండఁ బెట్టుకొనెను. హేమలతానరేంద్రులిద్దఱును నాగదివెంట నరుగుచుండిరి. ఈదంపతులు వారిరువురను గాంచి సన్నసన్నగ మాటలాడుకొనఁజొచ్చిరి. నవకుమారునకు నరేంద్రుఁడు వినమ్రుఁడై తనచేతనున్న కుసుమములఁ గొన్ని సమర్పించెను. ఆగౌరవమంత మనస్ఫూర్తిగఁ జేసినదికాదు. అనంతరము హేమలత తల్లికడకేగి పూలవల్లిక యామెకడఁ బెట్టి యవ్యాజప్రేమతో నామెకు సాష్టాంగమెఱగెను.

నవకుమారునిభార్యయు నరేంద్రుని మూర్ధంబు తనవామహస్తంబున స్పృశియించి దీర్ఘాయుష్మంతుఁడ వుకమ్మని దీవించి హేమలతయును నీవును సుఖంబుండుఁడని యాశీర్వదించెను. ఆమె తనమనస్సంకల్పము లన్నియును లోపలనె యుంచుకొనియెను. కాని యాదినమున నామెజన్మము సార్థకమైనట్లును తనప్రాగల్భ్యము నిలిచినట్లును దలంచెను. దీని కంతరాయము నాపాదింపగూఢశాంత్రికుండొకఁడున్నవాఁడని యామె యెఱుంగనేరదయ్యెను. ఆశాంత్రికుఁడెవ్వఁడో? గోకులదాసే.

---

## నాలగవప్రకరణము.

———:o:———

### గూఢతాంత్రికుఁడు.

గోపాలదాసునియిల్లు జమీందారీ హావేలీకి చాల దూరము. పట్టణమున కొకమూల యెక్కడనో యొక వివిక్తస్థలమున, ఉదయమున పెందలకడనె భోజనముచేసి ప్రతిదినము నాతఁడు దివాణమున కరుగుచుండెను. సంస్థాన రాజ్యకార్యము లన్నియుఁ జక్కబెట్టువాఁడాతఁడే. పొద్దుగ్రుంకువఱకాతఁడు కచ్చేరిలోనేయుండి పనిచేయుచుండును. సాయంకాలమైనపిమ్మట ఒక్కొక్కప్పుడు బాజారులో దీపములన్నియు వెలిగించినపిమ్మటఁగూడ, బాదచారియై కచేరిపనియంతయుఁ దీర్చుకొని విసివివేసారి యింటికి వెళ్ళుచుండును. బాహ్యావేష మాతనికి మిక్కిలి తక్కువ. పరివారిజనము బహుస్వల్పము. కచ్చేరికి రాకపోకలు చేయునపుడుకూడఁ గొందఱంగరక్షకులు వెంబడింతురు. వారియొద్ద నెవ్వరికిని గనఁబడకుండ నాయుధములుండును. దేవీపురపీరనగర రాష్ట్రములరెంటికిని సర్వవిధముల నీతఁడే యధికారి. ఎవ్వరికి వాలుకుమసాదరుచేసిన నితఁడే. ఏచారునియొద్దనుండి సమా

చారమందుకొనిన నతఁడే. ఆతనియిల్లు కుటీరతుల్యంబు. దానిపైకప్పు వరిగడ్డి. చుట్టునున్న యావరణము కంచె.

వెలుపలి మండువాలో నొకశిలానిర్మిత భవనమున్నది. గోకులదాను చూడవచ్చినవారి కందఱకును దర్శనమిచ్చుస్థానమిదియే. సంస్థానవ్యాపారములకు వలయు యోచనలన్నియు నచ్చటనే జరుగును. ఈమండువాకు వెనుకభాగమున లోపలగా గదులున్నవి. అందొకపెద్ద కుటీరము శయనమందిరము. ఇఁక రెండుమూఁడిండ్లు వేఱు వేఱుగ నున్నవి. వంటకొక సాలయున్నది. ఇవియన్నియును లోపలిమండువాకు చేరియుండునట్లు కట్టియున్నది. ఈమండువాకు వెనుకభాగమున గయాళుభూమి. యున్నది. అందచ్చటచ్చట మల్లిచెట్లు మాత్రము కొన్నికలవు. కానిచాలభాగము అరణ్యమువలె నుండును. అప్పటికిని నిప్పటికిని నాదేశమున నిండ్లు శ్రీమంతులవియు దరిద్రులవియు గూడ నిట్లేయుండును. పల్లెటూళ్ళకును పట్టణమునకును నీవిషయమున భేదమే లేదు. మండువాలు రెండును గూడ వెల్తురును గాలియును వచ్చుటకేర్పడినవి. దేశ ముష్ణదేశమగుటచే నివి యత్యావశ్యకములు.

గోకులదాసపత్నీకుఁడు. ఆతని కొకకుమారుఁడు మాత్రి మున్నాఁడు. ఆతనియవస్థలో నున్నవారంద అును సామాన్యముగ మరలఁ బెండ్లిచేసికొందురు. గాని గోకులదాసు హృదయ మంతయును దేవీపుర సంస్థానాభివృద్ధియందె లీనమైయున్నది. ఆవిశ్వాసముచే నాతని తలంపు లన్నియును దానియందె మునిఁగి తేలుచుండును మఱియొక్కపని యాతనికిఁ దోఁచుటయైన లేదు. ఆతనికి వంటయును బెట్టను బేదబ్రాండు్రి బంధుగులు చేయుచుండెడివారు. మిగిలిన యుపచారములకును నట్టివారె కొందఱుండిరి. శ్రీమంతులగువారియిండ్ల జరుగుబాటు తక్కువగ నున్నవారు చేరి పోట్టబోసికొనుట దేశమున నాచారము. వెలుపలనున్న శిలానిర్మితభవనమాతనిస్వంతము. అందెవ్వరును బ్రవేశింపరాదు. వ్రాతపని చేయునప్పుడైనను ఎవ్వరితోడనైన ముచ్చటించునప్పుడైనను ఎవ్వరు నాతనికంత రాయము కలిగింపరాదు.

ఆరాత్రి యాగదిలో నాముదముదీప మొకటి వెలుంగుచున్నది. ఇద్దఱుమనుష్యులు కూర్చుండి యుండిరి. ఆదీపపువెల్తురు గుడ్డివెల్తురు. ఆవెల్తురున వారి మొగము లెట్లుండునో యది చిత్రకారుఁడు తెలుపవల

యెను. నవకుమారున కేబదియేండ్లు పైఁబడి చాలకాల మైనది కాని యింక నాతనితలవెండ్రుక యొక్కటియును నెరియలేదు. ఆతనిముఖమింకను బలిష్ఠముగానే యుండి నడివయసులో నున్నవానికంత యుత్సాహ మున్నట్లు కాన్పించును. ఆతని దేహసౌష్ఠవ మింకను పటిష్ఠమై బలముగనే యుండెను. కన్నులు పౌరుషలక్షణములు వెలార్చుచు నాతనిమనోనిశ్చితముల నెఱింగించును. దృఢిమ గలయాతని యాకారము గూఢముగనున్న తన్మనోవికారముల సూచించుచుండును. అర్ధరాత్రి యైనది. గోకులదాసునితో నెద్దియో సంప్రతింప నవకుమారుండెయాతని యింటికి విచ్చేసెను. దివాణమున నెప్పుడును జనసమర్దమే. రహస్యాలోచనమునకు నిరుపహతమైనస్థలమే దొరకకుండెను.

గోకులదాసుని ముఖమునకు నాతనిప్రభువుముఖమునకు నెంతోవ్యత్యాస మున్నది వారిద్దఱు నొకయీడువారె కాని గోకులదాసు కున్నయంతకంటె మఱిపది యేండ్లు పెద్దవలెఁగాన్పించును. వార్ధకమున నాగిలిపోయిన యవయవపటుత్వ మంతయును సడలియుండెను. ఆతనిముఖమంతయును ముడుతలుపడియెను. ఆముఖము

న మార్పే కనుపించుటలేదు. ఆతనిలోపల నేమున్నదో మాటలనుబట్టి తేవలసినదే కాని ముఖచిహ్నములనుబట్టి తెలిసికొనునవకాశము చిక్కుట లేదు. కన్నులు చిన్నవి. తల నెఱసినది. ఆతఁడు తనసందర్శకునకు వినయవిధు లొనరించి ప్రభుని మృదుకుతనము నపహరించుచు మి క్కిలి శాంతముతోఁ జెప్పుచుండెను. యోచింపయో చింప నొక్కటొక్కటిగ నాతని ముఖమునుండి వెలువ డు మాటలు సుత్తి దెబ్బలవలె చెవులఁ బడుచుండెను. దే హపటుత్వమంతయుసడలి సగౌరవంబుగ సవినయంబు నసంభాషించు గోకులదాసుని తత్ప్రభుని పరిశీలించి చూచిన వారందఱును నవకుమారుండు ప్రేకవరుండని యును, ఆతనికిఁ జుకాని గోకులదాసే యనియును, ఈవృద్ధుండెటుతిప్పిన నవకుమారుండట్లు తిరుగువాఁడే యనియును గ్రహింపక మానరు.

ఉండియుండి నవకుమారుఁడు "ఇక్కడ మనము తప్ప నెవ్వరును లేరనుకొనియెదను" అనియెను.

'మా వాండ్రిందఱును వసంతోత్సవము చూడఁ బోయినారు. వెలుపలిద్వారమునకు, దాళము వేసి వచ్చి నాను"

'గోకులా! ఈనడుమ సమాచారము లన్నియు విన్నావా?"

"సంగతులు మాకంటె మీకు బాగుగా, తెలియును. అవి నీపరిముఖమున నేవినవలె యున్నది."

"కృతనిశ్చయు లగు ఆఫ్గనులు దక్షిణమున మునుపటివలెనే ప్రబలులై యున్నవారు. మానసింహరాజు వారి నణఁగఁద్రొక్కి జహానాబాదావలకును పోయి నాఁడుఁ కాని వారాతనికి లొంగినారు కారు. పైగా వారు మానసింహరాజుపై వచ్చిపడి యాతని కుమారుని గొని పోయి చెఱఁబెట్టిరి."

"ఇది జరిగి రెండేండ్లయినది"

"పిమ్మట ఆఫ్గనులు మానసింహుని కుమారుని విడిచిపుచ్చిరి, ఒరిస్సా రాష్ట్రము వారికి వదలివేయఁబడెను. పేరునకుమాత్రము వారుఅగ్బరును సార్వభౌమునిగ నంగీకరించి యుత్కలరాజ్యము నంతయును నిరంకుశముగ నేలుకొనుచున్నారు. మొగలాయీల కథ బంగాళారాష్ట్రమునందుఁగూడ నిట్టులే యున్నది."

“ ప్రభువరా! ఈసంధి విశేషకాలము నిలిచి యుండదు ”

“ ఉండకపోవచ్చును, కాని, మానసింహుఁడేమి చేయునో మాత్రము తెలియకున్నది. ఒరిస్సాలో నతఁడు తనముఖమును గనఁబఱచుటయనిన జంకుచున్నాఁడు ”

“ ఆతనికి జరుపులేనివ్యాపారములు చాల నున్నవి ”

నవకుమారుఁడు చిఱునగవుతో “ఆతఁడీనడుమ నీకొసంగినబిరుదులచే నీవాతడనిన నంతపక్షపాతముగ మాటలాడుచున్నావు ” అనియెను.

గోకులదాసు శాంతముతో “నాకుఁ దెలిసినంత వఱకు జరిగిన గౌరవములను లభించినబిరుదములను విన్నవించినాను. నాతండ్రితాతలవలెనే నేనును దేవీపురసంస్థానమునకు విశ్వాసపాత్రుఁడైన భృత్యుఁడనని—,,

“ నేనదిపూర్ణముగ నెఱుంగుదును. ఎన్నఁటికిని మఱవఁజాలను. కానిమానసింహునిగూర్చి మీయభిప్రాయమేమియో చెప్పవలయును. ”

"అక్బరుచక్రవర్తికడ మానసింహునికి మించిన సమర్థుఁడగు సేనానాయకుఁడు మఱియొక్కఁడు లేఁడు. ఆతఁడొక్క సేనానాయకమాత్రుఁడే కాఁడు ఆతఁడు యుద్ధమున నెంతసమర్థుఁడో " ఆలోచనలయందుఁగూడ నంతనిపుణుఁడు? "

"తరువాత? "

" తరువాత చెప్పెడిదేమి? ఒరిస్సా నాతఁడు ఆఫ్గ నులయొద్దనుండి లాగుకొనును "

"ఒరిస్సాను వదిలివేసి సంధిచేసికొనినాఁడే ! "

"అది యంతయును ముందెత్తు. "

" అట్లయిన రాజప్రతినిధియైయుండి మాటతిరుగా? "

" అట్టిపనితోడ నవసరములేదు. ఆఫ్గనులు వట్టిపిరుగఁ బాటుకొయ్యలు. వారే గిల్లికజ్జాపెట్టుకొందురు. "

"వయస్యా! నీకీసమాచారమెట్లు తెలిసెను? "

“ ఈనడుమ నొకగూఢచారిని మానసింహుని యాస్థానమునకుఁ బంపియుంటిని. ప్రభువువారి కీసమాచారమంతయును నివేదింప తరుణము కొఱకు వేచియున్నాఁడను ”

అంత గోకులదాసు లేచి యొకతలుపు తాళము దీసెను. ఆతలుపు యింటిగోడలో నమర్చియున్నది. దాని రంగును గోడరంగు నొక్క మాదిరినే యుండుటచే నది యంతయును గోడక్రిందనే కనఁబడుచుండెను. తలుపుతీయుటతోడనే యందొక యినుపపెట్టెకనబడుచున్నది. అదియునుగోడలోనమర్చి కట్టినారు. దానితలుపు తెఱచి అందులోనుండి కాగితముకట్టయొకటి తెచ్చి నవకుమారునిముందు పడవైచెను.

నవకుమారుఁడా కాగితములను మెల్లగనాగుడ్డిదీపము వెలుతురున శ్రద్ధతోఁ జదువుకొని యిచ్చుట బడవైచెను.

“దీనివ్యాపారము చూచినఁ జాల గడబిడగ నున్నదే? ఆఫ్గనులు జగన్నాథము నందలి దేవాలయమును కొల్లబెట్టినారా? మానసింహుఁడు హిందువుడు. హిందుమతమునకంతకును జరిగినయీద్రోహము నాతఁడు విడిచిపుచ్చునా? ”

" ఎవ్వారికిని దెలియకుండ నతిశీఘ్రముగఁ దన సైన్యముతో నాతఁ డిదివఱకే పోవుచున్నాఁడు. "

" రాజు గెలిచినను, ఓడినను రక్తవాహిను లగు యుద్ధమువూత్ర మొకటి యుయినించి యున్నది."

" ఘోరయుద్ధమే సంభవ మగును. సామాన్య ముగ మానసింహుఁడోడిపోరాదు. "

" అట్లయిన నాతఁడీసారి యొరిస్సాను జయించి యక్బరు సామ్రాజ్యమునకుఁ జేర్చివేయు ననియేనా నీ యూహ? "

" ప్రభువువారియోచన సమంజస మైనది. అం దువలనమానసింహుఁడు కొంతకాల మొరిస్సాలో నుం డవలసివచ్చును "

"అట్లయినమనవ్యూహము లన్నియును తారుమా రగునే?

" మనకు సహాయకారులగువారు మనకు విజయ ముత్వరత్వరగ లభింపజేయుదురు "

" నీపలుకులు భావగర్భితముగ నున్నవి. నాకు భావముకావుటలేదు. గూఢార్థము విడిచి స్పష్టముగ మా టలాడవలయును. మనదేవీపురమును మన కొసంగు మని

మానసింహరాజునకు నీవు అర్జీ వ్రాయుచుంటివే? ఎక్కడనో దూరమున సేట్టియుద్ధములును విజయములును సంసిద్ధములై యుండినపుడు రాజపుత్రుఁ డిట్టి కార్యముల నెుగ మైనను జూచునా!"

"రాజుగారు దూరస్థులై యుండునపుడు సంస్థాన వ్యవహారము లన్నియు నాతని 'కానంగో' చక్కపెట్టుచుండును"

"కానంగోమాత్రము మనల ననుగ్రహించునా?"

"ప్రభువువారికోశద్రవ్యము కొంత వారికఁ చేరికిఁ జేరినది."

ఈకొత్తసంగతులను వినునప్పటి గోకులదాసు చేష్టలను గూర్చి నవకుమారున కాశ్చర్యమయ్యెను. గోకులుని ముఖమున మాత్రము సంకోచవికాసములనునవి కనఁబడుట లేదు.

"గూఢతాంత్రికుఁడా! ఏమి నీకీ వెఱ్ఱి? ఈయేర్పాటులు తోడరుమల్లుఁ డొనరించినవి. మానసింహరాజాయంతటివాఁడు వాని నంగీకరించినాఁడు. ఈబంగారున కాశపడిన మాత్రమున కానంగోయేమైనను చేయఁగలఁడా?"

"ఇప్పటియేర్పాటులను మార్పుచేయుటకు కానం గో కెన్నియో కారణము లున్నవి. వీరనగర దేవీసంస్థానముల నెన్నియోకలవళములు పుట్టనై యున్నవి. ఈరెండుసంస్థానములనుండియును సార్వభౌమునకు రావలసిన కప్పము లన్నియును బాకీలుపడిపోవును. ఈపన్నులు పోకుండ నిలుపుకొనుటకై యేవో కొన్నియేర్పాటులు జరుగవలయును."

"ఏమీ! సార్వభౌమునిపన్నులు చెల్లుటకై దేవీపురమును మనకొసంగి వీరనగరమును ఈడురాని బాలకునకును వానియాప్తవర్గమునకును వదలివేయుదురా? వింతగాసున్నదే!

"అట్లుగాదు. ప్రభువువారికి దేవీపురమును విడఁదీయుటయే యిప్పుడత్యావశ్యకము గాని వీరనగరము కుఱ్ఱవాని కొసంగుకార్య మిప్పుడు జరుగఁబోదు."

"గోకులా! నీవేమిచెప్పినను కట్టుకథవలె జెప్పుదువు. స్పష్టముగాచెప్పుము. వీరనగరముమాట యేమగునో?

"నరేంద్రునకు వయసువచ్చువఱకును సార్వభౌమునిపక్షమున ప్రతినిధి యొకఁడేర్పడి వీరనగరమును పరి

పాలించుచుండు. నరేంద్రుఁడు పెద్దవాఁడై బాకీలన్ని యుఁ జెల్లించినపిదప నాతని సంస్థానమాతనికి విముక్తి యగును.

"ఇదియంతయు నింతశీఘ్రకాలమున సంప్రాప్త మగుట వీరనగరము శ్రీమంతమైనదగుటచేతనా?"

" అదియప్పటికిని జరుగనేజరుగదు"

"ఎందుచేత"

సార్వభౌమికప్రతినిధితో గోకులదాసునకు సంబంధ బాంధవ్యములుండుటచేత;'

వీరనగరమునందలి పన్నులన్నియును బాకీలుపడుటకా?"

"పడుటకుఁగాదు. పెట్టుటకే"

"తదుపరి?"

"వీరనగరరాజ్యమునందలిపన్నులన్నియు నంత నిరాధారముగా బాకీలుపడునెడల ఆబాకీలకై జమీనే యమ్మివేయుదురు. దేవీపురనాథుడే దానిని గొన వచ్చును. అట్టికార్యములెన్ని యిప్పుడు జరుగుచుండుట లేదు."

"వయస్యా! ఈసంగతు లన్నియును వినిన నా ప్రాణము లెగిరిపోవుచున్నవి. కానియొక్కటిచెప్పుము. నా పరిపాలనమున నల్లరులు కలిగినందుకు కానంగో నన్నే దండించు నేమో ? ఉభయసంస్థానములకునుగూడ నప్పుడు సార్వభౌమికప్రతినిధి నియమింపఁబడవచ్చును"

"కానంగోతీర్పు ఇదివఱకే యయిపోయినది. పని యుండి గడచినవారమాతనిని చూచివచ్చితిని"

ఈమాటలు విని తనమంత్రిచేష్టలు తలంచుకొనునప్పటికి నవకుమారునిగుండె ఝల్లుమనియెను.

"నాకాలమున సాహసికకార్యము లెన్నియో చేసితిని. స్వభావముచేత నేనును భీరుండను గాను. కానియీ వ్యూహము"

"ప్రభువులవ్యూహ మొకటియును. నాది యొకటియునా? ప్రభువువారిని దేవీపురసింహాసనముననఁజూచుటయే నాకోరిక విమ్మటిది వీరనగరమును దేవీపురముతో గలుపుకొనుట"

"కాని నాసహచరికి మఱియొక్కయుద్దేశమున్నది. ఆమెకిట్టితంత్రములు తెలియవు. కాని యామెయూహయును రెండుసంస్థానము లేకీభవింపఁజేయుటయే. యో

చన యాడుదాని యోచనయే గాని అదియును శ్రేయోదాయకముగనే కనుపట్టుచున్నది”

“ఆమె కరుణార్ద్రహృదయ. యోచనయును దాని కనుగుణ్యంబుగ నేయుండును. పురుషుని యుద్దేశములు గొప్పయుద్దేశములు. ఈ రెండింటికిని సంబధం మేయుండదు”

అనునప్పటికి నవకుమారుని మొగమున నాగ్రహవికార మొకటి గ్రమ్మెను. ఈగూఢతాంత్రికునికడ సాంసారికరహస్యములకుఁ గూడ మరుగు లేకపోవుచుండెను. గోకులదాసు ప్రభునిమనసు కనిపెట్టి శాంతహృదయముతో ఈసేవకునియందుఁ దమ కెట్టియాదర మున్నదో యామెకు నట్టియాదరమే యున్నది. ఈతఁడు నలువదిసంవత్సరములనుండి యెంతో భక్తి విశ్వాసములతో నీసంస్థానమును కనిపెట్టుకొని యున్నాడు. ఆమె మాత్రమెఱుగనిదా?

“వీరనగర దేవీపురసంస్థానముల రెండింటి నేకము చేయుటకై యామె వేసిన యెత్తు నీవు వినియున్న యెడల నేమందువో?”

“కేవలనిర్మల హృదయమునకునట్టి యోచనసముచిత మైనదిగనే యుండును. దేవీగారికన్న సాధ్వీతిలకం

బిపుడమిని బుట్టబోదు. కేవలమును నీతియే యిట్లవతరించినది. సీతవలె భర్తతో నరణ్యావాసము సేయ నామె రాజ్యమైనను బరిత్యజించును"

ఈకడపటివాక్యము నందలి యెత్తిపొడుపు నవరు మారునకు ద్యోతకము కాకపోలేదు.

"నాపుత్రికను నరేంద్రునికిచ్చి వివాహముచేయుట రాజ్య మంతయునాతనికి ధారవోసి సన్యాస్యాశ్రమము స్వీకరించుటయు నరణ్యావాసము చేయుటయునా? "

"ప్రభువులకన్న నాకెక్కువగఁ దెలియునా! నేను ప్రభువులచేతిలోని పనిముట్టును. ప్రభువులపూర్వ వంశప్రతిష్ఠ లన్నింటికిని మీరేయాశ్రయులుగాని నేనా"

"గోకులా! నాసతి యోచన స్త్రీయోచనయే యైనను ఆలోచనీయమైన విషయముమాత్ర మగును"

"ప్రభువరా! భావములను గ్రహించుపట్ల స్త్రీలకు మంచిబుద్ధికలదు. నరేంద్రునిహృదయము నమ్మగారు చక్కగఁ గనిపెట్టిరనుటకును సందియము లేదు. కాని యాతని మనసునం దెట్టియాశయము లున్నవో యెట్టియుద్రేకము లున్నవో తెలిసికొన సుకరము గాదు.

సుందరవదనారవిందము నందలి మందహాసము తన్నానో జన్యంబులగుజన్మావధిగల నిశ్చితంబుల వెలార్ప సమర్థమగునా? నరేంద్రుఁడాతండ్రికొడుకు కాఁడా? ఆతని పితామహుని దేహమునందలి పౌరుషశక్తి మాతనియందు మాత్రము లేదా?"

నరేంద్రునకు హేమలత యనిన మిక్కిలి యనురాగ మనిచెప్పుచున్నది. ఆకారణమున నాతఁడు దేవీపురమునకు మనవెంట వచ్చును. దేవీపురసంస్థానమునకుఁ గుమారుఁడైనను అల్లుఁడైననుగూడ నాతఁడే యగును"

వీరనగరవంశము నందలి రాకుమారు లెంద ఱింతకుమున్ను దేవీపురము వారిపిల్లలను పెండ్లాడలేదు వారందఱును వారివారి స్వప్రయోజనములను బరిత్యజించిరా! నరేంద్రునికన్న నత్యుత్కృష్టులగు దేవీపుర ప్రభువులు వీరనగరరాజకుమారికల నెందఱు వరియింపలేదు వారెవ్వరైనఁ దమవంశచారిత్రములను విస్మరించిరా.

"ఔను కాని, వంశైకజనిత మగుపుత్రపుత్రికా సంబంధ మింతకుముం దెన్నఁడు నిట్టులొదవియుండ లేదు. అట్టియనుబంధము చిరకాలమునుండి యోఁడబడియున్న

సంస్థానముల రెండింటిని శాశ్వతముగ నేకీభవింపఁజేయ వలెనని దేవి యభిమతము"

"ఆమెయాశయము లెప్పుడును మహదాశయములు. అట్టివి సానుకూలముగ లభించుగాతమని భగవంతు నెప్పుడును వేఁడుచుందును. కాని మూఁడువందలవత్సరములనుండి యున్నస్పర్థలన్నియు నొక్కదినముతో నంతరించునా రెండు రాజకుటుంబములకు వంశానుక్రమముగ వచ్చుచున్నయసూయ యొక్కయుత్సవ దినముతోడ సమసిపోవునా".

"కాకేమి అట్టినిదర్శనము లింతకుమున్ను జరిగినవి లేవా ?

ప్రభువరా ! మీరుత్తమపురుషులు. మీహృదయమునుబట్టి యోచింపుఁడు. నేను తక్కువస్థితిలోనివాఁడను. నాకంటె నీవిషయములు మరియాదకుటుంబములోని మీవంటివారు బాగుగ యోచింపఁగలరు. మీరు దేవిగారియుపదేశమును శిరసా వహించెదమనిన నే నెదురాడఁగలనా? నావంటివాని కట్లుతగునా ఒక్కటి యోచింపుఁడు. ఆమె యేవంశమునఁ బుట్టినది ? వీరనగరమువారి యాఁడుపడుచు కాదా? ఆమెయాదార్యవం

తురాలు. సతీతిలకంబునగును. అగుఁగాక! మీవంశ గౌరవమును వదలి, పూర్వులప్రతిష్ఠ లన్నియును విస్మ రించి మూఁడువందల వత్సరములనుండి పరిస్పర్ధులుగ నుండి పోరోగిరముగా నుండినట్టివారల ననుసరించెద మనిన నే నేమనఁగలవాఁడను"

"అట్టి దెప్పుడును జరగదు. నాపితృవంశమును సంరక్షించుకొనుటకు సూర్యవంశపరివారము దొరకినంత వఱకట్టిపని యెప్పటికినిపుట్టనేరదు. నాతండ్రిగారిద్వార మును సంరక్షింప నా దేహమున నొక్క రక్తబిందు వున్నం తవఱకును పనిజరుగుచునే యుండును"

"ప్రభువరా! నరేంద్రునకు వయసువచ్చినవెనుక నాతండు పౌరుషలక్షణలక్షితుండు కాఁడనియా మీయా శయము? ఇప్పుడాతఁడవివేకియై మీబాలిక చుట్టుచుట్టు ను గుక్కవలె వెన్నంటితిరుగుచుండవచ్చును ఇప్పటి కాతనితాతగారిపేరు తలపెట్టినను, ఆయనకార్యములు తలపెట్టినను ఆతని కన్నులు తహతహ నందుచుండును. ఆతనిముఖమున రక్తముపూర్ణీభవించును. రాజా! ఆతని కేగదా తోడఁబుట్టుఁడు బహుమాన మొసంగినది? అట్టి బాలుండు తనవంశప్రతిష్ఠ నేమరియుండునా?

దేవిగారి మోహవ్యవహారోపాయంబులవలన మీపైతృకంబగుసంస్థానంబును వీరనగరరాజ్యము చేయిఁగొట్టి చేతికిచ్చినట్లులగును. రాణివీరనగరమువారి యాఁడుపడుచు. దేవీపురసంస్థానము పేరు లేకుండఁబోవుదినములు వచ్చినవి.

అంతఁ బెద్దయుం బ్రొద్దు మౌనముద్రులై యుభయులునూరకుండిరి. నవకుమారుండు యోచనానిమగ్నుం డయ్యెను. కొంతవడికిఁ గన్నులుపైకెత్తి పెద్దనిట్టూర్పు పుచ్చి యిట్లని పలుకందొడంగె.

“గోకులా! నీవుచెప్పినది యుక్తము. ముమ్మాటికిని యుక్తముగనున్నది. నీకృత్యములు రాక్షసకృత్యములే యయ్యెను బుద్ధివిశేషముమిక్కిలి కుశాగ్రమైనది. ఈరెండువంశముల నడుమను రక్తవాహినులుప్రవహించినవి. ఆరక్తస్రవంతినిఁ దరింప నెప్పటికిని దరము గానట్లున్నది. నాభార్యయుపదేశము విన్నప్పటినుండి నాకును సంకోచముగనేయున్నది. ఆమెప్రగల్భయే యగును. కాని జన్మించినది వీరనగరవంశము.

గోకులదాసు, ప్రభుఁడు తనదారిని బట్టినాఁడని గ్రహించెను. సింహములయినను బోధింపఁగా బోధింపఁ

గా మచ్చికపడి తనయధీశుని యిచ్ఛవచ్చినట్లు పనిచేయుచుండును. అట్టివిజయము కలిగినదను సంతోషచిహ్నము మొగమునఁ గనుపడకుండఁ జేసికొని అతివినయంబుగ నిట్లని చెప్పందొడంగెను.

"ఈవిషయపరిజ్ఞానంబునందు నాయాధిక్యమేమున్నది? నేను ప్రభువులయొద్ద వివేకవిషయముల నేర్చికొంటిని. వారియుద్దేశములనే మరల నేకరువు పెట్టుచుంటిని. దేవీపురము దేవీపురపురాజులకుఁ దక్కమఱియన్యులకుఁ బోరాదు. వీరనగరము వారిపేరు తలఁపనేరాదు. గొప్ప వంశములందు వారసుండుగా తనయుండొదవఁడేని యెవ్వనినైన దత్తతచేసికొందురు. మనపూర్వస్మృతులనుబట్టి యాతఁడు వారిశ్రాద్ధాదిక్రియల నెఱవేర్చి మనధర్మశాస్త్రానుగుణ్యంబుగ సంస్థానంబునకు కర్తయగును. తగినవాని నొక్కని కొమరునిగా నంగీకరింపుఁడు. మీయనంతరము దేవీపురమున కాతఁడుకర్తయగును. దేవిగారి కేకపుత్రికయగు హేమలత సంస్థానమున కంతకును అధికారిణి కావలెనని పట్టుపట్టినచో ఉత్తమవంశసంజాతుండగు నొక దేవీపురరాజకుమారుని చూచి యాతనికి హేమలతను పరిణయంబు గావింపుఁడు. దేవీపురప్రతిష్ఠ నిలుచును. దేవీపురము సురక్షితముగ నుండును"

"గోకులా! బాగుగానున్నది. ఎంత చెప్పినను విన మనసగుచున్నయది. నీవు చెప్పినదంతయును మిక్కిలి వివేకముగానున్నది. కాని, నీవు చెప్పినట్లు కుజ్జవాని నెవ్వనినైన నన్వేషింపవలెనన్నచో, ఎచ్చటికో పోయి కనుఁగొనవలయును.

"మనమట్టివానికొఱకై యెంతో దూరము పోవనక్కఱలేదు. వెదకిన యెడల మనకుటుంబజనములోపల నేయెవ్వరో యొకరుందురు. శిరీషుఁడు జననీజనక విరహితుఁడు. ఆతఁడును ఆతనివితంతుసోదరియును మొన్న మొన్ననే వచ్చి మనయింట చేరియున్నవారు. వారు మీావంశమునకుఁ జేరినవారే. ఆతఁడు స్థితిగతులలో తక్కువగనే యుండినను కులగౌరవమున హేమలతకుఁ దీసిపోవువాఁడు కాడు. ఆటపాటలలో శిరీషుని నేను కని పెట్టి చూచినాను. ఎంతబుద్ధిమంతుఁ డనుకొన్నారు? ఆతని పూర్వుల పాణిగల్భ్యమంతయు నాతని హృదయము నందున్నది. శాంత మూాతనికడ మూర్తిభవించి యాతనికన్నులఁ గనిపించుచుండును. నరేంద్రుఁడును హేమలతయును చిన్ననాఁటనుండియును. ఆడుచుపాడుచునే యున్నను హేమలత కాంతర్యమున నీతండనిన పక్షము"

“వయస్యా! శిరీషుని నేనుకనుగొంటిని. అతని శాంతమును అతని పట్టుదలయును అతనినిశ్చలభావమును, ఆతనిశరీరదార్ఢ్యమును బ్రశంసనీయములు. ఈనడుమ నొకనాఁడు నరేంద్రునకును, ఆతనికిఁ గలహ మొదవినది. నరేంద్రునిశిరీషుఁడు రెండుచేతులతోడ నెత్తియును కమీఁదకు గిరగిర డ్రిప్పివిసరివైచినాఁడు. ఇదియంతయును హేమలతయే చెప్పినది”

“ అట్లైన నాతఁడు మాతనయను బరిగ్రహించి దేవీపురమునకుఁ బ్రభువైన యెడలఁ దప్పక వీరనగరనాయకునకుఁ బ్రతిస్పర్థియైయుండును. నరేంద్రునితాత మనకొనరించినయపకృతు లన్నిఁటికిని తగినప్రతీకారమాతఁ డొనరించును”

“గోకులదాసా! ఇదికొంచెము నిదానముమీఁద యోచింపవలసిన విషయము. ఇప్పుడు నేను దేశంబునకు వశ్యుండనై యున్నవాఁడను శాంతముగ యోచించి, చేయవలసినపను లన్నియు చేయుచుండుము. పౌరుషకార్యంబు లీనవకుమారునితలలో నెన్నియో యున్నవి. దేవీపురము వీరనగరవంశీకునికిమాత్ర మెన్నండును బో

వనేరదు. ఇంతవట్టు నిశ్చయము" అని చెప్పి నవకుమా రుం డరిగెను.

గోకులదాసుగదిలో దీప మింకను మినుకు మినుకుమనుచునే యున్నది. అరుణోదయ మయినది. ఉదయభానుని కాంతులు మూసియున్న తలుపులసందుసందిలోనఁ బ్రసరించుచుండెను. ఇఁక నావృద్ధుండు యోచనానిముగ్నుండై యచ్చటనే యధివసించియుండి తనలో తానిట్లువితర్కించు కొనుచుండెను.

"పునాది చక్కఁగఁబడినది. నాయీహాస్తము తన యుపాయముల నేమరకుండెనేని తక్కిన కార్యము గూడచక్కఁగనే సాగఁగలదు. నవకుమారుని భార్యమాత్రమొక్కటి గడ్డుగానున్నది. ఆమెనీవిషయమున వగదానివలె నెంచుకొనవలసి యుండెను. సద్గుణసంపదయందామె కెంతయాధిక్య మున్నదో తిరస్కారభావమునందుకూడ నామె కంతప్రాగల్భ్య మున్నది. నవకుమారుఁడు తీవ్రస్వభావుఁడు. భార్యమాట కెదురాడఁడు. ఆమె యాఁడుది. పిల్లలయనురాగమును చూచి సంతోషించు చుండును. కాని యుత్తమమగు వంశ

ప్రతిష్ఠను గూర్చి యోచింపఁజాలదు. ఆడినమాటతిరుగకుం డునేని, వంశగౌరవమును నిలుపుకొనఁ దలంచునేని నవ కుమారునకు పురుషున కుండవలసిన లక్షణము లన్ని యు నున్నవి. నేఁటిరాత్రి భార్యనెదిరింపఁ గలమనోభా వమునుగూడ తెలకెక్కించితిని. ఈవీర నగరమున నింక గొన్నిచిత్రములు జరుగఁగలవు. నాకవియన్నియును జూ డ నిష్టములేకున్నది. ఆమె కన్నులనీరు పెట్టుకొనినచో జడిసి నవకుమారుఁడు మరల నాయొద్దకుఁ బరుగెత్తుకొ ని వచ్చును. నవకుమారా! వంశప్రతిష్ఠ నీవుమరచినను దానిని మఱవకుండ నుండువాఁ డొకఁడున్నాడు. గోకు లదాను తనకర్తవ్యము నేమఱియుండువాఁడు కాఁడు. పట్టి నపట్టును సామాన్యముగ విడుచువాఁడును కాఁడు"

---

## అయిదవపరికరణము.

:o:

### వసంతోత్సవము.

ఉత్తరహిందూస్థానమున వసంతోత్సవ మత్యంత వైభవములతో జరుఁగును. ఇదియే హోళీపండుగ.

హేమంత వాసరమునందలి శీతలదినములుగ్గడచిపోవును. గోధుమలు యవలు వరిపైరులు ముక్కా అనఁబడియుం డును. కొన్నియెడల నాసస్యములు కోఁతలయి కుప్పలు క్రిందఁ బడియుండును. అప్పటికప్పుడే కాయధాన్యములు ను, చముదినుసులును మహాస్సాలగును. సేద్యగాం డ్రందఱును తమతమమక్తాలను భూస్వాములకిచ్చివేసి తమయంబారముల గాదెఁబోయుదురు. ఆఁడువాండ్రం దఱును క్రొత్తచీరలను క్రొత్తనగలును ధరియింతురు. ఇల్లిల్లుదిరుగు మూటలవర్తకులు తమమూటలను విప్పిన తోడనే జానపదులగు యువతులత్యుత్సాహముతోఁ జూచుచుందురు. సొమ్ము సర్దుబాటులేకుండెనేని, క్రొత్త ధాన్యములను వారుతట్టలతో త్రవ్వియిచ్చి దంతపుగాజు లను క్రొత్తక్రొత్త రకములచీరెలను గొనుచుందురు. మామిడిచెట్లు తమతొల్లింటి పండుటాకుల నూడ్చి చిగురు టాకులచే నలరుచు, మొగ్గదొడిగి దేశమంతటఁ దమప రిమళముల వెదజల్లుచుండును. ఏకెలంకునఁ జూచినను ఏమూలనుండియో కోకిల పరమానందంబుగ తనమ్ర దుమధురనినాదముల నుత్సవసమయాగమనంబు చాటు చుండును.

నిశ్చయముగ నీవసంతోత్సవము మన్మథసమారాధన కేర్పడినది. అయ్యది పూర్వము మోహాధిదైవతంబగు దర్పకుని పూజలకొఱకు నియంత్రితంబయినది. కాని గడచిన వేయి సంవత్సరములనుండియు నీయుత్సవమున కధిదేవత శ్రీకృష్ణుఁడు. ఏకథవిన్నను, ఏపాటనాలకించినను, ఆతనిగూర్చియే వినంబడును. పట్టణములయందును, పల్లెటిదిక్కుననుగూడ స్త్రీపురుషులందఱును నిరంతరము నాతనిఁగూర్చియే గానముసేయుచుందురు. ఆదినంబుల నాబాలవృద్ధముగ జనులందఱును బనిపాటలెల్ల గట్టిపెట్టి యుత్సవంబుల నోలలాడుచుందురు. కడపటిదిన మాయుత్సవమునకు పట్టురోజు. ఆదినమున నేమూలచూచిన నాటపాటలల్లకల్లోలముగ నుండును. రాత్రియంతయు నిద్రయే యుండదు. పొద్దుపొడిచినవెనుక వేడుకకాండ్రందఱును తమతమనిత్యకృత్యములం దీర్చుకొని యుద్రేకవిరహితులైన తక్కినజనంబులతో మరల కలిసిమెలసి పనిపాటలు చేసుకొనుచుందురు.

ఈయుత్సవము ఒక్కొక్కచోట నొక్కొక్కమాదిరిని జరుగుచుండును. అంతటనుసర్వసామాన్యముగ జరుగునది కోటలనక పేటలనక వాడవాడలదిరిగి బుక్కాబుగ్గం

డీలు చల్లులాట. ఇది పెద్దయల్లరిసమయము. ఇందలియల్ల రిచేష్టలబారి బడనివారుండుట యరుదు. వీధులవెంటది రుగు కొంటెపిల్లకాయలు ముగ్గుబుట్టలవలె తలనెరసిన ముదుసలి పరిధానులపైతము బట్టుకొని వారితలపాగాల నిండ నీబుక్కాబగ్గుండీల ముంచెత్తుదురు. పుణ్యస్థలంబు లగు నాలయంబులలోని యాచార్యులనుబట్టి బజారుల వెంటఁ దిరుగు కొంటెపడుచులు వారిపట్టువస్త్రముల పై వసంతములతోఁ జిలుకు వేయుచుందురు.

ఉచితలజ్జావతులగు యువతు లీబుక్కాబగ్గుండీల చల్లులాటలకు వెరచి యొదిగియొదిగి యుందురు. కొం టెపదములు తమచెవిఁ బడకుండ తప్పించుకొని తిరుగు దురు. వీనికన్నిఁటి కేమిగాని వీరు గొప్పవారు, వీరు కొలఁదివారను విచక్షణ లేకుండ నందఱును గలిసి తిరు గుట యీయుత్సవము నందలిసుగుణము. ఎంతకాల ముండిన నేమిగాని వారలందఱును మిక్కిలి చనువుతో డ సంచరించుచుందురు. అనుశృతముగ వచ్చుచు చి న్నతనపు చేష్టలతో నొప్పనీయుత్సవముల నీయాట పాటలను జూచిన, తాత్త్వికులకందఱకు నవ్వులాటగ నుండును. కేవలధనార్జనయే సర్వాతిరిక్తపరివృత్తియై,

దర్వ్యాడంబరమే దానియందలి మహదానందమై యొ
ప్పు నీదినంబులందలి యాసంతోష మొక్కింతయేని ని
లిచియుండిన, నెంతచక్కగ నుండునో?

ఈవసంతోత్సవము కడపటిదినమున నవకుమా
రుఁడు తనమందిరమునుండి వెలువడి, మనస్సునుండి స
మస్తయోచనలు నొక్కింతసేపు తొలగంద్రోసి మొగ
మున దయారసంబు ప్రవహింపుచుండ, ఉత్సవాలోక
నాసముత్సుకుండై వాహ్యాళి వెడలెను. వయసుచే నం
గి నిరంతర యోచనలచేఁ గృశిగియున్న గోకులదాసు
కూడ నాతని వెంబడి యీయుత్సవమునందలి సంతోష
మొక్కింత యనుభవింపవచ్చెను.

సంస్థానమునకెల్ల నాస్థానంబయిన వీరనగరంబు
న దూరదూరములనుండి జనులెందఱో తండోప తండ
ములుగ వచ్చి పోవుచుండిరి. నవకుమారుఁడును తన్మం
త్రియగు గోకులుండును జనసమ్మర్దముగనున్న వీధుల
నుండియును బయళ్లనుండియును సందుచేసుకొని పోవు
చుండిరి. వందలకొలఁది జనులాతనిపేరుజెప్పి యాశీర్వ
చనరూపకంబుగ కేకలువేయుచుండిరి. ఆఁడువాండ్రు
తనిగూర్చి ద్వంద్వార్థముగనున్న పాటలను బాడఁజొ

చ్చిరి. పిల్లలు కేరింతలాడుచు నాతనిపై ఛఖశిఖపర్యం తము బుక్కాబగ్గుండీలను జల్లికొల్లలాడిరి.

సంతపేట దాటి నవకుమారుఁడొక సందులోనికిమ రలెను. ఆసందుయోగ్యులగుపురుషులుపోఁదగినదికాదు. ప్రభువుగారి మొగము జూచుసరి కాసందంతయును బా టలచే గింగురుమనిపోయెను. అందుచాలమంది స్త్రీలు కొందఱులజవ్వనంబున నివ్వటిల్లుచుండిరి. కొందఱప్పు డప్పుడే యౌవనమంకురించి మెఱయుచుండిరి. వారం దఱును ముద్దినును చీరలనుగట్టి సందున కడ్డముగ నిలిచి వచ్చుపోవువారలనెల్ల నడ్డగించుచుండిరి. ఎవ్వరును వా రినెదిరించి పోవ సమర్థులుకారు. వారి యాకారములం జూచిన వినుఁగు విరామము లేకుండ నస్త్రమానమును పనిచేసియున్నట్లు కనుపట్టుచుండెను. తలలు విరియఁబా రి నీరోడుచుండెను. చీరలన్నియు బగ్గుండిపొడి పడి ర క్తవర్ణమును చిందుచుండెను. పాదములు వసంతమున మునిఁగితేలుచున్నవి. బంగరుచాయ నొప్పువారి మొగ ము లొక్కించుక బిగిసడలి యుండెను. విటకాండ్రు స మావేశంబుచే నుద్రేకించి తడినొంటెనంటుకొనిన జిలు

గువలువల ఘూటునసుండి బయలువడుచు హృదయచాం
చల్యము ప్రమాణాధికముగ నున్నట్లు గన్పట్టెను.

నవకుమారుఁ డెట్లులో త్వరత్వరగ దాఁటిపోయె
ను. అతనివెనువెంట వచ్చుచున్న గోకులదాసుమాత్రి
ముచిక్కుపడఁ బడినాఁడు. అతని గని కరుణించువా రెవ్వ
రును లేకపోయిరి. జీర్ణవయస్కుఁడగు నితఁడు కంటఁబ
డినతోడనే వసంతపుజల్లొకటి వచ్చి యాతని ముంచెత్తె
ను. అతఁడును వెనుకకుఁబోవలెనని చూచెను కాని కాలు
జారి బోరగిలఁబడియెను. అందఱును పకపకనవ్వి చప్ప
ట్లుచఱచిరి. పడియున్న యాతనిపై మఱియొకజడి కురి
సెను కొంతవడి యాతఁడు లేవలేక నేలమీఁద నీదు
లాడుచుండెను అక్కడనున్న వా రందఱును సంతో
షమును బట్టజాలక పొట్టలువిచ్చునట్లు నవ్వుచుండిరి. వరి
వారజనము వచ్చి వయోవృద్ధగు నామంత్రివతంసుని లే
వఁదీసిరి. అంతక్రమున్నానందున బంతిగట్టి యతిఘోర
ముగఁగాచియున్న యువయువతీసముదాయ మంతయు
నుపరుగుపరుగున సందువిడిచియిల్లుదూరిరి. నవ్వులును
కేరింతలును ఆకాశము చిల్లులువోవునట్లు వినఁబడుచుం
డెను. అంత వాఱందరును గలసి వచ్చి గానుందు కృష్ణ
లీల యొకటి పాడఁజొచ్చిరి.

యదుకులకాంభోజిరాగము

అట — తాళము.

ఈగోకులవాసు, ఈనవమోహను
ఈవగకానిని ఈక్షించినారే (పల్లవి)
ఎమ్మెలు సేయుచు, నితఁడొకనాఁడుద,
యమ్మునఁ జేసిన, యాగడమ్ములువినరే. (అనుపల్లవి)
ఆలమందలలోన, పాలుబిదుకుచుండ
మేలమాడుచువచ్చెనే,
మేలివలపుపేరిత్తుణాఘుఁదులకింప,
చాలవగలుసేసెనేసరసములాడెనే. ఈగోకుల.
గుమ్మపాలుముద్దు, గుమ్మలారమధు
రమ్ముగావేయనెనే!
కమ్మనిమీవద, నమ్ములంతకుమధు
రమ్ములుజుమ్మీయనెనె.
అమ్మకచెల్లమో, హమ్ముచాలఁగఁగను
దమ్ములపొంగెననెనే!
కొమ్మలార! శిరో, జమ్ములునీలాలు
గ్రుమ్మరించుననెనే.
సమ్మదమునకటా, తమ్మసేయుచుస్వాగ

త మ్యోషంగుమనెనే! తమినిండెననెనే ఈగోకుల.
కులుకుచు మేమిాగో, కులనాథుని జేరి
కొసరిమాటాడితి మే!
వెలలేని యోగ్యత, తులకించువారము.
విలుతుమిాపాలుసం, తలనంటి మే.
వలపుసమీరచంచలమౌద్రిమ్మరికమ్మ
వశముగాదటంటి మే,
వెలలేనియనురాగ మిలనిండిమిన్నంది.
వెలయింపవలదంటిమే
వలదు వలదు గోకులజనుమింటికి
వెళుకుజూపులగట్టి, పెట్టిపదమంటిమే. ఈగోకుల.

కడపటిచరణము వికలితచిత్తుఁడై యుండిన నవకుమారునిప్రధానునకు నమస్కారబాణము. అయ్యది యాశుగతిని నన్యాపదేశముగా పాటలోఁగలిపి పాడిరి. దాని నాలకించుటతోడనే నవకుమారుఁడుకూడ నానవ్వులలో నేకీభవించెను. అతిసాహసికురాండ్రగు నాకులటలప్రౌఢతకు మెచ్చి ప్రభువసుండు వారలకు కొన్నిబహుమానము లొసంగెను.

ఆసందునుండి మరలి నవకుమారుఁడును తదను చరపరివారమును మఱియొక బజారున కరిగిరి. అయ్యది పెద్దమనుష్యులు వసించు తావు. ఈబజారున పశ్చిమోత్త రదేశముననుండి క్రొత్తగా వచ్చినవర్తకులుండిరి. ఆకారణమున దానిని క్రొత్తబజారందురు. రాజపుత్రస్థాననివాసులును ఉత్తరహిందూస్థానవాస్తవ్యులును నేఁటికిని మన దేశమున, మూలధనవ్యవహారమునను వాణిజ్యావృత్తియందునుఁ బ్రఖ్యాతులై యుండిరి. వారిఖజానాలెప్పుడును టంకసాలలవలె మ్రోగుచుండును. దేశమునగల పెద్దపెద్ద పట్టణములన్నిఁటియందునను వారిచిల్లరకొట్లు లుండి యున్నవి. దేశమునం దెచ్చటను వారిహుండీలు చలామణీలు కానిప్రదేశములు లేవు రాజాధిరాజులుకూడ నొకొక్కయెడకుసమయము తటస్థమై యుద్ధములు వచ్చి నపుడు వారిసహాయము కోరనివారును, వారివల్ల సాహాయ్యము పొందనివారును లేరు మహదైశ్వర్యవంతులగు నీ సావుకార్ల కడనుండి ద్రవ్యము నప్పుగొనకుండ తమ పనుల సాగించుకొనువారత్యల్పముగ నున్నారు. వీరనగరము చిన్నపట్టణమేయైనను యిచ్చట గూడనట్టి సావుకారులు కొట్లుపెట్టించిరి. బంగాళదేశమునకు మానసింహు

డుఁను తోడర్‌మల్లుఁడును రాష్ట్రాధిపత్యమునకు వచ్చు టతోడనే వారితోడ కొందఱు ధనికులు వచ్చిచేరిరి.

వారందఱును నవకుమారునిఁగని సాదరపూర్వ కంబుగా వినయవిధులాచరించి వెండిపళ్లెరములనిండ బ గ్గుండిపోసి తెచ్చి కానుకలుగ నొసంగిరి. పూర్వాచారా నుసారముగ నవకుమారుఁడా పళ్లెరముల నున్నరక్తచూ ర్ణము నలంకారార్థముగ నొక్కింత చేతముట్టి యందొకటి రెండు సువర్ణనిష్కముల జారవిడుచుచు పోయెను. నవ కుమారుని జమీాలవంటి. జమీాల నెన్నిఁటినేని లెక్కలే కుండ గొనఁగలిగిన యాధనవంతులు దాతయొక్క స్థితి గతుల నాలోచించి గౌరవసూచకంబుగ నీయల్పోపా యనంబుల నంగీకరించుచువచ్చిరి. కాని వీథులవెంట చిన్నభూతములు కొన్నియున్నవి. వారుమాత్రమెవ్వరిని లక్ష్యముసేయకుండిరి. వారీధనపతులకుమాళ్ళు. వారిలో కొందఱు గుప్పిడనింట కుంకుమపట్లు పట్టియుండిరి. కొం దఱు చిన్నచిన్నకాగితపుబుట్టలుకట్టి వానినిండ కుంకుమ పొడినించి చేతబట్టుకొని తిరుగుచుండిరి. పెద్దవాండ్రు మొగమెంత యెఱ్ఱచేసినను వీరుమాత్రము తమకొంటె తనమును మానక యీరాజపరివారముపై నాబుక్కాను

జల్లుటకు వెనుదీయకుండిరి. పైపెచ్చు కేకలు వేయుచు కేరింతలాడుచుండిరి. నవకుమారునకుఁగూడ నీమర్యాద కొంతవరకు జరిగినది. ఆతనితలపాగపై రెండుబంతులు వచ్చిపడియెను. ఆతఁడు దానికి చికాకుపడక నడచుచు నడచుచు జలంబులదప్పించుకొని మొగము తుడుచుకొని పోవుచుండెను.

అక్కడనుండి యొకింతదూరము చనునప్పటికి ధనపతుల రాణివాసజనము వీధులవెంట తారసిల్లిరి. వారు దయమున లేచి గంగాస్నానముచేసి వచ్చుచుండిరి. వారందఱు లజ్జావతులగు యువతులు ఉచితమర్యాదల నించుకంతయిన జవదాటువారు కారు. అట్టులయ్యు నిట్టియుత్సవసమయంబులఁ గొంతనఱకాహద్దు నతిక్రమించి సంచరించుట యాచారముగ నుండెను. నవకుమారుఁడును తత్పరివారమును సమీపమునకు రావేగమే తమమాతృభాషతో నీక్రింది పద్యములలోని యర్థమిచ్చు కృష్ణలీల యొకటి పాడఁజొచ్చిరి.

చ. మనలనువీడి ద్వారకకు
మాన్యుఁడుకృష్ణుడు పోవువాడె? యె

వ్వానిఁగన్ని పాపిఁణమింక నిలు
    వంగలమమ్మ! వృధాభరమ్ము జీ
వనము గదమ్మ! గోపికలు
    వందురుచుండుట వింతటమ్మ! కృ
ష్ణునిఁ గనరాని యీమధుర
    శోభఁ గనన్వలెనమ్మ? యీపయిన్.

ఉ. ద్వారక కేగువాడఁట య
    తండు ప్రభాతమునందు లేచి; గో
వారము మేఁతలన్ గనఁగ
    వచ్చునె? రేపటినుండి; వేణుశృం
గారకలస్వనంబు తమ
    కర్ణములన్ దనియింపకుండినన్
గోరునె కృష్ణగానమును
    గోరినచిత్తము లన్యవృత్తముల్.

మ. యమునాతీరమున న్వసించి కను విం
    దై యొప్పునుద్యాన దే
శములన్ క్రీడయొనర్చి ద్వారకకు స్వే
    చ్ఛంబోవువాఁడట్టె; యీ

యమలుండిచ్చటువారు గోపికలు బృం
దారణ్య మందుండి పాి
ణముల నిల్పగ నెట్లు నేర్తురోకో? యా
నందక్రియాశూన్యలై.

క. వలపోయును వసుదేవుఁడు;
వలపోయు యశోద; సకల ♦ పౌరజనంబుల్
వలపోయువారు; రాధిక
వలపోయు; నికేటిమధుర ♦ బ్రదుకు లిఁకేలా?

చ. ఉదరము మల్లెపూవుగతి
నొప్పెడు; తామరపూవుసంపదన్
బొదలెడు మోము; నెన్నడల
పొంకము గేలియొనర్చు నంచలన్
మృదువయి పట్టుకుచ్చువలె
మేనునిగన్నిగలన్ జెలంగు న
మ్మదవతి రాధ; కట్టియన
మానశుభాంగి వియోగమోర్చునె?

ఖిన్నకంఠలై యాకలకంఠకంఠు లందఱు నైక
కంఠ్యముగఁ బాడినయాపాట నవకుమారుని హృదయము
నకు జాలిగొలుపుచుండెను. అది యాలకించుచు నదు

మనదుమ నిల్చుచుచుండెను. కుటిలశీలంబగు దరహాసం బున గోకులదాసు రహస్యముగ నవకుమారునితో ప్రభువరా! రమ్ము. రమ్ము. మనము పోయిన వెనుక రేపు వీరు నరేంద్రునకుఁగూడనీపాటయే పాడుదురు. అనిచెప్పెను!

నవకుమారుడు " నీవు కేవలకఠినహృదయుఁడవు. గోకులదాసా! మనక్షేమమును మాటలాడువారింగూర్చి యిట్టిదుర్భాష లాడరాదు. నాహృదయము నీవలెయినుము కాదు. నిష్కపటవృత్తితో వారుమనయెడ కరుణారసము జిలుకుచుండ నాహృదయముకరుగకమానదు. అయ్యది యొక్క నిమిషమైనను ంగానిమ్ము."

" ప్రభువరా! తళతళలాడునదెల్ల బంగారము గానేరదు. వీరనగరమును నరేంద్రునితాత పాలించిన నాఁడు జరిగినయుత్సవము కన్నులార గాంచినవారలింక ననేకులు సజీవులై యున్నవారు. వారును మనకన్నుల కగపడుదురు. పోవుదమురమ్ము." అనిచెప్పి అచ్చటనుంచి తరలించుకొని పోయెను.

పూర్వమున బంగాళాదేశమున నూలువస్త్రము లు నేయుటయు పట్టుబట్టలు తయారుచేయుటయును ము

ఖ్యములయిన పనిపాటలుగా నుండియుండెను. పాశ్చాత్త్యులందఱు నపుడు హిందూదేశములోని వస్త్రముల వ్యాపారము చేయుటకై పోటీగ పనిచేసిరి. పోర్చుగీసులు ఆల్బుకర్కును నాయకునిగా నేర్పఱచుకొని తూర్పు సముద్రతీరమున సామ్రాజ్యమొకటి స్థాపించిరి. ఆఫ్రికా ఖండదక్షిణభాగమునుండి చీనాదేశపుతూర్పుసరిహద్దువఱకును వేలకొలది మైళ్ళమూల చూచినను వారికే వుస్థలములతోడనే నిండియుండెను. బంగాళదేశమున వేనవేలు స్థిరవసతుల నేర్పఱచుకొనిరి. వంగదేశయువతులు చాలమందిని వారిభార్యలనుగా స్వీకరించిరి హిందూదేశములోని యూరేషియనులలోఁ జాలమందివీరి సంతతివారే. ఈతరుణముననే ఒలందులుస్వాతంత్ర్యమునకై పోరాడుచు తమయోడలనుగూడ తూర్పుతీరమునకు నడుపఁజొచ్చిరి. ఎలిజబెత్తురాణికాలమున బ్రిటిషు వారికి యీ విశేషలాభములను గాంచుటతోడనే కన్నెఱ్ఱ యయ్యెను. అప్పుడు వారుగూడనిందుపాలుగొనవలయునని ప్రయత్నము చేసిరి. బంగాళాదేశమునందలి స్త్రీపురుషులు కోటానుకోట్లు బట్టలు నేయుటయందును నూలువడకుటయందును గృషి చేసి బ్రతుచుండెడివారు.

అందువలన వారికి విశేషలాభములు వచ్చుచుండెడివి. అచ్చటమగ్గములమీఁద తయారైనవస్త్రములు విరివిగా ఉత్తరహిందూస్థానమునకును ఐరోపాఖండమునకును ఎగుమతి యగుచువచ్చెను.

మాల్డామండలమున తయారైనంతటి నాణెమైనపట్టువస్త్రములు బంగాళాదేశమున మఱియెక్కడను గానరావు వీరనగర మీమండలమునఁ జేరినదే. నాటునుండెడి నేతకాండ్రందఱును పట్టుపురుగులను బెంచుచుండిరి. తమతమగుడిసెలలో జిలుగువలువలఁ దయారుచేసియానెల్లాలన్నియు పేటకుఁ గొనివచ్చి వర్తకుల కమ్ముచుండిరి. వీరనగరమున నీవర్తకు లందఱు నొక్కచోటనే గాపురముండిరి. అదియు నొకయిరుకుసందు ఈపేటకు నెల్లాపేట యనిపేరు. పట్టుబజారనికూడ నందురు. నవకుమారుఁడును, తత్పరివారమును, యీయిరుకుసందు వెంటవిహరింపసాగిరి. ఆసందున కిరుప్రక్కలను రెండు మూఁడంతస్తులమేడలు బారులుతీర్చి కట్టియున్నవి. నవకుమారు నావర్తకు లందఱురును, అతివినయముగఁ బలుకరించి కుంకుమ చూర్ణము నాతని తలపాగపై చిలికిరి. నగిషీపనిచేసిన యుత్తరుదానును పన్నిరుబుడ్లును ఏల

కులు, లవంగములు మున్నగు పరిమళద్రవ్యములును తము లపుటాకులును వెండిపళ్ళెరంబుల నిడికొని యాతనియెదుటకుఁ గొనితెచ్చిరి. నవకుమారుఁ డొక్కొక తములపుటాకు మడుపునుఁ గైకొని సుగంధద్రవ్యముల స్పృశించి తత్పరిత్యామ్నాయముగ నాయా పళ్లెరంబుల సువర్ణఖండంబొక్కొకటి జారవిడిచి పోవుచుండెను.

ఇత్తడి దుకాణదారు లగుకంచరులు కమ్మరులు వడ్రంగులు కంసలులు, అలంకారవిక్రితలు మున్నగు వేరువేరుపనివాండ్రందఱును పట్టణము చిన్నదైనను పీరనగరమున పనిపాటలు కలిగి మెలఁగుచుండిరి. వారివారి దుకాణముల యోరనుండి రాజప్రతినిధి జనుచుండుట గనిపెట్టి వారుబరాబరులు సేయఁజొచ్చిరి. మహమ్మదీయవర్తకులుగూడ కొందఱాపురమున వర్తకము సేయుచుండిరి. వారందఱును వారివారిమసీదులముంగల నిలువఁబడి నవకుమారుని సంబోధించి ఉత్సవము హిందువుల యుత్సవమైనను గౌరవసూచకముగ వలిపెంపుపట్టుదుకూలం బొకటి వెండిపళ్లెరమునందిడి కానుకగ నొసంగిరి. నవకుమారుఁడు ప్రీతిపూర్వకముగ దానినందుకొని వారి కందఱకు ముఖ్యనాయకుండగు ముల్లాచేతిలో నొకఖం

గరునాశము నునిచిపోయెను. దేశమున ప్రతిపట్టణమందును హిందువులును, మహమ్మదీయులును, సోదరభావంబునఁ గలసిమెలసి మెలంగుచుండిరి. మహాపురుషుండగునక్బరు వారియుభయులకు నైకమత్యమును వృద్ధిపొందింప నెంచెను. మానసింహుఁడా వీరనగరమునముసల్మానులకు మసీదు గట్టుకొనస్థలమొకటి యుచితముగ నొసంగెను.

నవకుమారుఁడును, ఆతనిపరివారమును, ఇంటికి మఱలుసరికి అపరాహ్ణము తిరిగిపోయినది. జమీందారీ హవేలీ సింహద్వారమున కనతిదూరంబున నొడలెల్లను రక్తచూర్ణసంసిక్తమై యులరచిన్నపిల్లలిరువురు చెట్టుక్రింద నాడుచు పాడుచు పద్యములను బఠించుచుండిరి. వారి పాట మార్ధ్వీకించుకయును లేక, ఒకతేమాదిరిని వీనులకు వెగటుగల్గించుచున్నను, వారికంఠస్వరమునుండి వినవచ్చునదెద్దియో యొకటి నవకుమారునికర్ణముల నాకర్షించెను. పట్టణమునంతయుసుదిరిగి యలసియుండియును ఆతఁడిది యాలకించుచు నొక్కింతనిలువఁబడి వినుచుండెను.

ఉ. కంటిరె లోకకంటకుఁడు
కంసుఁడు రాజ్యము సేయుచండఁ మ

న్నింటనుగోపమే, యొడలి
నిండపరితాపమె ; మందుచుందు ము
క్కంటివ లెక్; బరిధానమధి
కారబలంబు ; బలాఢ్యులందఱన్
బంటుతనంబుచేఁజరచుఁ ;
బారెదరల్పులుతామెభీతులై.
ఉ. పుట్టినవాఁడొకండితని
పుట్టిముముంగఁగఁ జేయ; రాజులే
పట్టునలోకకంటకులు
పాలనఁ జేసిరి చాలనాళ్లు? వీఁ
డట్టులె యుట్టిగట్టుకొని
యల్లలనాడునె? పుట్టుపాపయీ
కట్టడితుల్లడంచెడు ; న
కంటకమయ్యెడు లోకమంతయున్.
చ. ఇతనికిఁగూఁడవిన్బడిన
దియ్యది ; శాంతియొకింత లేదు ; దు
ర్మతియయి సాధులన్ నిరప
రాధులఁజంపగఁ బంచెబాలురన్;
హతులగు చున్నవారుచను
లంటిమెలంగెడు పుట్టుపాపః లీ

గతిమ్రుతిఁ జెందుబిడ్డల య
కాలపుఁ జేద్పులు బర్వెదిక్కులన్.

ఉ. పుట్టినయానిసుంగునిశి
బోవుమ హెవ్వరిఁ బుంగకుండఁ దా
నట్టిటు పాయువిచ్చ్యయము
నాంబువు లేపుగఁ బొంగియుండియున్;
గట్టిడిపన్న గంబొకఁడు
గాచుఫణంబునొ సంగిఁ చీఁకటుల్
గుట్టెడలంగనీకతని
గూటికిఁ జేర్చుఁ బోలంబుతో ప్రవలన్.

చే. చేరఁగవచ్చు శౌరి యవి
జేయుఁడులోకుల రక్షసేయఁ సం
హారముసేయు దుర్మతుల
నందఱ త్రుళ్లడఁగించి; విక్రమో
ద్ధారకుఁడాతఁ; డిప్పుడన
దల్భయమేదగవచ్చు; వానికె
వ్వారును లెక్కగారు; పరి
పంథినిగూల్చుఁ; దొలంచుదుర్గతుల్.

మహలులో పండ్రెండుగంటలు కొట్టినది. దూర దూరములనుండి వచ్చుచున్న ప్రజలందఱును పట్టణమున

కువచ్చి మూగుచుండిరి. నవకుమారుఁడు మాత్రమొ క్కించుక సేపేదియో యోజించుచు నిలువఁబడి గోకుల దాసునకిట్లనియెను. "గోకులా! ఈపాటకర్థమేమియో బోధపడకున్నది."

"బోధపడుట కేమున్నది? వీరనగరమునందలి పరివా రజనమందఱును తమపూర్వపరిపాలకులయందలి విశ్వా సమింకను మఱువలేనట్లు సూచించుచున్నది. అయ్యది ప్రభువువారి కాగ్రహకారణము కారాదు. ఈపదిసంవ త్సరములనుండియును, వారు మనలంగూర్చి ద్రోహచిం తనిలుపని నిముష మేదియున్నది? గోకులదాసుకనుగలిగి మెలంగుచుండుటం బట్టి ప్రభువువారు సురక్షితముగ నున్నవారు."

" కాని యీకుఱ్ఱవాఁడెవఁడో తెలిసికొనవలయు ను. రాజమందిరద్వారము ముంగిట నన్నిట్లు నిరసింపఁ బంచినవా రెవ్వరో యెఱుంగఁగోరెద. గోకులా. వారె వ్వరో కనుంగొనుము. నామనం బారాటము నొందు చున్నది."

కాని, యీలోన వేడుకలుచూచుటకై సంతోష పూర్వకంబుగ వచ్చెడు జనలసమర్దమునఁ బడిపోయి

యాతుట్టువాం డ్రదన్ఫ్యులైరి. వారిజాడ కనుపడదయ్యె ను. నవకుమారుండు యోచనావిమగ్నుండై మనోవ్య థాపరితప్తుఁడై కోటలోఁ బ్రవేశించెను. ఆసాయంతన ము జరుగునుత్సవములను గాని బాణసంచు వైభవము లనుగాని యాతఁడేమియును చూడనొల్లఁడయ్యెను.

---

ఆఱవప్రకరణము.

—:o:—

ఉత్తరధ్రువనక్షత్రకథ.

వసంతము గడచెను. శ్రావణభాద్రపదములలో వర్షములు విశేషముగఁ గురిసెను. నదులు నిండెను వంగదేశమునందలి వరిపొలములు పెంపొందెను. హే మలతకు పదుమూఁడేండ్లు నిండెను. యౌవనప్రాయ మారంభమయ్యెను. ఉష్ణదేశముల యౌవనము పిన్నవ యస్సుననే యారంభమగును. యౌవనోదయ మయిన వెనుక హిందూదేశమున నాఁడుపిల్లల పెండ్లిచేయకుండ నుంచరు. నవకుమారున కీమెయేకపుత్రిక. వివాహము మిక్కిలి వైభవముతో జరుగవలసియుండెను. ఆకారణ మున, తనదేవీపురరాజ్యము మరలఁ దనకు చేరిననే గాని

కుమార్తె పెండ్లి చేయునని సవకుమారుఁడు నిశ్చయించు కొనెను. ఆతఁడొక్కసారి కృత నిశ్చయుఁడయ్యెనేని, అందుండి యాతని గదలింప నెవ్వరును సాహసింప లేక యుండిరి.

హేమలత కింకను పెండ్లికాలేదన్న మాటయే కాని రెండుమూఁడేండ్లక్రిందట నిసుకతిన్నెలపై నాట లాడుచున్నట్లిప్పు డాడుకొనుచున్నదియా? లేదు లేదు. ఇప్పుడామెకు బాల్యావస్థయంతయును గడచినది. యౌవ నమారంభమయినతోడనే ఆఁడుపిల్లలు కొన్నికట్టుబా ట్లకు లోనుగావలసి యుందురు. ఆచారముచొప్పున నీ మెకును అది విధ్యుక్తమయ్యెను. ఈచిన్నదియు, స్వభా వసిద్ధముగ సాధుశీల. అయినది కానిది కలుగచేసుకొ ను తలంపులు కలదికాదు. ఉచితలజ్జావతి యగుటచే నామెను చూచినవా రందఱికిని ముచ్చట యగుచుండె ను. అభ్యంతర మందిరంబువిడిచి తల్లితోడనేగాని యా మె యెన్నఁడు నావలకుఁ బోయి యెఱుంగదు. అది యైనను గంగాస్నానమునకో దేవతాదర్శనసమారాధ నలకో గాని మఱి యెందులకును గాదు.

తమ హవేలీలోని యభ్యంతరమందిరంబున కెన్నం డైన వచ్చినప్పుడు శిరీషుని, ఏమి యొకటిరెండుమాఱు

లోగాని హేమలత తఱచుగా చూచుట లేదు. అట్టిసమయములయం దాతఁడు ప్రీతిపూర్వకముగ నామె యెడ నాతనికిఁగలయనురాగంబు పెంపునదగ్గఱగవచ్చి కూర్చుండి కరంబుకరంబునఁ జేర్చుచుండును. ఆమెయారోగ్యములంగూర్చి ముచ్చటించుచుండును. కాలక్షేపకథనం బడుగుచుండును. తమపూర్వగాథల నప్పుడప్పుడు తలంపునకుఁ దెచ్చుచుండును. బలిష్ఠుఁడును సాధువర్తనుఁడును, గంభీరుఁడు నగునాయాదవనాంగునిం గూర్చిన గుణప్రసంగమును హేమలత మిక్కిలిగా వినుచుండును. ఆతని శాంతవర్తనమును క్షమాసంపదయును ప్రశాంత పౌరుషసత్వగుణంబులును వినవిన నామె కాతనియెడ నాదరం బధికంబగుచుండెను. ఆతఁడు గొప్పయింటిబిడ్డయని యామె యెఱుంగును. కాని, ఆసంగతిమాత్రమెన్నండును వెలువరించదయ్యెను. ఆతని జన్మమునకును యోగ్యవర్తనమునకును భాగధేయంబునకును, ననువగునుత్కృష్టదశ యాతనికి సంప్రాప్తంబైన బాగుండునని మనంబున నభిలషించుచుండెను.

నరేంద్రుఁడు తరుచుగ రాకపోకలు సేయుచుండెడివాఁడు. ఆతని జూచినపుడెల్ల హేమలత మనస్సుకలవ

రము నొందుచువచ్చెను. అప్పుడప్పుడాడెడు నసంబద్ధ వాక్యములును, ఆగంతుక సంభాషణములును ఆమె మొగమునకు రక్తవర్ణమును దెచ్చిపెట్టుచుండెను. చిన్ననాఁడు నదీతీరమున నాతనితో నెన్నిసారు లాట లాడలేదు? అట్టియాపె ఉత్సేకుండగు నావయసుకాఁడు వచ్చినతోడనే సిగ్గుపడి మేలిముసుఁగు సవరించుకొనుచుండును. కాని, యాతనికంఠస్వరము విన నిచ్ఛగించుచుండును యశస్కుండగు నాతని ప్రచండవ్యాహారంబులు కొన్ని యాతండు ప్రసంగింప నవియామెకేమియు నర్థము కాకపోయినను వానినెల్లచెవియొగ్గి వినుటమాత్రము మానలేదు. గంభీరమగు నాతని మొగమును దిలకించునుత్సాహమును, ఆతనితరళనయనంబుల పెంపెసలారు విజయ తేజస్సును గనుంగొని యెఱుంగకయో అనివార్యంబగు నాకర్షణా యంత్రబలంబుననో అతని యెడ పాపమాచిన్నది యనురక్తయయి యుండెను.

స్త్రీలకు పురుషుల మనోవికారంబుల గుర్తించు వివేచనశక్తి స్వతస్సిద్ధముగ నుండును. హేమలతతల్లి యట్టివివేచనాశక్తిచే నరేంద్రుని యావనోత్సేకంబుల నెఱింగి క్రమక్రమముగ నాతనికడ విజృంభించుచున్న

మనోప్రవృత్తుల రహస్యముగ నాలోకించు చుండెను. దినదిన ప్రవర్ధమానులుగనున్న హేమలతానరేంద్రులం గూర్చిభర్తతో ప్రసంగించిన ప్రథమదినము మొదలు మఱియే యుపాయములును ఆమెయాలోచించుటలేదు. నవకుమారుఁ డామెసంకల్పములను వికల్పములు గావింప బహిరంగముగఁ దెగింపులేకయుండెను. అతికఠినఁబున నాతఁడు పూనియున్న నిశ్చితంబుననువదించెను. దేవీపుర యథారాజ్య గౌరవంబులు తనకు మఱలఁజేరువఱకు వివాహమనుమాటయే తలపెట్టరాదనిచెప్పి యావిధమయిన సంభాషణ మఱల రాకుండఁ జేసికొనుచుండెను. అయినను అప్పుడప్పు డాతనిముఖతః వచ్చుమాటల ధోరణినిబట్టి చిరకాలమునుండి తానుసంకల్పించుకొనియుండిన రాజ్యద్వయానుబంధమనిన నాతని కిష్టము లేదని యామె కనిపెట్టెను. అమెకుగలబుద్ధి సూక్ష్మతకొలఁది నవకుమారున కన్యథా సంకల్పమున్ననుఅయ్యది వ్యక్తీకరించి తనతోఁ జెప్పనేరకున్న వాఁడనియును, తనతోడ చెప్పనేచెప్పఁడనియును గ్రహించెను.

ఆఁడువాండ్రకనుమానము పుట్టినతోడనే అందలి యాథార్థ్యమంతయును కనుఁగొనిననేగాని నిద్రవో

నరు. పురుషుని వీక్షణములు స్త్రీల నిరీక్షణంబులకన్న మాంద్యములు. అందువలన పురుషుఁడు గనఁజాలని హృదయ రహస్యము లన్నియు ముఖవైఖరులవలన స్త్రీ లుకనిపెట్టఁ గలరు. పురుషులకు వినఁబడని సంగతులన్నియును వారు ఆలకింపఁ గలుగుదురు. పురుషుల కయోమయముగనుండు విషయములను వారుసులభముగ విడఁదీయఁగలరు. తనపరిచారికలను విచారించి కొంతసమాచారమును కఠినహృదయుండును, నవిదగ్ధుండు నగుతన భర్తయంగీకారముల మూలమున కొంతయును గ్రమక్రమముగ నాకర్షింప నిజమంతయు నామెకుఁ గరతలామలక మయ్యెను. ఆమెకాగ్రహము హెచ్చె. దానిని కొంతవఱకు దిగమ్రింగి యుండెను. ఆమె యతిప్రగల్భ అత్యంతప్రతిష్ఠ గలకుటుంబమున జనియించినది. హేమలత యామె కేకపుత్రిక. ఇల్లువాకిలి లేని నిరాధారుని కొక్కనికామె నిచ్చి పెండ్లిచేయుట తల్లిప్రాణమున కొప్పునా? పరిణయ మిట్టుజరుగవలెనని దుర్మంత్రిం డగు గోకులుండు నిశ్చయించుటయా? భర్తకాతఁ డుపదేశించుడా? అట్టివివాహమునకు తానొడంబడుటయా? ఇది యంతయుఁ దలంచుకొనునప్పటి కామెకు పిచ్చియెత్తి

పోయినదనిన నమ్మ రపడవలెనా? కాని గోకులదానుసా మర్థ్యమామె చిరకాలమునుండి యెఱుంగును. ఆతఁడు దుర్నివార్యుండగు తంత్రజ్ఞుండు. మనసున నొక్కటియు మాటల నొక్కటియును పెట్టుకొని రెండుసంస్థానముల నేకత్రాటిని నిర్వహించుచున్నవాఁడు. అట్టి పాపిష్టిహ స్తంబులిప్పుడు గృహనిర్వాహక వ్యాపారములపై కరుగ సుంకించి యున్నవి ఉపాయశాలినియగు నాగృహిణి తన మేధావిశేషమంతయు నుపయోగించి దీని కెదురెత్తుగఁ బోవుట యెట్లోయని యోచింప మొదలిడియెను.

నవకుమారుఁడుమాత్ర మీకాపట్యము నెంతకా లమని పుక్కిటఁ బట్టియుండఁగలఁడు? ఆఁపియాఁపి యొ క్కనాఁడీవిషయమును భార్యకడ విప్పఁ బ్రయత్నించెను. ఆమెమాత్రము సామాన్యురాలా? అతిప్రగల్భ. ధీరాతి ధీర. నోట నుచ్చరింపకయే యాతనిసంకథనప్రయత్నము లనెల్లఁ దోసిపుచ్చి వాగ్బంధన మొనరించెను అంతవఱ కీవిషయము రహస్యముగ నున్నదనియే యాతఁడెంచు కొనెను. ఈచర్యలనుజూచి తనగుట్టంతయు నీవఱకే బయ లయ్యెనని కనిపెట్టెను.

పిమ్మట కొన్నిగృహకలహములు సంఘటిల్లినవి. అన్నింటను నవకుమారుఁడే యపజయము నొందెను.

హేమలత యుత్తమవంశసంజాత. అనుపమానసౌందర్య వతి. ఊరును పేరును లేక గాలికి గొట్టుకొనివచ్చిన శిరీషున కట్టి శిరీషకుసుమకోమలి నొసంగుట. ఈమాట లామెనో టనుండి త్రుంచివేసినట్లు తృణీకారభావమున వెలువడుస రికి నవకుమారుని హృదయము తఱుగుకొనిపోయెను. ఆతఁ డెంతకర్కశహృదయుఁడో యంతటి మహాభిమాని. ఒక్కొకప్పుడు తనభార్యయోచనయే యుత్తమమనియు ను, హీనవంశసంజాతుండగు గోకులుండు తనవంశప్రతి ష్ఠ నంతయుచు నీటఁగలిపి తనను రొంపిలో దింపి యీ డ్వనున్నాఁడనియును తలంచును. ఈతలంపు లాతనిమనం బున నిమిషనిమిషంబునకు బయలువెడలుచుండును. నిశ్శ బ్దములుగ నున్నరాత్రుల నిద్రయనునది లేదు. అనునిమిష మునను నీతలంపులే. హృదయస్థయోచనలు వాక్కునకు రావు. జననమెత్తినది మొదలు ఎన్నిగండములు? ఎన్నియ పజయములు? అన్నియు యుద్ధములే. అన్నియు నాశా భంగములే. ఉత్తమమగు తనసాధ్వియుపదేశంబు వినిన చో నివియన్నియు నంతరించును. దేవీపుర వీరనగరసం స్థానములరెంటి నేకీభవింపఁజేయు నీయుపాయము మిక్కి లి నైపుణ్యమయినది.

గృహకృత్యవిషయములలో సందిగ్ధముగనుండు వా రెప్పటికిని లేవలేరు. క్రుంగిపోవుదురు. నవకుమారుఁ డల్లాడుచుండెను. మేధానిధానయగు తద్గృహిణి, యాంతనిసందిగ్ధభావంబు తనకుఁ దెలియనట్లు, నటించెను. తనకు విజయముగలిగెనను సంతోషము మనంబున నుదయమయ్యెను. కాని దానిని బయలువడకుండ కప్పిపుచ్చెను. ఆమె తనమనంబున నెద్దియో యొకత్రోవ యోచించుకొని దానిననుగమింపఁ గృతనిశ్చయ యయ్యెను. అవసరమగు నేని గోకులదాసును దన్మార్గమునుండి, త్రొక్కుడు చే నలగిపోయినపురుగునుబోలె నిడ్చివేయఁగలనని తలంచియుండెను. ఒకనాఁటిసాయంకాలమున వారిరువురకును విశేషముగఁ జర్చలు జరిగినవి. "నాథా! మీ సంస్థానవ్యవహారము లన్నియును మీరు స్వయముగా చక్కబెట్టుకొనుట నాయభిమతము. అదిపురుషలక్షణము. గృహనిర్వాహకవ్యాపార మంతయు నాయందుంపుఁడు. అది యాఁడుదాని కర్తవ్యకృత్యము" అని చెప్పెను.

నవకుమారుఁడు దీనిని, ఉదాసీనతగాఁ దలంచి విశ్రమింపఁబోయెను. గృహిణి పిట్టచేఁజిక్కెనదని తలంచెను.

కాని యాపె గోకులదాసు బుద్ధిబలమును పూర్ణముగ గ్రహించినదికాదు. దేవీపురమునుండి శిరీషుని వీరనగరమునకుఁ గొనితెచ్చి నరేంద్రునిప్రక్క నుంచినదెవ్వరు? అతఁడుకాఁడా? శైవలినిని హేమలతకు నిరంతరసహకారిణిగాఁజేసినదెవ్వరు? అతఁడుకాఁడా? శైవలిని బాలవితంతువు. సాధుశీల. మేధావిని. ఎల్లప్పుడును పరుల యోగక్షేమములకు నాపె పాటుపడు చుండును. స్వసౌఖ్యములనెల్ల పరిత్యజించి యాపె వర్తించిన వర్తనమునుం గాంచిన వింత యగును. ఇట్టి ప్రవర్తన మలవడ నేర్పడిన హిందూదేశమునందలి నిర్బంధవైధవ్యము నిందాస్పదమా? అట్టిప్రవర్తనము మనదేశపువితంతువుల నేకులకడ దాస్యము సేయుచుండును. యోగినులవలె వారలతినమ్రలు. యాజకులరీతి పరమపావనలు. వారల యనురాగము సహోదర సమాదృశంబు. శైవలిని యిప్పుడు గోకులదాసు చేతినుండి పనిచేయుచున్నది. గోకులదాసు తనపని యంతయు నీయాయుధ సహాయమున నిర్వహింపఁ దలంచెను.

గోకులుఁడుపాయశాలి. తనమనస్సంకల్పములను శిరీషునకుఁ గాని శైవలికిఁగాని వెలువరింపఁడు. వారి

హృదయమున క్రొత్తక్రొత్తకాంక్షలుప్పతిల్లునట్లు నడుమ నడుమ సూచనలుగఁ దనమనోభావముల వెలార్చుచుండును. అవియును వారికి సందిగ్ధభావంబులుగ నుండుచువచ్చెను. ఒకప్పుడుగోకులుఁడు శిరీషునితో తరములనాఁటి యాతని పూర్వులచరిత్రయునువదించి చెప్పుచుండును. నవకుమారునిపూర్వు లాతనిపూర్వుల రాజ్యభ్రష్టులఁ జేసిరనును. అట్లుగాకున్న దేవీపుర రాజ్యము నేఁడు నీయధీనమై యుండవలసి యుండుననును. ఇట్లు చెప్పుచు నాతనికడ పూర్వులపరాక్రమప్రశంస చేయుచుండును. ఒకప్పుడు పరిణయసంబంధము లను కాలము లైనవి సమకూరెనేని, పరిచ్యుతినొందిన పూర్వకుటుంబములు తమతమ తొంటియౌన్నత్యమును మరల పొందఁగాంచునని చెప్పుచునట్టివయున్కులసాహసకార్యములు వర్ణించుచుండును. ఇన్ని చెప్పుచున్నాఁడు. తనప్రభునిగూర్చి గోకులుఁడు పల్లెత్తుమాట అనియెఱుంగునా? ఎఱుంగఁడు. నవకుమారునకు కాలము చెల్లినది. అనంతర రాజ్యస్వీకరణమున కెవ్వరును గనుపించుట లేదు. ఆతఁడు కష్టజీవి. ఆతని కన్నియును గష్టములే. బుద్ధిపాటవము తగ్గినది. శరీరము దుర్బలతకు వశమై

నది. భాగ్యవశంబున నెవ్వఁడో యొకయుచిత వంశజుఁడు వచ్చియాతనిస్థాన మలంకరించుచు. దానికిని తరుణము సమీపించినది. తన వంశప్రతిష్ఠయుం దుత్సుకుం డగు నుదారశీలుండొకండు వచ్చి తత్కులగౌరవంబులఁ గాపాడి యాతని పూర్వమర్యాదల నిలిపి యాసింహాసనము నధిష్ఠించుఁగాతమని గోకులుండు తనమనంబున సంభావించుచు తలంపులు వెలువరించుచుండెను. మానముద్రుండగు శిరీషుని మనంబున నిట్టిమాటలు నాటుకొని పోవుచుండెను. అదృష్టదేవత యాపదవి తనకొఱకే నేఁడ్పరచియుంచిన దనుకొనును. తానందులకుఁ దగిన బలశాలిననియును యోగ్యవర్తనుండననియును దలంచును. ఇట్లనుకొని మనంబున సంతుష్టి వహించుచుండును. ఒక్కొకకొత్తతలంపు మనస్సునవచ్చి పాదుకొనునప్పటికి ఆతని మొగమున నొక్కొక క్రొత్తకళ ప్రకాశితంబగుచుండును. అభ్యంతరమందిరాంగణంబున హేమలతంగనునప్పటి కాతనిరూపము మఱింతదర్శనీయంబగుచుండెను. ఈసందిగ్ధవచనంబులు తరుమగ శైవలినికడ కూడ వినియోగమగుచుండెను. అచ్చటకూడ నియ్యవి కొంతవఱకుఁ బనిచేసినవి. సోదరీమణులు సోదరులకు

సహకారులు. స్త్రీలు పతికుటుంబమునందును ఐశ్వర్య నిర్మాతలు. ఆనాటున శిరీషునికన్న యుదారశీలుండగు వయస్కుండు వేఱొక్కండు లేఁడు. నరేంద్రుఁడుద్రేకి. చంచలుఁడు. శిరీషుఁడు పౌరుషలక్షణలక్షితుండు. నిశ్చలహృదయుండు ఈతనితో నరేంద్రునుపమింప ననువుపడదు. శైవలిని సోదరునకు సోదరి యెట్లుసహాయముచేయునో అట్టిసాయము సేయనోపు. మనదేశచారిత్రము నందప్పుడప్పుడు స్త్రీలు అంతరించిన వంశప్రతిష్ఠల పునరుజ్జీవింపఁ జేసిననిదర్శనములు పెక్కులుగలవు. అట్లే దేవీపురవంశప్రతిష్ఠయును, సురక్షితంబు గావచ్చును.

శైవలిని కిట్టి సూచనలు చాలును. తమ్మునియందనురక్తియెంతయుండవలయునో యామె యంతఅనురాగముతో మెలంగుచున్నది. బుద్ధి యాఁడుబుద్ధియె గాని భావికాంక్షలెన్నియేని యామెమనంబున నాటుకొని యున్నవి. హేమలతకును శిరీషునికిని పరిణయమయ్యెనేని యవియన్నియును మొలకలెత్తును. సాయంతనసమయంబున నామెపుష్కరిణీపరిసరంబులనో ఆరామదేవాలయ ప్రాంతములనో హేమలతతోడ విహరించుచునామె పూర్వులచారిత్రములు, దేవీపురకథలు, తనసోదరు

ని యౌదార్యము, ఆతని నిర్మలవర్తనము మున్నగు విష యములంగూర్చి విసుగులేకుండ ముచ్చటించుచుండు ను. హేమలత యీకథలన్నియు నత్యాసక్తితో నాలకించుచుండును. వినినకొలంది దేవీపురరాజ్యమునకు భవిష్యద్విభుండు శిరీషుండు కానోపునని యే తలంచుచుండె ను. అంత నామెమనంబున తద్విగ్రహంబును, ఆతనియుత్తమసద్గుణంబులును కన్నులఁగట్టినట్లగుచుండెను. రాజమందిరమున జరుగుచున్నసంగతు లేదినమున కాదినము గోకులుండు తెలిసికొనుచు కనుగలిగి మెలంగుచుండెను. కార్య మంతయును చేఁజిక్కినదని దృఢనిశ్చయుండై యుండెను.

ఈయాట చదరంగపుటెత్తుల ననుకరించెను. రాజు దుర్బలుఁడు. ఆతని నెప్పటికప్పుడు కనుగలిగి కాపాడవలసివచ్చెను. రాణి యబలయయ్యును నీవిషయమున బ్రబలయై భర్తను విధేయుంగావించుకొనుచుండెను. ఆమెయెత్తు తనయెత్తుకంటె పైయెత్తుగనున్నదికాని తక్కుంగల బలంగము వ్యర్థముగఁ బోవునా?

ఒకనాఁటిసాయంకాలము పండ్లతోఁటలో సరస్తీరంబున హేమలతా శైవలినులు కూర్చుండి ముచ్చటించుచుం

షగా యథారీతిని నరేంద్రుఁడాకస్మికముగ చక్కవచ్చెను. శైవలిని లేచి యావయసుకానిని బలుకరించెను. హేమలత ప్రీడావతియై యిన్నకుండెను. కొండొకవడినందఱును మౌనముద్రులై యుండిరి. ఆమౌన ముభయత్ర బాధాకరమే యయ్యెను. శైవలిని రొట్టకేలకు సాధువచనంబుల సహజమై పుణ్యంబున మౌనమును దిగఁద్రోసి అన్నా! నరేంద్రా! కొలఁదికాలమున నీసంస్థానమును నీకునొప్పగించెద రని విన్నదానను మిక్కిలి సంతోషముగ నున్నది. నీవేసంస్థానమునఁ బ్రజారంజకుండవై మెలంగుము. నీపితామహుండు పూర్వమెట్లు రాజ్యము చేసెనో దాని నిదర్శనముగఁ గొని నీవును బ్రజలకెందఱకుఁ జుట్టమవై రక్షకుండవై సర్వథా చరింపుము.

"అక్కా! శైవలినీ! గాలికబురు లెన్నియేని పుట్టుచుండును. నాసంస్థానము నాకిప్పుడొప్పగించుటకు తగినకారణము గనుపించదు. అదియు జరగిన మీరందఱును పీరనగరమునుండి వెడలిపోవుట సంభవించును. కావున నింతలో నాకట్టికోరికయును లేదు. బహుశః ఇంతకంటె మంచియదృష్టము కనిపెట్టె—"

అని చెప్పఁబోయి నరేంద్రుఁడు చటుక్కున నాఁపివేసెను. కాని శైవలిని, ఆతనిమనస్సు నంతలోనే గ్ర

హించెను. "అన్నా! దేవీపురమునకును, వీరనగరము నకును చేరువయేకదా! తఱచు మనము సమావేశమ గుచునే యుందుము. దేవీపురమువారు దేవీపురమునకు మరలుట లెస్స. ఈరెండుకుటుంబములును మూఁడునం దల వత్సరములనుండి వేఱుపడి యున్నవి."

"అక్కా! శైవలినీ! ఇంకను ఎడముగనే యుం డవలయునా? అదియే యభిమతమా?"

"అన్నా! నరేంద్రా! నేనాఁడుదానను. పురు షులమనంబుల నుండునట్టి యోచనలు మాకెట్లుండఁగ నగును? పెద్దలు దేవీపురమువారి చరిత్రలును వారివం శావళియును వేఱుగా నున్నదందురు. దేవీపురమువారి పుత్రపుత్రికాసంతాన మందఱు నందుల కనురూపముగ బ్రవర్తించుచుందురని చెప్పకొందురు. చేఁపలు గాలిలోఁ బతుకలేవు పక్షులు నీటిలోఁదిరుగనోపవు."

అనిచెప్ప నరేంద్రుఁడు హేమలతను పిడిచి సా యంతనమింటిలో పనియుండి యదిసవరింపంబోయెను. శైవలిని కడపటివాక్యములయందలి యర్థము ద్యోతక మయ్యెను. మౌనము వహించి యోచనానిమగ్నుండై యుండెను.

చంద్రోదయమయి చాలతడవైనది. పుష్కరిణీ జలంబుల శశాంకుండు తళతళలాడుచు కనిపించుచుండె ను. మందమారుతుఁడు ఉన్నతవృక్షములను జోపుచు వింతశబ్దముల నొదవించుచుండెను.

హేమలత యిప్పుడచ్చట సుఖాసీనయై యుండె. నరేంద్రు వలన మున్నామె యాకర్ణించిన చిన్ననాఁటి కథయొకటి యిప్పుడామె తలంపున బారినది. అంతనామె ప్రక్కనున్న యాతని మొగమువంకఁ జూచెను ఆచూపులు నిష్కపటములై శిశువీక్షణంబుల ననుకరించెను. నరేంద్రునిసుందరవదనము చంద్రకళాశోభితమై యుండెను. ఆతఁడుత్తరధ్రువమువంకఁ జూచుసరికి పామరులు చెప్పుకొనెడి పుక్కిటి పురాణమొకటి జ్ఞప్తికివచ్చెను.

"హేమలతా! మన ముభయుల మిచ్చట మున్ను సాయంకాలములందెట్లు సుఖాసీనులమై యుంటిమో. చిన్నతనమున నీకెట్టికథలు చెప్పినవాఁడనో, ఏమైనజ్ఞాపకమున్నదా?"

హేమలతడగ్గుత్తికతో "నాకు నిప్పుడదియే తలంపునఁ బారినది"

"హేమలతా! ఇప్పుడు చిన్నతనమంతయునుదాఁటిపోయినది. అట్టికథలేవియును విననిష్టములేనట్లున్నది."

ఒక్కించుక కుంచించినస్వరముతో, హేమలత, "నరేంద్రా! ఇష్టములేకేమి?" అనెను.

"అట్లైన వినుము. ఆనక్షత్రమును జూచితివా?"

"ఆ చూచితిని ఆచెట్టుపైది కాదా?"

"దానినే ధ్రువయందురు. అనగా నిశ్చలమయినదనియు, యథార్థమయినదనియు నర్థము"

"అట్లుచెప్పుటకు కారణమేమి?"

హేమలతా! దానికొకకథ యున్నది. ఆకథకును దీనికిని మనకవులు లంకెవేయుదురు."

హేమలత పిల్లలడిగినట్లు అత్యాతురతతో "ఆకథ యేమో చెప్పవా?" అనియడిగెను.

"ఒకరాజునకిద్దఱుభార్యలు, వారికిద్దఱకును చెఱియొకపుత్రుఁడును బుట్టిరఁట. పెద్దభార్యయనిసను, ఆమె కొమరుఁడనినను రాజునకెక్కువ మక్కువ. చిన్నభార్యయందునను తత్సంతానమునందునను నిర్లక్ష్యభావము. ఆమెయొకనాఁడొక చిన్నగుడిసెలోనికి పిల్లవానినెత్తుకొని పోయి యేడ్చుచుండెనఁట. ఆమె యెందుకేడ్చుచుండెనో, ఆపిల్లవానికి తెలియదు."

"ఆతఁడు పెద్దవాఁడయ్యెను. తల్లి యొకనాఁడాతనితో "నేను రాజభార్యనయియుండినను నీవు రాజపుత్రుఁడవై యుండియును భూమిమీఁద మనవంటి యనర్థకజీవనములు మఱియెందును లేవని యెంచఁదగినంతటి దుస్థితిలో నున్నారము" అని చెప్పెను.

"పిల్లవాఁడది విని యటనుండి తరలిపోయి యోచించుచు కూర్చుండెనఁట. కొండొకసేపటి కాతఁడు తల్లియొద్దకు మరలివచ్చి "అమ్మా! నీవువిచారింపలవదు. నేను రాజులకన్న నధికకీర్తివచ్చెడుపని యొకటిచేసెదను." ని చెప్పిపోయి యాతడుపన్యసించెనట.

"ఆవయస్కునినామమే ధ్రువయఁట. ఆతఁడు నిశ్చలుండును శాశ్వతుఁడును. ఆతఁడరణ్యమున వసియించి కందమూలముల నారగించుచు రాజులకెల్లరాజులగు భగవంతుని నారాధించుచు కాలముపుచ్చెను. ఆతనివిఖ్యాతి దిగంతవిశ్రాంతమై మిక్కిలియగు ఘనత వచ్చెను. రాజులందఱునువచ్చి యాతనిపదముల నర్చించుచు కానుకలనర్పించుచు వచ్చిరి. ఆతఁడు మరణించి యీనక్షత్రమై పుట్టెనట! నిత్యము నిట్లే ప్రకాశించుచుండును. ఇయ్యది శాశ్వతము నిశ్చలము.

హేమలత చాలసేపటివఱకు నూరకుండి "కథ మంచి యింపుగనున్నది. తేజోవంతమగు నానక్షత్రము నాకంటఁ బడినపుడెల్ల నిన్ను స్మరించుచుండెదను. నేను దేవీపురమునకుఁ బోయి నీకు దూరముగా నున్నప్పుడైనను సరే !,,

"కథ యెంత యింపుగా నున్నదో, అందలి నీతియును. అంతయింపయినదియే సుమా! ఆనక్షత్రమును నిరంతరమును జూచుచుందుము. నిశ్చలవై ఋజుమార్గవర్తివై మెలంగుదువు." నీవు దేవీపురమున కెప్పుడును పోవనె పోవకుందువు.

---

## ఏడవ ప్రకరణము.

---:o:---

## శరత్కాలోత్సవము.

వర్షకాలము గడచినది. శరత్సమయ మారంభమైనది. ఆకాశము స్వచ్ఛమై నీలవర్ణమున నొప్పుచుండెను. వర్ష సలిలముల జలకములాడి జనపదంబులెల్ల నూతనహరితసస్యాంబరముల ధరియించెను. ఇద్దరిద్దరుల మోసి ప్రవహించెడునదు లన్నియుఁ బిల్లకాలువలయ్యె

ము. పట్టణ పరిసరములను పల్లెల ప్రాంతములను కూడ శరత్సమయసస్యంబు ఫలోన్ముఖంబయ్యెను.

శరత్కాలంబున దేశమునం దంతటను సింహవాహనాధిరూఢయు వరప్రసాదినియునగు చండికాదేవి యుత్సవములు జరుగును. ఈమాసముననే సూర్యుఁడు సింహరాశినుండి కన్యారాశికి వచ్చును. ఈయుత్సవ మా ఖగోళసాంకేతికము ననుసరించి వచ్చినది ఈసాంకేతికము మాట పామరజనంబు లెఱుంగరు. ఆమె చల్లగఁ జూచిన పంటలు పూర్ణముగ పండునను నాశతో వారం దఱును నాయంబను పూజించుచుందురు. రాజపుత్రులు మహారాష్ట్రులుమున్నగు సమరాసక్తులగుజాతులవారీయుత్సవముల నాయుధపూజ గావించెదరు. హేమంతయుద్ధయాత్రలకై సన్నాహములజేయుచు నిత్తరి సైనికులఁబరీక్షింతురు. ఉత్తరహిందూస్థానమం దెల్లడను నీయుత్సవము లత్యుత్సాహముతోడను అతివైభవముతోడను నడచును. సంగీతములు సమారాధనలు దీపోత్సవములు మున్నగునవి కోలాహలముగ నడచును.

శరత్కాలోత్సవ మంతయు నయినది. కడపటిదినము మిగిలి యున్నది. ఆదినమున ప్రభాతమయినది. సు

హస్రకిరణుండు తన కిరణ సహస్రంబుల వీరనగరమును తేజోవంత మొనర్చుచుండెను. గోకులుఁడు తద్వ్రతునసమ య ప్రథమ సందర్శనం బొనరింప రాజమందిరమున కరుదెంచెను.

ప్రభుండు ప్రీతిపూర్వకముగ గోకులునితో "గోకులా! నీవు చిరకాలమునుండి భక్తివిశ్వాసములతో కడు బాధలుపడి పరిచర్య సేయుచుంటివి. కాని నీసంకల్పమింకను సిద్ధించునట్లు లేదు.

"నాతండ్రు లెట్లు పని చేసిరో అట్లే నేనును మిమ్ము సేవించితిని. నాసంకల్పము సిద్ధించినది."

"ఈయాఱుమాసములనుండియు నిట్లే చెప్పుచుంటివి. మానసింహుడాఫ్ఘనులతోఁ బోరాడుచు "ఒరిస్సా"యందున్నవాడు. అతని "కానంగో" చేతపనులన్నియును నిద్రపోవుచున్నవి.

"ప్రభువరా! మానసింహరాజు "ఒరిస్సా" దేశమును జయించినాఁడు ఆదేశము "అగ్బరు" బాదుషా సామ్రాజ్యమునకు చేరిపోయినది. ఆయన రాజమహలునకు మరలివచ్చుచున్నాఁడు వచ్చుటతోడనే "కానంగో" వేసినయుత్తరవులు ధ్రువపడును."

"ఉత్తరువులయినవా,,

"అయినవికాని యింకను వెల్లడికాలేదు. ఈ యుత్సవము పూర్తియయినతోడనే దేవరవారు మరల దేవీపురమునకు చేరెదరు."

"నీవు మిక్కిలి కృతజ్ఞుఁడవు. లెస్స యొనరించితివి. బాగుగనేజరిగినది; కాని మానసింహరాజా యీ యుత్తరవులు ఖాయపఱచునని యేనా నీయూహ? వీరనగరవంశమునందు మానసింహునకున్న యభిమానమును గాంచినను, నరేంద్రునితాత యాకుటుంబమునకు జేసిన సాయమును గాంచినను నామనస్సునకు నమ్మకము గలుగుటలేదు"

"వీరనగరమునుగూర్చియును, దద్రాజకుమారునిగూర్చియును యోచించుటకు మానసింహునకు ఊపిరి విడచుటకైన తెఱపి లేకున్నయది. బంగాళదేశమునకు, ఆతఁడుక్రొత్తగ రాజమహాలుపట్నమును రాజధానిగనొనర్చినాఁడు. రాజపుత్రస్థానపు టెడారిలోనున్న తనయంబరుకోటవలె నీరాజమహాలుదుర్గమునుకట్టుదిట్టము సేయవలెనని తలంచుచున్నాఁడు."

"గోకులా! ఆతనికి సమరాసక్తియెంతయున్నదో అంతవివేకముకూడనున్నది. ఆతఁడీరాష్ట్రమునుండి వెడ

లిపోవుటకుమున్ను బంగాళారాష్ట్రమునందలి యైశ్వర్యసామ్రాజ్యము నంతను గట్టిచేసి మఱిపోవును.

"ఔనౌను. మానసింహుఁడే కార్యమును సగము సగము చేసిపోవఁడు. బంగాళాదేశమునం దతఁడు తన యధికారమును బలపఱచుటకై యిక్కడికన్నియ నొకదానిని పెండ్లి చేసుకొనఁ జూచుచున్నాఁడని చెప్పుకొనుచున్నారు.

"సమరోత్సాహతత్పరుండగు నాతనికుమారుని కిక్కడ పెండ్లి చేయవలయుననియా?"

"లేదు లేదు. తాను పెండ్లాడవలయుననియే."

"గడ్డమును మీసమును నెరసిన యాముసలియోధు, ముద్దులగుమ్మయగు వంగదేశకన్యక నొక్కదానిని ముద్దులాడఁగోరుటయా?"

"ప్రభువరా! అట్టివ్యాపారములు మున్నెన్ని జరిగియుండలేదు? స్త్రీలసమ్మోహన యంత్రమునకు గడ్డములు నెరసిన యోధులుమాత్రము లెక్కయా? జనుల నందఱ గడగడలాడించు మహారౌద్ర మూర్తులవంటి వారు కూడ యాసమ్మోహనాస్త్రములం జిక్కి వెలువడ నేరకున్నవారు."

ఈమాట గోకులుఁడు నిష్కపట హృదయము తోడనే యన్నను ననకుమారునకు మాత్రి మిథ్యాదిము లికివలె నాటెను.

"గోకులా! నీమాట లెప్పు డవ్యక్తముగ నేయుం డును. రాజెవరిని పెండ్లాడఁ దలంచినాఁడు?"

"కూచిబేహార రాజుచెల్లెలిని తనరాణివాసనము జేర్పఁదలంచినాఁడు. ఆకారణముచే నుత్తరబంగాళమున దనపలుకుబడి వృద్ధియగు ననియును, అక్బరుసామ్రాజ్య ము గట్టిపడుననియును నాతనియూహ. ఆతనికిప్పుడన్ని వైపులను సహాయసంపదలు కావలసియున్నవి. క్రొత్త క్రొత్తశత్రువులు సముద్రముమీఁదనుండి దిగి దక్షిణ బంగాళమును ముట్టడించుచున్నారు."

"గోకులా! ఏమి? విజాతీయులగు నోడదొంగలు సముద్రము మీఁదుగా మందలుమందలుగ వచ్చిమనరే వుస్థలములను దాపినంటియున్న సముద్రపు కాలువలను చెరుచు చున్నారని యత్యద్భుతముగఁ జెప్పుకొనుచు న్నారు. గోకులా! నీకీవిషయమైన నిశ్చలసమాచారమే మయినఁ దెలిసినదా?"

"వారు సముద్రముమీఁద తీవ్రముగ దేశాటనము చేయునొకతెగవారు. వారిది పోర్చుగల్ దేశము. చాల దూరమునుండి వచ్చుచున్నారు. సిబాస్టియన్ గాజలస్ అనుపేరు మనము విన్నారము. ఆతఁడీతండాకు నాయకుఁడు. గంగాముఖద్వారముననున్న పెద్దద్వీపమొక్కటి యాతఁడు జయించినాఁడు. వాల్గ్లీ రేవుస్థలమున వారిజాతివారు కొందఱు కట్టుదిట్టములను జేసికొని భీరులగునచ్చటి జానపదులను తమపాడుమతమును గైకొమ్మని నిర్బంధించుచున్నారు."

"ఏమిరా గోకులా ఈవిషయము చాల దారుణముగ నున్నదే? అట్లైన మానసింహుఁడిప్పుడణఁగఁద్రొక్కవలసిన దొక్కయాఫగనులనే కాదు."

"నాటున నున్న శత్రువులొక్క యాఫగనులే. ప్రభో! సముద్రమెంత విస్తీర్ణముగనున్నదో నీటిపైనుండి వచ్చు శత్రువు లంత విస్తరిల్లియున్నవారు. సముద్రముఖద్వారము లన్నియును పోర్చుగీసుల కమ్మివైచినారు. మనయాఁడువాండ్రను వారు దొంగతనముగఁ దీసికొనిపోయి పెండ్లిచేసికొను చున్నవారు. మగవాండ్ర

నందఱి నస్తవ్యస్తులుగఁ జేయుచుండిరి. ఇంకనుదూర దేశములనుండి మఱికొన్నిజాతులవారు వచ్చుచున్నారని విన్నాఁడను. వారు హాలండు ఇంగ్లండు దేశములనుండి వచ్చుచున్నారఁట. పోర్చుగీసువారితో పోరాడి సముద్రముపై ప్రాముఖ్యములను వహించనున్నవారట."

"ఏమి గోకులా! అట్లైన ప్రపంచమిప్పుడు మనమనుకొన్నదానికంటె హెచ్చుగ నున్నదే అయ్యో! ఈజాతివారందఱు నిప్పుడీదేశమున కేల వచ్చిమూఁగుచున్నారు."

"చలిచేత పిడచకట్టుకొనిపోవు హిందూదేశమందలి యుత్తరహిమాలయ ప్రాంతములనుండి ప్రతిశీతకాలమును తిండికొఱకై పక్షులు కోటాను కోటులు వచ్చుచుండును. పశ్చిమమున నుండెడి అట్టి శీతల ప్రదేశములనుండియు నట్లే ఈజాతులవారు దళమువేసి పుట్టినమన దేశమందలి యైశ్వర్యమునకును, వాణిజ్యమునకును, సమృద్ధిగనుండిన చేతిపనులకును వచ్చిపడుచున్నారు."

"గోకులా! అట్లైన వారియుద్దేశము ఒక్క ధనమునకును వాణిజ్యమునకును కాదుసుమా! వారికి రా

జ్యమునందును స్వాస్థ్యములందును గూడ కాంక్షయుండి యుండును.

"ప్రభువరా! ఈదేశద్రిమ్మరులకు మనదేశమునందుసామ్రాజ్యమును సంపాదించుటకెంత సావకాశమున్నట్లుకనఁబడదు. అక్బరుని వివేకమువలన ఆతనిసామ్రాజ్యమిప్పుడు ప్రపంచమునందు, మిగులగొప్ప సామ్రాజ్యమై బలపడినది. మానసింహుఁడు మున్నగు సామంతులచే నాయుధపరిరక్షితంబై సురక్షితంబుగ నున్నది.

"గోకులా! అనేక వంశములు బయలుదేరినవి. అనేకములు నశించినవి. అక్బరు కొడుకులింత వివేకవంతులు కాకపోవచ్చును. ఈసముద్రపు జాతులవారు మొగలాయీల వద్దనుండి ఈ సామ్రాజ్యమును లాగుకొనవచ్చును. మొగలాయీలు ఆఫ్గనులను జయించి లాగికొనలేదా?,,

"ప్రభువరా! దేశవర్తమానవిషయము లింతటితో చాలింపుఁడు. ఈదేశమున సముద్ర పరిపాలనము వ్యాపింపఁజేసి తెల్లవారు రాజ్యము చేయుదనుక ఈగోకులుఁడు జీవించి యుండఁడు. అప్పట మనకుఁగనపడు పచ్చని వరిపొలములన్నియును [illegible]

ప్రభువువారు వారి దేవీపురరాజ్యమును మరల స్వీకరించి పరిపాలించుట మాత్రమే కనఁగలఁడు.

శరత్కాలోత్సవము కడపటిదినము ఆశ్వయుజ శుద్ధదశమి. యిదియే విజయదశమి. ఆదినమున దేవాలయములన్నిఁటను మహోత్సవము జరుగును. శ్రీమంతులగు వారలందఱి యిండ్లను, బూజలు జరుగును. జనులు పల్లెటూళ్లనుండి పటాటోపముగా వస్త్రాద్యలంకరణముఁ గావించుకొని పట్టణములకు వచ్చిమూగుచుందురు. సూర్యోదయ కాలమున స్త్రీలు శతశతంబులుగ వచ్చి గంగాస్నానములు చేయుదురు. చిన్నపిల్లలు వందలకొలఁది ప్రోగువడి సంగీతములఁ బాడుకొనుచు వీధుల వెంట వాహ్యాళి జనుచుందురు. ఆచిన్నిపట్టణ మేమూలఁ జూచిన నీరీతి మహావైభవములతో మహదానందనిమగ్నమై యుండెను. ఎక్కడఁగనుఁగొన్నను అపరిమితసంతోషము పొంగిపొరలుచు పర్వదినంబులననుకరించెను.

నవకుమారుఁడు పల్లెటూళ్ళనుండి వచ్చియున్న వేనవేల జానపదులకు మధ్యాహ్నము పూట మహావైభవముతో సంతర్పణ చేయించెను. వర్షకాలమంతయును గడచునప్పటికి బంగాళదేశమునందలి నదులును ప్రవా

హములును పూర్ణముగ నిండియుండును. అట్టి సమయమున వ్యవసాయికులందఱును పందెములు పూని నౌకావిహారములు సేయుచుందురు. అందువారు నిపుణులు. అచ్చట నౌకలు పొడవుహెచ్చుగను వెడల్పు తక్కువగను నుండును. పడవ లన్నియును మంచినడక పడవలు. ఒక్కొకదానికిని కోలలువేయువారు పదునాఱుగురు లేక యిరువదిమంది యుందురు. తెడ్లతో సలిలమును ద్రోసివైచుచు నౌకలను జెప్పశక్యముగాని వేగమున నడిపించుదురు. ఆవిరిసాధనము కనిపెట్టకమున్ను వేగమున నీపడవలతో సరిసమానముగునవి మఱియెవ్వియును గానరావు. ఒకగ్రామమువారు మఱియొకగ్రామముతోడను, ఒకపట్టణవాసులు మరియొకపట్టణవాసులతోడను బందెములు వేసికొందురు అట్టిపందెముల సమయంబునఁ గోలలు వేయువారల యుత్సాహంబులును, వానిని సందర్శింపవచ్చిన వేనవేలుజనుల కోలాహలంబులును వర్ణింపనలవికాదు.

తడవులఁబట్టి విజయదశమినాఁడు వీరనగరమునందట్టిపందెములు జరుగుచుండుట వృద్ధాచారము. నవకుమారుని వీరనగరనివాసమున కిది కడపటివత్సరము. ఆకా

రణమున వీరనగరచారిత్రమున మున్నెన్నఁడునుగనివిని యెఱుంగని మహావైభవముతో నీనౌకావిహారము జరుగుటకుఁ దగిన యేర్పాట్లు జరిగెను.

మధ్యాహ్నము తిరిగితిరుగక మున్నె గంగానదీప్రాక్తీరంబున నిరువదివేలమంది వేడుకఁ జూడవచ్చి మూఁగిరి. వీరనగర మాయొడ్డుననె యున్నది. ఆపురమునందలి పెద్దమనుష్యులందఱును వచ్చి విడియుటకై డేరాలు వేసిరి. రాణివాసజనమునకై జాలరులతో ప్రత్యేకముగ పటకుటీర మొకటి నిర్మాణమయ్యెను.

పదునాఱుపడవ లాయత్తమై యుండెను. అన్నియును దాదాపొక గ్రామమునుండి వచ్చినవి. ఆగ్రామము లన్నియును దేవీపురవీరనగర సంస్థానములలోనివే. ఈపదునాఱు గ్రామములవారును పడవ నడుపుటలోఁ బ్రసిద్ధి వహించినారు. ఏర్పులనెల్ల దీసి యీపడవలనడుపుట కేర్పాటు గావించిరి. పడవలన్నియు నొక్క పొడవుగు. ఒకటియే వెడల్పు. అన్నిఁటికి నిరువదేసిమంది పడవవాండ్రు. ఒక్కొక్క మాలిమికాఁడు. నవకుమారుఁడు తీర్పరి. వివేకమహితుఁడైన యాతఁడు మంచిస్థితిగతులు గలవారి నిద్దఱిని వీరనగరకుటుంబములోనుండి తనకు

సహాయులనుగా నేఱుకొని రెను. నవకుమారుఁడంతి యొద్దనుండి బయలుదేరకమున్న భార్యను గలిసికొని రాణివాసజనమునకుఁగూడఁ జూడవలతి వే ర్పాటైనదని చెప్పివచ్చెను.

"తమయాలోచన మునకును వాత్సల్యమునకు నెంతయు సంతసమగుచున్నది. మేముగూడ నీవ వివాహోత్సవమును జూచియానందింతుము. మనముద్దులపట్టి హేమలత యీపండెములను జూడవలయునని యెంతయో ముచ్చటపడుచున్నయది. బిడ్డ, చిన్నవాఁడు నరేంద్రుఁడు పడవనడపుచుండ గంగానదిలో నౌకావిహారమున నానందించినది."

"కాంతా! నీ వెంతయు బుద్ధికుశలతఁగలిఁగినదానవు. నీవూనినపూన్కినుండి మరలించు వారెవ్వరును లేరు. మనయత్నములన్నియును ఫలించినవి. ఈయుత్సవములు ముగిసినతోడనే మనము మనదేవీపురము జేరుదము. వీరనగర సంస్థాన కార్యనిర్వాహణమునకు సార్వభౌమికప్రతినిధి యొకఁడువచ్చును"

"అట్లయిన నరేంద్రునకు యుక్తవయసు వచ్చుడను మనతోడనే యుండునా?"

"నరేంద్రునకును మనకును సంబంధమేమియును లేదు. ఆతఁడు దేవీపురమున కతిథియై, వచ్చినచో రావచ్చును. అభ్యంతర ముండదు. మనయాతిథ్యము నంగీకరింపఁగోరు గొప్పకుటుంబములోనివారి కెవ్వరి కభ్యంతర ముండును."

భార్యతనలో "ఈపాటి చాలింపుదు. ఆడుదియైనతరువాత కడమది యర్థము జేసుకొనలేకపోదు" అనుకొనియెను.

నవకుమారుఁడు తనలో "ఈమె మిగుల వివేకమహితురాలు పట్టినపట్టునుండి మరల్ప నశక్యము. ఆమె చెప్పినయుపాయమైనను మంచిదిగాదన వలనుపడదు. గోకులదాసు భక్తివిశ్వాస ప్రపూర్ణుఁడగు నాబాల్యసేవకుఁడు. మంత్రతంత్రముల నిరుపమానుఁడు. కానిగుడ్డిగూబకినరశ్మివలె కులగౌరమునిన నాతనికి సైపదు. మానసింహుఁడు కుచ్చిబిహారుకన్యకను పెండ్లియాడఁ దలంచుచున్నాఁడని చెప్పినాఁడు. మానసింహుఁడు వివేకవంతుఁడు. ఆతఁడు తనస్థితిగతుల నెఱుంగనివాఁడు కాఁడు. బంగాళమునందలి యాపెద్ద రాజ్యమువలెనే మనచిన్నసంస్థానముచుగూడ, వివేకము గలిగి యిట్టిసంబంధ బాం

ధవ్యముల నలవరచుకొనెదమేని, గట్టిపఱచుకొనగలము" అనుకొనియెను.

రెండుగడియల ప్రొద్దున్నది. అన్నియు సన్నాహమైనవి. రాణివాసజనమందఱు నలంకరించుకొని శోభాయమానముగ నలంకరించిన డేరాల నలంకరించిరి. మర్యాదస్థులును శ్రీమంతులగు వర్తకులును వెలపొడుగు వస్త్రములుగట్టి పట్టుసెల్లాలును ఓణీలును, ధరియించి నవకుమారుని చుట్టును గూర్చుండిరి. వేడుకఁ జూడమూగినజన మిరువది వేలకు మించియుండును. ఱెప్పవాల్చకుండ పందెపుపడవలవంక గ్రుడ్లు తీసికొని చూచుచుకూర్చుండిరి. ఆపడవ లన్నియును దేశమునఁ బేరుపోసిన వారలే గడపుచుండిరి. వస్త్రవిహీనములై యొప్పునవయవములును విశాలమగు వక్షస్థలములును బటుత్వము గల దేహములును గల యాపడవవాండ్ర యాకారముల జూచినయప్పు డొకవిధమయిన యానంద ముదయింపక మానదు. వారిచేతులనుండు నరము లన్నియు ముక్కుతునకలవలె గట్టివారి యున్నవి.

వీరనగరసంస్థానములోని పడవలకన్నిటికిని ముందుగ నొకపందెము. అందుశీఘ్రగామియగు పడవను

నరేంద్రుఁ డేలుకొనుట అట్టిపందెమే దేవీపురనౌకల కును. శిరీషుఁ డందు శీఘ్రగామి యగుదాని నొక్కటి నేలుకొనవలయు. కడపటిపందె మీయేఱ్పులు రెంటి కిని. అందులకు తీర్పరి నవకుమారుఁడు ఇట్లు నవకుమారుఁడు నిశ్చయించెను. ఈయేర్పాటు సర్వజనప్రశంసనీయమై యొప్పెను. శిరీషునకు సహజముగ నుండు శాంతౌత్సుక్యంబులతోడ నాతఁడం దులకంగీకరించెను. నరేంద్రునకు సహజమగు నుద్రేకభావంబుతో నతఁడును నందులకొడంబడెను.

ముందు దేవీపురనౌకలు వడివడిగఁ బోయినవి. పందెపుదూర మరక్రోసు. పడవలు నీటివడిని వాలురావలెను. నవకుమారున కెట్టయెదురుగ గమ్యస్థానము శిరీషుఁడును నరేంద్రుడును గూడ నవకుమారుని కిరుప్రక్కలఁ గూర్చుండిరి. పందెములు ప్రారంభము లైనవి. నరేంద్రునకుఁ గలిగిన సంతోషోద్రేకమునకు మేరలేకయుండెను.

దేవీపురపు పడవలు మిక్కిలి దర్శనీయములై యొప్పుచుండెను. అరక్రోసు దూరమున బయలుదేరుటచే సామాన్యపు చూపానుటలేదు దగ్గఱగవచ్చినకొలది

నల్లచుక్కలవలెఁ గనబడసాగినవి. దూరముగ్గ వినఁబడు తెడ్లచప్పుడును పడవవాండ్ర పోటుపాటలును, నీటివాలునవచ్చిచెవులం బడుచుండెను. ఇంకనుగొంచెము దగ్గఱకు వచ్చెడుసరికా పడవలు పొడుగుపాటికాళ్లు చాచుకొని జలములఁ జిమ్ముకొనివచ్చెడు కీటకముల వలె నగపడియెను. పిమ్మట పడవలజండాలు స్పష్టముగఁ గాన్పింపఁజొచ్చెను. కోలదెబ్బలచే సలిలము చిందుచుండెను. పడవవాండ్రు బందుపాటలఁ బాడుచుండిరి పడవలనిమిదియును వచ్చిపడియెను. చూపరులంద ఱొక్కసారిగ లేచి నిలువఁబడిరి, ఆజనసమ్మర్దమునఁ బడవల కోలాహలమును మిన్నంటెను. పడవలు సమీపించినకొలఁది చెవులుచిల్లులువోయెడునట్లు ఆసమ్మర్దము జయజయశబ్దముగాఁ బరిణమించెను. మొదటిపడవ గమ్యస్థానమును మెఱుపుతీఁగ వేగమున వచ్చిచేరెను నవకుమారుఁడు తన యాస్థానమునుండి లేచి సంతోషపూర్వకముగ విజయులకు వచనపారితోషికముల నొసంగెను. ఆపడవ మాలిమిశానిఁ గనుంగొనునప్పటికి ఆతఁడు దేవీపురసంస్థానమునందు భక్తివిశ్వాసములుగల సేవకుఁడై కన్పట్టెను. ఆతనిజేరాలో నానందకలకల ముదయమయ్యెను. రాణి

వాసజనముందు తెరమఱుగునుండి స్తోత్రభాషణములట్టి హాసముగ బయలు దేఱెను.

అనుగ్రహపూర్వకంబగు చిఱునగవుతో నవకుమారుఁడు, "నీవు భక్తివిశ్వాసములుగల సేవకుఁడవు. నీ భుజములు మాంసలములు. నేను దేవీపురమునుండివచ్చినప్పటి బలమును నైపుణ్యమును నిప్పటికిని వర్ధిల్లుచున్నవి." అనియెను,

"ప్రభువువారిసందర్శనము చేయుటయే మాకు జయముచేకూఱుట" అని య్యామాలిమికాఁడు ప్రత్యుత్తరమొసంగెను. హిందూదేశమునందలి కడజాతివానికిఁగూడ నిట్టి వినయలక్షణములును మర్యాదాసౌశీల్యములును స్వతస్సిద్ధముగ నొప్పియుండును.

"అవును నిశ్చయముగ నీవు గెలుపొందుదువనియే నమ్మియుంటిని. నీనైపుణ్యమును నేను యుక్తముగ గ్రహించితిని. ఇూపణ మీదినమున వీరనగరమునకుఁ బోవనేరదు. మనవయస్యుండగు కుమారశిరీషునొద్దకుఁ బొమ్ము. ఆఁతడు మొదటవచ్చిన పడవయొద్దియో లెక్కపెట్టును.

శిరీషుఁడు గెలుపుపడవను బెట్టనఁబోయెను. అదిగాంచినతోడనే నరేంద్రుని ముఖము ముడుచుకొని



పోయెను. నవకుమారుఁడు ఓర్పుపెద్దగదా! దేవీపురపు పడవవాండ్రయందభిమానము వహించి బహుమానమునీకేవచ్చునని వాగ్దానముచేయుట న్యాయమా ? వీరనగరము పడవలు బయలుదేరినవ"ని యొక శబ్దము విన్నంటి వినఁబడియెను. నరేంద్రుఁ డా యుద్రేకముచే కూర్చుండినచోటనుండి లేచి యొడ్డునకుఱికెను.

కోలచిందులును, పడవవాండ్రపాటలను బిగ్గరబిగ్గరగవినవచ్చుచుండెను. నైఋత్యంబుగనున్న యానదిగర్భంబునంబడి యింపుసొంపారు నాపడవలు పరుగుపరుగున వచ్చుచు దృష్టిపథంబునం బడియెను. పడవలన్నియుగమ్యస్థానమునకు వచ్చుసరికి గెలుపు పూర్వపుపక్షంబున లేనట్లు కనిపెట్టిరి. మొదట మూఁడు దేవీపుర నౌకలునుగొంచెమించుమించుగ నొక్కసారిఒక్కొక్కపడవ యొడముగవచ్చి వ్రాలెను. కాని వీరనగరపు పడవలలో నొకటి అన్నిఁటికంటె ముందుగా బాణవేగంబున వచ్చుచుండెను. తనకభిమానముగనుండు నీపడవరాకఁ గనుట తోడనే నరేంద్రునకు సంతోషము దేకమయ్యెను. ఒడలు పరవశమై కేకలు వేయసాగెను. ఇంతవఱకును మౌనముద్రులైకనిపెట్టుకొనియున్న వీరనగర కుటుంబమువా

రి పూర్వ పరివారమంతయు నప్పుడొక్కసారిగ జయ జయధ్వానములుసాగించిరి. ఆశబ్దము నవకుమారునకుఁగూడ పెట్టుపుట్టించెను. దేవీపురజనముకూడఁ బ్రత్యుత్తరముగఁ జప్పట్లుచఱచిరి. ఉభయపక్షంబులకును సంకుల సమరంబు సంప్రాప్తమయ్యెడు నట్లైనది. అంత వృద్ధుండగు గోకులదాసు లేచి సంజ్ఞచేసెను. సద్దంతయు నణగిపోయెను.

అక్కడ జేరినవారందఱునుగూడ వీరనగరము వారి మొదటిపడవతోఁ దుల్యమైనది పందెపుపడవలోఁ లేనే లేదని కనిపెట్టిరి. నరేంద్రుడందులకుఁ గనిపెట్టియున్నవాఁడగుటచే నాతని కన్నులనుండి యాసన్నవిజయ శబ్దములు ప్రకటమగుచుండెను.

ఒక్కగడియ క్రిందటివఱకు మిక్కిలి సుముఖమై దరస్మితమనోహరంబై యలరారు నవకుమారుని మొగ మిప్పుడు ముడుచుకొనిపోయెను. కాని గోకులదాసు యథాశాంతమునఁ బలుకఁ జొచ్చెను.

“వీరనగర వంశనాయకుండు తన పితృసంస్థానంబునందలి యతిగామియగుపడవను పేర్కొను గాక! మన పందెపు నిబంధనలనుపట్టి యాపడవ ప్రత్యేకముగవీర నగరస్థానమువారలే నడుపవలయును”



ఆపరిదేశమంతయును దుర్లక్షితంబై, యెవ్వరినో టను మాట లేకుండనుండెను. ఈ కడపటి వాక్యమున కర్థమెవ్వరికిని బోధకట్టినది కాదు నరేంద్రుఁడు వికారో ద్రేకంబున కంపమానకాయుఁడై "గోకులా! నీప్రతి బంధవాక్యమేమియో నాకర్థముకాలేదు" అనియెను.

గోకులదాసు శాంతముతో "మొదటవీరనగరనా యకయందలి పడవవాండ్రండఱును వీరనగరవాసులుకారు. నేను పెద్దవాఁడను. నా కన్నులకట్లు కనుపించినది." అనెను.

నరేంద్రుఁడది యబద్ధమని కేకలువేసెను. తనచెలి కాఁడగు శిరీషుఁడు లేచి గోకులునిపజ్జ నిలువఁబడగానే నరేంద్రుఁడు తన యుద్రేకమును కొంచెమాఁపుకొని "శిరీషా! నీవును పడుచువాఁడవు. నీకన్నులకెట్లుకనుపిం చెనో యథార్థము తెలుపుము. మొదటిపడవవాండ్రం డఱును నేనును నీవునుకూడ నెఱుఁగుదుము. వారంద ఱును వీరనగవాసులు. నీవేమనియెదవు?"

శిరీషుఁడు శాంతముతో "వీరనగరనాయకుండు వచించినది యథార్థమె. అందలి పడవవాండ్రందఱును వీరనగరనివాసులనుమాట నిజమె. ఒక్కమాలిమికాని మాటమాత్రము సందేహముగానున్నది."

అంత మఱికొంతసేపు శబ్దరాహిత్యముగ నుండెను. అచ్చటనున్నవారిని తెలిసికొనిరి. ఆచుక్కాని వాని తండ్రి రాజమహాలుపడవ నడుపువాఁడు. ఆకాలమునం దీమాలిమి కాఁడక్కడజనస మొందెను. కానియాతఁడు వీరనగరమునం దే పనిచేయుచు నచ్చటనే కాలముపుచ్చుచుండెను ఆతఁడు నరేంద్రునకు నచ్చినబంటు.

నరేంద్రుఁడు నవకుమారుని పలుకరించి చప్పట్లు చఱచుచు వయస్సునకును ఉన్నతికిని చూపఁదగినమర్యాదనెచూపి "మీరుతీర్పుపెద్దలు. ఆతఁడు వీరనగరమువాఁడు కాఁడేమో చెప్పుడు" అని ప్రశ్నించెను.

నరేంద్రుని ఫాలతలమున కోపచిహ్నము లావహించెను. పెదవులదరెను. అనంగీకారభావ మశుభలక్షణలక్షితంబై యాతని పూర్వపరివారము నుండి వినన య్యెను. మరలనల్లరిజరుగునట్లు కన్పట్టెను. అంతశిరీషుఁడు తనవయస్యునిచెంతకరిగి యాతనిచెవిలో—

"నరేంద్రా! ఇపుడు కలహమును పెంపకుము. నీస్నేహితులును బరివారమును తక్కువగ నున్నవి. ఎదిరిబలమెచ్చుగ నున్నయది. నామాటయందు గౌరవముంచి, హేమలత యెడ గౌరవముంచి, నీకోపమునాఁపు

కొనుము. పురుషలక్షణము గనఁబఱపుము. అదిగో! చూచుము! హేమలత నీవైపున కెట్లు సంచరించుచుఁ జూచుచున్నదో ”

అని చెప్పునంతట నరేంద్రుఁడుఁ కోపమును మరలించుకొని యొక్క నిముసము మౌనము వహించియూరకుండెను. అంతనాతనికొక యూహ జనించెను అంత వీరనగరనాణెంలోని చుక్కాని కురికి చేతఁబట్టెను. “నేను వీరనగరనివాసుఁడనే యనుకొని మెదను ఏమని యెదరు ఈవడవ చుక్కాని నేనెస్వయముగా కానెదను. వీరనగర దేవీపుర తారతమ్యముల దేవీపుర ప్రభువు విమర్శించుగాక !

అందఱును వ్యాపారమిట్లువెకరి నడుచుటజూచి యుద్భ్రాంతమానసులైరి. దేవీపురనివాసు లందఱును వీరనగరసంస్థానాధిపతి స్వయముగఁ గర్ణధారకుఁడగుటకు సమ్మతింపక తమయనంగీకారభావమును వెల్లడించిరి. నవకుమారుఁడును వలదని శాసింపఁజూచెను. ఇంతలో దూరదృష్టిగలనోకులుఁ డడ్డమువచ్చి “మనవం దెపు నిబంధనలనుబట్టి యిట్టి జమీందారుఁడు స్వయముగ మాలిమికాఁడు కారాదు. అయినను ప్రభువారు

వీరనగర కుమారప్రభుని కోర్కెను చెల్లింప ననుగ్రహింతురుగాక దేవీపురకర్ణధారుఁడనాగరికుఁడు. అతనితోడ రాజు స్వయముగఁ బందెములకు డీకొనుట సమంజసము కాదు. కావున ప్రభువువారుకూడ దేవీపురపు పడవలో నాసీనులయ్యెదరుగాక దేవీనగరరాజ్ఞియు నామెకుమారీ తిలకంబును విమర్శకులయ్యెదరు".

ఈప్రోక్తయేర్పాటు వినఁబడినతోడనే యొక్కింత విరతికలిగెను. తనమంత్రి తనతోడ యోచింపకుండ చేసి యిట్టిస్వచ్ఛందయోచన నేవకుమారునకుఁ గూడ నసమ్మతంబుగనె యుండెను. కాని గోకులదాసు "దేవా! నామాటనమ్ముఁడు. నన్ను మన్నింపుఁడు. దేవీనగరవిజయమాసన్నమై యున్నది." అని రహస్యముగఁ బ్రబోధించెను.

వీరనగరజనులలో వివేకవంతులందఱును తలలాడించిరి. కాని వారిమాట లక్ష్యముసేయక నరేంద్రుఁడు సంతోషపూర్వకముగ నంగీకరించెను. వారియుపవారణ మించుకంతయును బలికివచ్చినదికాదు. తానుపడవనడుపుట; హేమలత తీర్పరియగుట: ఇంతకంటెను గావలసిన దేమి? ఇదియే యాతనిజన్మమున కెల్లశివరాత్రి. ఒక్కని

మిషమునకుమున్ను మనస్సును గ్రమ్మియున్న యాగ్రహమంతయును నదృశ్యమయ్యెను. మొగమున సంతోషమావేశించెను గోకులదాసుని కృతజ్ఞతాపూర్వకముగ ప్రశంసించి నమస్కరించెను. సాదరపూర్వకంబుగ నవకుమారుని గొనివచ్చి దేవీస్వరనౌకలోఁ గూర్చుండఁజేసెను అంత తీవ్రముగ రాణీవాసనివాసంబువంక తనవీక్షణంబుల బఱపెను. ఆతనిమానసము పరిమితానందమున మునిఁగి తేలెను.

శిరీషుఁడాతనిఁ జేరఁజీరి "తొందరపడకుము." సలిలము గాఢము. నీటివడి విశేషముగ నున్నది. ఈరెండు వంశములవారి జీవనాధారములు పడవలమీఁద నున్నయవి. నరేంద్రా! భద్రము, బహుభద్రము సుమా!,, యని ప్రబోధించెను. ఈబోధ యించుకంతయును నరేంద్రునిమనస్సున కెక్కదయ్యెను. ఆతని హృదయమును తన్నిరీక్షణములును అన్యత్రపని చేయుచుండెను.

ఇతరదేశములందువలెఁగాక మన దేశమున సూర్యాస్తమయమైన కొలఁదిసేపటిలోపలనే రాత్రియగును. సంధ్యావకాశము విశేషముగ నుండదు. పడవలు రెండును నీటికెదురుగ తల్లిమేరకు లాగుకొనిపోమొడుసరికి స్వచ్ఛముగ శరచ్చంద్రికలు గంగాసలిలముల నటన

ము నేయుచుండెను. ఆ రెండు పడవల జండాలును వాని కలంకరించియున్న పూలమాలికలును, ఆపండు వెన్నెల లో తళతళ మెఱయుచుండెను. ప్రాచీనవంశ ప్రతిష్ఠగల రెండు రాజకుటుంబములకును, నేడు పందెము పడినది. జనులందఱు నాత్రుతతోఁ బర్యవసానమును జూడవలెన ని చెవులు నిక్కబెట్టుకొని, కొంగలవలె మెడలు వంచు కొని, చూచుచుండిరి.

పడవలు రెండును బయలుదేఱుట సూచించుచు గుండుదెబ్బ వినఁబడినది. ఆవెంటనే ప్రమాణవిరహిత ముగ బయలువెడలుచున్న తెడ్ల చప్పుడును, తెడ్లవాం డ్రి బిగ్గరగఁ బాడుపాటలును గాలివింకమున వచ్చిచెవు లంబడుచుండెను. పడవలు రెండును కన్నులకగపడు సరి కి రెండును నొకదానికొకటి తీసిపోవకుండ సరాసరిగ వ చ్చుచున్నవి. పడవవాండ్రు, తమ ప్రభువులందుండి స్వా మ్యముగఁ తమశక్తిసామర్థ్యములఁ బరీక్షించుటచే నత్యు త్సాహముజెంది, మనస్ఫూర్తిగ సత్తువకొలఁది కోలలు లాగుచుండిరి. పడవపై నడయాడుజండాలు విద్యుద్వేగ మున నీటిపై పోవుచున్నట్టు కన్పట్టుచుండెను. జనులంద ఱు నైకకంఠ్యముగ "దగ్గఱకువచ్చినది. ఇంక నెంతో దూరములేదు." అని చాటుచుండిరి.



పటికిఁ బశ్చిమముగా నొకచిన్నమలపున్నది. వీర నగరపుపడవ పశ్చిమదిక్కుగా నడచుచున్నది. అందువల్ల దానికి నడకవీలు హెచ్చుగా నుండెను. పైగా వీరనగరపు పడవవాండ్రెక్కువ బలమైనవాండ్రు. ఆకారణమున నాపడవ శీఘ్రముగ ముందుకుఁద్రోసికొనివచ్చెను. నరేంద్రుఁడు సంతోషము పట్టఁజాలకుండెను. అతనిపడవ ముందుఁబోవుచున్నది.

నవకుమారుని మొగమునఁ గోపమంకురించినది. ఆచిహ్నములను పడవవాండ్రు కనిపెట్టిరి. లోపల సణుగుకొనుచుండెను. అది వారికి వినిపించెను. ఇది తెలిసికొని వారు పట్టుపట్టి బలముగ తెడ్లను లాగిరి. వీరనగర నౌకను సమీపించిరి.

నరేంద్రుని జనముకూడ నవకుమారుని కోపవచనముల నాలకించిరి. వారితెడ్లువ్రేత మందగించెను. "నవకుమారుఁడు స్వయముగ దేవీపురపు పడవమీఁదనుండఁగా వీరనగరమువాండ్రు తెగించి యాతనికి గెలుపులేకుండఁ జేయఁగలరా" యని గట్టుమీఁదనున్నవాండ్రందఱు రహస్యముగ ననుకొన మొదలుపెట్టిరి. ప్రప్రథమమున దూరదృష్టిగల గోకులదా సాలోచించినదియు నది

యే. అది మనస్సున నుంచుకొనియే నవకుమారుని పడవ యెక్కించెను.

నరేంద్రుఁడు రెండవ పడవ తననుమించిపోవు చుండుట కనిపెట్టెను. ఆతనికికోపము ద్రేకించి వచ్చుచుండెను. పడవవాండ్రపై కేకలు వేయుచుండెను. ఇంకను తనపడవయొక్క పడవదూరమున ముందుగనే పోవుచుండెను. ఇక్కడ నేటికిఁ దూర్పుగా మలపున్నది. అందువలన దేవీపురపు పడవకు వీలుదొరకినది. శీఘ్రముగ నది సమీపముగ వచ్చెను. నరేంద్రుఁడు దేవీపురపుపడవకుఁ జిక్కిన యావీలును తగ్గింప నెంచెను. తనపడవను దేవీపురపుపడవకు దగ్గఱగానడపెను.

"భద్రము. భద్రము!" అని యొక్కమ్మడి కేకలనేకముగ వినఁబడియెను. ఏమియును లాభములేకపోయెను. అప్పటికప్పుడే కార్యము మిగిలిపోయెను. రెండు పడవలును విరంగిగుండ్లవలె దాకొనియెను. రెండును నీళ్లలో మునిఁగిపోయెను. ఈపనియంతయును గమ్యస్థాన స్తంభమున కతిసామీప్యముననే జరిగినది. అక్కడఁ జేరినవారందఱెంతయో గల్లంతుచేసిరి. ఆఁడువాండ్ర దేరాలోనుండి యేడ్పులు వినిపించెను. వందలకొలఁది జనులే

టియొద్దన కలిసిరి. అంతయును గల్లోలమై చీకాకుపడి యెను.

పడవవాండ్రందఱును సుకరముగ నీదుకొనవచ్చిరి. నరేంద్రుఁడుగూడ మంచియీఁతకాఁడు అతఁడును గట్టుచేరెను. చేరిచేరునంతలో, నవకుమారుని పరివార మంతయును వచ్చిచుట్టవేసెను. నరేంద్రునిపరివారము తక్కువగనున్నది. వారును వీరును దలపడిరి. నరేంద్రుని జనము చేతనున్న యాయుధముల నూడఁదీసికొనిరి. అతడు తడిసి ముద్దయై వడఁకుచు దిగులుచెంది ఖైదీవలెఁ గూర్చుండియుండెను.

ఆతనిబుద్ధియుఁ గుశాగ్రమైనదియే. ఇది యంతయును దనకొంచెతనమువలన వచ్చినదియేగదా యని సూక్ష్మముగ గ్రహించెను. పిచ్చితొందర. ఆతొందర వలననే దేవీపురనాయకుఁడు మరణించెను. విశ్వాసపాత్రులగు నాతనిసంగడికాండ్రును పరివారజనమును నాశనమైరి. తనతాతగారిసంస్థానమును బోఁగొట్టుకొనియెను. నేరస్థునకిఁక రాజ్యముండునా? ఆతని దృష్టి రాణివాసజనముండుడేరావైపున కరిగినది. ఆతనికంటినుండి వేఁడికన్నీరు దిగజారెను. ఆతనికిని జిన్నప్పటినుండి ప్రాణతు

ల్యముగాఁ జూచుకొనుచున్న యాతనిబహిఃప్రాణమున
కును నేఁటితోడ వియోగ మవిలంఘ్యమైనది. శత్రువు
లెవ్వరును బొందింపఁజాలని పెద్దబాధ యొకటిమనస్సు
ను కోసివెట్టుచుండెను. ఏమియును మాటలాడక లో
లోనదిగమ్రింగి యారాకుమారుఁడు కూర్చుండి యుండె
ను. అంతఃపరితాపమువలన బాష్పకణములు ముఖము
నుండి దిగజారి కాలువలు గట్టుచుండెను. ఇదివఱ కెన్నఁ
డు నట్టిదాతనికడ కనివిని యెఱుంగరు. కాని యొక్క
నిమిషమున నాతని మనోభయములన్నియు నదృశ్యము
లయ్యెను. అట్టిసర్వకల్లోలసమయంబున శిరీషుఁడొక్కఁ
డు ప్రశాంతుఁడై నిబ్బరముగ నుండెను. అతఁడు నవ
కుమారుని పడవ యెచ్చటమునిఁగెనో గుఱితప్పక కని
పెట్టెను. ఆముదుసలి యసహాయుఁడై జలములఁ గొట్టు
కొనుచుండుట చూచెను. వీరనగరమున నతనితో సమ
ముగ నీదువారు లేరు. ఏటిలో గుబాలున దుమికెను.
నాలుగుబారలలోఁ బలమగు ప్రవాహము నుత్తరించి
మునుఁగుచు మునుఁగుచున్న మనుష్యుని వచ్చి పట్టుకొ
నియెను. ఇంకొక్కనిమిష మెడమైన నన్నియు నైపో
యెడివే. ఒక్క చేతితో నడుముపట్టా పట్టికొనియెను.

రెండవచేతితో గట్టున కీడ్చుకొని వచ్చుచుండెను. తన చేతనున్న యామూల్యచైతన్యము నెట్టకేలకు గట్టునకుఁ జేర్చెను.

నవకుమారుఁడు డేరాలోనికిఁ జేరినతోడనే మనస్సున దిగులొంది కూర్చుండియున్న నరేంద్రునిగాంచెను. సిపాయీలాగ్రహోదగ్రులై యాతని చుట్టుముట్టియుండిరి. ఏనిమిషమున కానిమిష మేదోదారుణము జరిగించునటుల భయపెట్టుచుండిరి

నవకుమారుఁడు గర్జారావముతో "వెనుకకుఁ బొండు" అని కేకవేయునప్పటికి సిపాయిలందఱు నెక్కడివారక్కడకు డేరాలోనుండి యొత్తిగిలిపోయిరి. నవకుమారుఁడు కోపఘూర్ణితకంఠస్వరంబునను నదీసలిల విస్రస్తదేహపాటవంబునను, "నరేంద్రా! నిన్ను చిన్ననాటనుండియుఁ బెంచి పెద్దనుచేసితిని నీతండ్రితాతలసంస్థానమును మరల నీకొప్పగింపఁ దలఁచితిని. నీకు సంరక్షకుండును, బ్రాణమిత్రుండును, శ్రేయోదాయకుండు నగు వానిప్రాణములను దీయ సమకట్టితివి; అనియెను.

ఆనయమ్ముం డత్యంతపశ్చాత్తాపంబుతో "నవకుమారా! అపరాధంబులనెల్ల మేటియగు మహాపరా

ఖంబుఁ గావించితిని. ఇంక నాజీవనంబు నిలుప నర్హం బుకాదు. నిలుచున్నపాళెముగ నన్నువధింపుడు. అని యుత్తరమిచ్చెను.

డేరాలోనున్న చాంద్రంద్రందఱు నిశ్శబ్దముగ వినుచుండిరి. ఎవ్వరునేమియు ననఁజాలరైరి. శిరీషుఁ డొక్కఁడుమాత్ర మిట్లు పలుక సాహసించెను.

“అయ్యా! సెలవయ్యేనేని యొక్కమనవియున్నది. అనుగ్రహింపవలయును. నరేంద్రుని నాకన్నమిన్నగ నన్యులెఱుంగరు. ఆతఁడు దుడుకువాఁడు, ముందువెనుక లాలోచించువాఁడు కాఁడు. ఉద్రేకంబున నున్నయప్పుడున్మాదవశుండై యుండు. అంతియకాని వయోవృద్ధుఁడగు నీపూజ్యున కీషత్తయిన నపకారము తలపెట్టియుండుననఁ జెల్లదు. అవశాత్సంభవంబగు నీయాపద యాతని తొందరపాటువలనఁ గలిగినదగును అందుల కాతఁ డాగ్రహపాత్రుండుగాక తప్పదు. అంతియెకాని యాతండు మఱియేనేరమును దలంచినవాఁడు కాఁడు. ఆతండు నిరపరాధి.”

అంత నందఱు నిశ్శబ్దముగనుండిరి. నవకుమారుఁ డెట్టకేలకుఁ బట్టుపట్టి రెండుమూఁడు వాక్యములనాడెను.

"బంగాళా రాష్ట్రాధినాథు డీనరేంద్రుని ప్రవర్త నమును విమర్శింపఁ గలఁడు. కొలఁదిరోజులలోపలనే యాతనిది దుడుకుతనమో మరి హంతకారిత్వమో తేటపడఁగలదు. అంతపర్యంత మీతని సురక్షితముగనుంచుట కర్తవ్యము. ఈతఁడంతవఱకు రక్షకాధీనుండై యుండు" అని మృదుల స్వనంబున "శిరీషా! రమ్ము, రమ్ము. ఈవృద్ధుడుతడిగుడ్డలతో విశేషకాలము నానలేఁడు. ఈతనిని తగుజాగ్రత్త బుచ్చుకొనుము. నీపరిచర్య యీతని కాంక్షించుక కావలసియుండు అందునకుఁ దగిన ప్రత్యుపకారమునాతఁడు చేయలేకపోఁడు. నరేంద్రుఁ డీదినమున నాప్రాణములను దీయఁదలచినాఁడు. నీవు దానిని కాపాడినాఁడవు." అని నవకుమారుఁడు పలికెను.

---

## ఎనిమిదవప్రకరణము.

—:o:—

### సాంకేతికము.

మాసము రోజులు గడచినవి. నరేంద్రుఁడింకను రక్షకభటాధీనమునందే యుంచినాఁడు విజ్ఞనలంబాక్ష టీకట్టుదిట్టముగ నుండునట్టిది యాతనికొసంగఁబడి యెను.

ఆతనిదర్జాకుఁ దగినసదుపాయము లన్నియు జరగుచునే యున్నవి. కాని యిచ్ఛానుసారముగఁ బ్రవర్తింప వలను పడదు. ఆతనితోడ నెవ్వరును మాటలాడకుండఁ గట్టు దిట్టమయ్యెను. ఆయుధపాణులగు రక్షకభటులు బలముగ నాతనిపై కాపువేసిరి. దీనికంతకును గారణమువీర నగరజనము తిరుగఁబడి రాజకుమార నాయకుని విడిపించుకొని పోవుదురేమో యనుభయము దానికై కొన్ని ప్రయత్నములు జరిగినవి. ఈకారాగృహంబు చుట్టును అల్లరులుకూడ కొన్నిజరిగినవి. అన్నియు వ్యర్థములయ్యెను. ఆకుమారనాయకునకు పనిపాటలు లేక మాటపలుకు నాడువారు లేక హృదయము కృశించిపోవుచుండెను. దేహమంతయును పాలిపోయిశుష్కించెను. మొగమంతయును నాలోచనాధీన మైనట్లుకన్పట్టెను. దానిచుట్టుపట్టులనున్న శృంగారవనము లన్నియును గంటఁబడు నప్పటికి పూర్వముచ్చటఁ దానుగడపినసుఖజీవనంబుతలంపునఁ బారి కిటికీలవెంట నదేపనిగ నావైపులకు జూచుచుండెను. ఆమందిరారామము వంకఁ జూడగఁ జూడగఁ గన్నులు చీకట్లుగ్రమ్ముచుండును. ఆయింటఁ గిటికీవెనుక గుడ్డిదీప మొకటి యుండెడిది. ఆదీపముపోకుండఁ గాపా

డుకొనుచు రాత్రిచాల|పొద్దుపోయెడువఱకును మేలుకొ నియుండెడివాడు. ఆదీప మారిపోయెడిది. అంధకా రమః స్వభావసిద్ధమగు నిశాంధకారముకన్న దళము గనుండెను.

ఎట్టకేలకు మానసింహరాజా రాజామహలునకు వచ్చినట్లును, అతఁడు కొలఁదిరోజులలోవీరనగరము సం దర్శింప నెంచినట్లును వర్తమానము వచ్చినది. ఆచిన్న పట్టణమునం దాతనికిఁ దగినమర్యాదలు జరుగుటకై గొ ప్పగొప్ప సన్నాహములు జరిగెను వీధులన్నియు శుభ్ర పఱిపించి నీళ్ళుచల్లించి ధనురాకారముగఁ దడక లలంక రించి మార్గములపొడుగునను కదళీస్తంభములు బారులు తీర్చి కట్టిరి. చెట్లకింద జలకలశములపైఁ బత్రముల నా చ్ఛాదించి యుంచిరి. ఇదియాదేశమునం దాచారము. బంగాళాదేశ పాలకుని జూచు వేడుకను పల్లెలనుండి జను లు వేనవేలు వచ్చివిడిచిరి. మానసింహుఁడు ఏనుగుమీఁద నంబారికట్టించి యందుఁ దానధిరోహించె. రాజపుత్రి భటులును మొగలాయీబలమును వెంటవచ్చుచుండెను. నగరప్రవేశము సేయుటతోడనే సంగీతపాటలునుత్సవ ములునునతివైభవముతోడ జరపిరి. వీధులవెంటఁ బిల్లలు

రాజునకు స్వాగతమొసంగుచు పాటలుపాడిరి. ఐదువలు మేడలపైనుండిలాజలును అక్షతలును జల్లుచుండిరి. ఆతఁడునూఱుయుద్ధముల గెలిచినవాఁడు అగ్బరుచక్రవర్తికడ నత్యంతసమర్థుండగు పరిపాలకుఁడు. ఆతఁడు పురప్రవేశము సేయునప్పటి వైభవములకుఁ గొదువయేమియుండును? ఫిరంగులఁ బేల్చిరి. కృతజ్ఞులగు జనులందఱును బరాబరులు తెల్పిరి. ఆతనిచుట్టివచ్చు యోధులు మహావీరులు చూడసొంపైనవాండ్రు వదన సౌందర్యంబును నయనసౌభాగ్యంబును గలిగి శోభిల్లు చెలువలెందఱో కుతూహలులైగవాక్షముల చెంత నిలువఁబడితొంగి తొంగిచూచుచుండిరి.

కొన్ని దినములవఱకును బనియేమియును జరుగలేదు. కాలమంతయు నుత్సవములక్రిందనే సరిపోవుచుండెను. రసపుత్రజనము నందలి యుద్యోగస్థులందఱును బజారులవెంటను వీధులవెంటను నూరేగుచుండిరి. మొగలాయీ యోధులు గడ్డములను బెంచుకొని పట్టువస్త్రములు ధరించి షోకుగా సంచరించుచుండిరి. దూరదేశముల విడిచివచ్చిన తమ ప్రియాంగనల కనుపమానమైన సక్కా-మజిలీనులు వెలసేయుచుండిరి.

ఉండియుండి యొకనాటి యుదయమున చక్రి
ర్తి గారి హుకుము ప్రకటనచేయించిరి. శీతకాలము.
కాశము మేఘరాహిత్యమై నీలవర్ణమున నొప్పుచుండెన
వాయుప్రచారము మందగించి యున్నది. భాస్కరుఁ
తనబంగారు కిరణముల నాపట్టణమున వాడవాడలవెంట
ప్రసరింపఁ జేయుచుండెను. రాజమందిరము నెదు
మోటజనులు వేనవేలు కలసియుండిరి. ఆమందిరము
డాబాపై మానసింహరాజు సింహాసనాసీనుండయ్యె
సామ్రాజ్యమునందలి పెద్దపెద్ద యుద్యోగస్థులందఱు
నాతని చుట్టునుండి బరాబరులు సేయుచుండిరి. అతిథి
యముతో నవకుమారుఁడును గోకులదాసును వారివె
క నొదిగియుండిరి.

సైన్యములన్నియును సత్వరముగ వెడలిపోఁ
ను. మానసింహుఁడు హిందూదేశమున దిగ్విజయ
చేసినపు డాతని వశమునకుండు రాజపుత్రులును, మొ
లాయీలును, మిక్కిలి దర్పముగఁ బనిచేసి వారి సేనా
కిఁ బేరుతెచ్చిరి. కొంతవఱకు మల్లక్రీడలు జరిగెన
కొండొకసేపు పన్నిదములు చఱచిన ఖుస్తీలు నడిచెన
జనసమూహంబున కత్యానందముగ నుండెను. మా

సింహుఁడు "సిపాయీలు తమతమ విడిదలకుఁ బోవ
చ్చును. ఈ యుదయమునం దింకను జరుగవలసినదిచా
లనున్నది. అని యెను.

నవకుమారుడు "పరాక్రమధౌరేయా! దేవర
వారియాజ్ఞ శిరసావహించుచున్నారము. ఈవంగదేశ
ముండొసంగిన యీయల్పసన్మానంబుల హృదయపూ
ర్వకంబుగ నాదరించి దేవరవారు స్వయముగ నిచ్చుట
కు దయచేసి యీనగరంబును పావనంబు జేసితిరి. అ
దియె, భాగ్యంబు. ఈసార్వభౌమికనియంతల నిట్టివినోద
ముల నింకను గొంతదనుక కాలక్షేపము సేయింపఁ గు
తూహలంబుగ నుండియున్నది. మాదేశ కవిత్వమునకు
సంగీతమునకుఁ బేరుచెందినది. దేవరవారి కభిమతమ
య్యేనేని నాటకుఁడొకఁడు పద్యములఁ జదువ సంసిద్ధు
డై యున్నవాఁడు." అనియెను.

"నవకుమారా! నీమాటయేదియుఁ ద్రోసివేయ
జాలము నీవీమహాచక్రవర్తియెడ నతిభక్తితాత్పర్యము
లుగల ప్రజాశిఖామణివి. తోడరుమల్లురాజా నీపై నుంచి
పోయిన భారమును గడువిశ్వాసపూర్వకంబుగ నెఱవేర్చి
తివి. మేము సలలితంబగు మీభాషామార్దవం బింతయు

నెఱుంగము. అయినను సుగమంబుగనుండు మీపాట
ను వినసొంపుగనుండు మీపద్యములును మాకించు
బోధయగునని తలంచెదము. పద్యములు చదువుదు
ము. విందము"

నవకుమారుఁడు "ఆతఁడు కవియనిచెప్పుకొనఁ
గినవాఁడు కాఁడు. ఆతఁడు తనస్వస్థానమగు బర్ద్వాను
శమును విడిచి బంకురాదేశపు టరణ్యములఁ బ్రవాస
తుండై యున్నవాడు. కాని యాతని హృదయమునం
ట్లొ చండికాదేవి ప్రవేశించినది. అనుగ్రహాకల్పవల్లిఁ
గు నాతల్లినిగూర్చి యాతఁడు గానము సేయును
అనిరెను.

కవి చండికాదేవినిగూర్చి, స్థలసంచారులును,
లసంచారులునగు మనుష్యులందరిమీఁద నామెచూపు
నుగ్రహములను వర్ణించిపాడెను. వంగదేశమునుండి స
మళద్రవ్యములను తదితరములగు సరకులను గైకొని
ముద్రప్రాయాణము సేయుచున్న వర్తకుఁడొకఁడు సమ
ద్రమధ్యమున నోడపగిలిసింహళద్వీపమునందెట్లు నిబద్ధు
డై యుండెనో, యాతనికొమరుండు చిఱుతప్రాయమువ
వాఁడు పెద్దదైయె తనతల్లివలన తనతండ్రినిగూర్చి యెట్ల

లకించెనో, ఆతని యౌవనహృదయము వాత్సల్యసంపూర్ణంబై యెట్టు లాతనివిడిపింప సముద్రయానము చేసి పోయెనో, సాహసికుండగు నాకుమారుని చండికాదేవి యెట్టు ప్రసాదించెనో, తండ్రియుఁ గొమరుండును సింహళద్వీపమునం దెట్లు సమావేశంబు నొందిరో, వారు మరల సుఖంబుగ నిజగృహంబున కెట్టువచ్చిరో అవి యన్నియు సరళముగ వినిపించెను. పాట సుగమముగ నున్నది. అందుఁగల యభిప్రాయమునకు మానసింహు డెంతయును సంతసించి పాటకుని జక్కఁగ బహూకరించెను. పెద్దపెద్ద యుద్యోగములుగల సార్వభౌమికనియంత లందఱును నిరుపేదయగు నాకవివరుని యెడ దయాళురై యనుగ్రహపూర్వకంబుగ మందహాసంబుల నాతని నానందవివశుంజేసిరి. ఆయాస్థానంబునందలి పరమపురుషుల పావననామంబుల మఱచితిమి; ముకుందరాముని పేరును ఆతనికవితయును నేఁటికిని దేశీయవాఙ్మయంబున నతిగౌరవంబుగఁ బూజింపఁబడుచున్నయది.

జనులందఱును వెడలిపోయిరి. బంగాళారాష్ట్రప్రభుని సమ్ముఖంబునకు నరేంద్రుఁడు కొనిరాఁబడియెను. అందఱును మౌనముద్రులై చూచుచుండిరి. సౌంద

ర్యవంతుఁడగు నారాజకుమారుని జూచుచు నాతనిపై జాలిగొలుపునిరీక్షణంబుల బఱపెను. మందభాగ్యుండును దుర్వినీతుండును నగునాసత్కులప్రసూతుని సౌందర్యశోభితుని, యౌవనవిదగ్ధుని సమీపంబునకు రావించి, పూర్ణనామధేయంబున నాతని సంబోధించి యిట్లని ముచ్చటించెను.

"నరేంద్రనాథరాయలా ! అత్యంతసన్మానంబున నీపితామహుఁడు మొదలగు వారాదరింపఁబడిరి. అట్టి వారు నిన్నీరీతిని గాంచుట విచారకరముగనున్నయది. నీవంశఖడ్గమును తోడరుమల్లుఁడు నీతొట్టియుంచుంచి నాఁడు. నీవు దుడుకువాఁడవై పోయితివి. కానిమార్గము నఁజరియించుచుంటివి. నీసంరక్షకుని ప్రాణసంకటమునకు లోను జేసితివి. దేశమున శాంతమును నిర్మలవర్తనమును నెలకొల్ప నేర్పడినవారిపై నీయనుచరులు తిరుగఁబడిరి. ఉభయబలంబులు పోరాడి రక్తమునుకంటఁ జూచికొనిరి. నీపితామహునినామమింకను మఱతమన్నను మఱపు రాకున్నది. ఆకారణమున నిన్ను మన్నింపవలసె. నీరక్షకుఁడు నవకుమారుండు. ఈయభియోగంబున నీవాతనికి ఉద్దేశపూర్వకంబుగఁ బ్రాణాపాయంబు చేయనెంచి

నట్లు చెప్పుటలేదు. కరుణాళుండగు నీకుమార శిరీషుం డాతని ప్రాణములం గాపాడినాఁడు. అతఁడును బ్రహ్మాణస్ఫూర్తిగఁ దన దౌర్భాగ్యవర్తనము నిదానముగఁ జేసి నీసంరక్షకుని ప్రాణముల నిరుద్దేశపూర్వకముగఁ దీయునముకట్టినట్టి స్వభావము కలవాఁడవుకావని యుద్ఘోషించినాఁడు. ఆతనిమాటలు నాకెంతయు మన్ననకుఁ బాత్రములు. నీపడవ నాతనిపడవపైఁ బెట్టి కొట్టుట యుద్యత్తకార్యంబని విశ్వసించితిని. పదియేండ్లపిల్లవాఁడైననిట్టి కార్యములం జేయునా? అయ్యది యెక్కువపాక్షికమునను, ఉద్రేకవశముననె యైయుండును. నరేంద్రా! నీపైనున్న యీగొప్పనేరమునుండి నిన్ను విముక్తుం జేసితిని. నీవు నేరస్థుఁడవుకావు. యథేచ్ఛముగాజనుము."

నిబద్ధుండైయున్న నృపకుమారుండు పశ్చాత్తప్తుండయ్యెను. మొగమునఁ గత్తివాటువేసిన రక్తముతే పండఁ బోయెను. మొగము వెలవెలఁబోండెను. తనశత్రువులదుస్తంత్రంబులవలనతనకెంతయో చేటువాటిల్లినని యెంచియుండెను. బంగాళాధినాధుని యనుగ్రహవాక్యంబులు విస్మయప్రమోదకరంబులై యాతనికి హృదయంగమంబు లయ్యెను. పెదవులు తడఁబడియెను.

నోట మాటరాదయ్యెను. కన్నులనుండి వృద్ధుల బాష్పబిందుద్వయంబు రాలెను. అవియె యాతని కృతజ్ఞతను సూచించుచు నాతని పక్షమున నిలిచి పనిచేసెను.

"నీసంస్థాన వ్యాపారముల నెక్కువశ్రద్ధగ గమనించి పనిచేయవలసి యుండెను. అవియన్నియు చెల్లాచెదరై యున్నవి. సార్వభౌమునకు సంవత్సరముక్రిందట కట్టవలసిన కప్పమింకను జెల్లుబడి కాలేదు. నీకింకను వయస్సురాలేదు. నవకుమారుఁడు స్వస్థానమునకుఁ బోయి పనిచేసికొనవలపి వచ్చెను. ఆకారణమున తోడరుమల్లుఁడు మున్నుచేసిన యేర్పాటుల నించుక సార్వభౌముండు మార్పుచేయవలసి వచ్చెను. నవకుమారుండు తన పూర్వసంస్థానంబగు దేవీపురంబునకుఁ బోయి ప్రవేశించును. సార్వభౌమిక ప్రతినిధి నొకని నేఁడీసంస్థానకార్యములఁ జక్కఁబెట్ట నియోగించితిని. నీకు వయసు వచ్చువఱకు నాతఁడీరాజ్యవిషయముల జూచుచుండును. నీబాకీసాకీలన్నియు నాతఁడే తీర్చివేయును. ఇది యేపాదుషా యనుగ్రహంబు."

ఇదియు నరేంద్రునకు సంతుష్టిగనే యుండెను. నవకుమారుని వారినుండి యాతని సంస్థానము బయటఁబ

దును. అతనికి వయసు వచ్చువఱకును దన పితామహు నకు మారుగ సార్వభౌమిక నియంతయొకఁడు రాజకా ర్యములు చక్కఁబెట్టుచుండును. ఈలోపుగ నాతఁడు త నజీవన వ్యాపారములం దాను జక్కఁ బెట్టుకొనుచు స్వే చ్ఛగ నుండవచ్చును.

ఇట్లనుకొనుచుండఁగా రాజు "నీమాటయన్ననో నీవొక కొంతకాలమువఱకును వీరనగరంబునందుండు ట నుచితంబు. నీయనుచరులును లేనిపోని విచ్చితలంపు లె న్నియో నీతలకెక్కించినారు. నీవును వారును గలసి మెలసి యుండినచో రాజని యంతకు సంస్థాన పరిపాల నము మిక్కిలిదుర్ఘటమైపోవును. నిన్నిచ్చటనుండుమని చె ప్ప మనసురాక యున్నది. కాని రాజమహలునకు వ చ్చెదవేని నాయొద్ద రసపుత్రనియంతలు చాలమంది యున్నవారు. వారందఱును శూరశిఖామణియగు నీపి తామహు నెఱింగినవారు. ఆతని వంశాంకురమగు ని న్ను తదుచిత విధానంబున నాయుధకార్యంబుల నభ్య స్తునిఁగావించి నిన్ను మనఃపూర్వకంబుగ నాదరించు వారు. అట్లుజరిగెనేని నీవు సంస్థానమునకు మరలవచ్చు నప్పటికి మహాసార్వభౌమునకుఁ దగిన జంటవయ్యెదవు.

ధైర్యగాంభీర్యంబుల నీకింకొకరు సాటిలేకుండఁబోయెదరు. సార్వభౌమునకు నీయట్టి సంస్థానాధిపతులు చిక్కఁబడుట సర్వసమ్మతము. అతని సామ్రాజ్యనిర్మాణమంతయు ప్రబల స్వామిభక్తినాసించి యుండును.

నరేంద్రుని ముఖమింకను రక్తవిహీనముగనే యుండెను. కాని రాజానుగ్రహవాత్సల్యంబుల కుత్సాహంబును కృతజ్ఞతయును మనంబున నుదయించుటచే నయ్యది మొగమునఁ బ్రతిబింబితం బగుచుండెను కన్నుల నశ్రుగణంబులు రాలుచుండెను.

బంధవిముక్తుండగు నా నరేంద్రుండు "అవక్రపరాక్రమధౌరేయా! నీకరుణ యపారమై నన్ను ముంచివేయుచున్నది. నేను దుడుకుపని యొనరించినవాఁడను, విధేయుండనైతిని. ఎట్టిశిక్షలకైనఁ బాత్రుఁడను. నన్ను క్షమించితిరి. కృపజేసితిరి. ఉపరి బహూకరించితిరి. ఓ కరుణార్ద్రహృదయా! నేఁడు మొదలు మీయనుగ్రహంబునకుఁ బాత్రుఁడనయ్యెద. నావంశగౌరవంబున కుచితంబగునటుల ప్రవర్తించెద. నేనెచ్చటనుండి పరిచర్య చేయవలసివచ్చిన నచ్చటనే మహాచక్రవర్తికి భక్తిపూర్వకభృత్యుఁడనై మెలంగెద. అనుగ్రహింపుఁడు."

అనుమాటలకు మానసింహునికన్నులనుండియానందాశ్రువులు రాలెను. అక్బరుసార్వభౌముని సామ్రాజ్యాభివృద్ధి నొందింపవలెననిన పూర్వప్రభువంశముల వారినిష్కల్మష రాజభక్తిని గాంక్షించుట యత్యావసరమై యున్నది. అందుచే నీవాక్యము లెంతయు నాతనికి సంతోషదాయకము లయ్యెను.

ఆరేయి వీరనగరమున దీపావళియుత్సవము జరిగెను. ఢంకానగారాలును శంఖవాద్యంబులును వినంబడియెను. రాజభక్తి హిందువుల వర్తనంబునకెల్ల తలమానికంబుగాదా! హిందూమతసిద్ధాంతములయందిది మిళితమై యుండెను. మానసింహుఁడు వీరనగరనాయకుని యెడఁ జూపినయనుగ్రహమునకుఁ దత్పురప్రజ లెంతయును నపరిమితానందమగ్నులైరి. అన్నివీథులును అన్నిభవనములును, దీపారాధనలతో నిండిపోయెను. కూటికి టికాణాలేని విధవరాండ్రలోఁగూడఁ, దమగడపమీఁదఁ జిన్నప్రమిదలో నింతచమురు పోసి, వీధివంక దీపము వెలిగించకుండఁ బోయినవారు లేరు. సంగీతపాఠకులు పెద్దపెద్ద మేడలపైఁ గూర్చుండియుచ్చైస్స్వనంబున గానరసప్రవాహంబుల వెల్లిగొలుపుచుండిరి. పెద్దబజారులను,

సందుగొందులను నల్లాడు నాఁడువాండ్రుగూడ, అక్బరు పాదుషాను గూర్చియును, బంగాళాదేశ ప్రభునిగూర్చి యును ప్రశంసింపని వారులేరు. రాత్రి రెండు యామములు తిరుగువఱకును పట్టణమేమూలఁ జూచినను నీకోలాహలంబులతోఁ గలకలమనుచుండి సద్దణఁగకుండనుండెను

మఱునాఁడుఁ ప్రభాతసమయంబున హేమలత తనమందిరారామంబు ప్రక్కనున్న పూలఁదోఁటలోఁ బుష్పములఁ గోయఁబోయెను. చిఱుచీఁకటి సమయమయ్యెను. నరేంద్రుని కాంతివిహీనంబగు ముఖపద్మమును మనోవేదనాదో ధూయమానంబై యుష్టివలెనుండు నాతని విగ్రహంబును నామెకు దృష్టిపథంబునం బడియెను. ఆతనిముఖసందర్శనంబు సేయునంత భయవిభ్రాంతమయ్యెను. గతదినమున జరిగినసమాచార మాద్యంతము నామెకు విశదమయ్యెను. నరేంద్రుఁడు తన్నువీడ్కొన వచ్చెనని యామెయనుకొనెను. ఇప్పుడు మోమాటమునకుఁ బోయి సిగ్గుపడుచుఁ గూర్చుండిన యెడల గార్యము లేదు. హేమలత ప్రశాంత. ప్రగల్భ అప్పుడామె తనచిన్ననాఁటిచెలికానిఁ జేరవచ్చినది. ఆవిషాదంబు

నఁ దనవీక్షణంబుల నాతనిపై మెల్లఁగ నారించెను. అంత నుభయులును గొంతవడి వాగ్బంధనమై యుండిరి. తమతమ హృదయాభిలాషంబు లుభయులకును గూడ వ్యక్తమగుచునే యుండెను.

" నరేంద్రా! నీవు వీరనగరమును విడిచి పోవుచున్నాఁడవఁట. యోధుండవై వచ్చెదవఁట. చిరకాలమునకుఁగాని మనకు మరల సమావేశము లేదఁట. నిజమేనా? మనచెలిమి చిన్ననాఁటిచెలిమి. ఆమరణాంతము నిట్లుండవలసినదియేసుమా!

నీదయామధుర వాక్యంబుల కానందమైనది.
భగవంతుఁడు నన్ననుగ్రహించుఁగాక!

"నీవనినయట్లు మనచెలిమి చిన్ననాఁటిచెలిమియే యగును హేమలతా! ఈశరీరమునఁ బ్రాణమున్నంతవఱకును నిన్ను నేమఱువనోప."

" నరేంద్రా! నీకృపాసమృద్ధియును, నాయెడ గల నీమృదుమధురభావమును నేనెఱుఁగుదును. కానిబిక్కొక్కప్పుడు నీవుద్రేకముఁజెంది తొందరపడుచుండెదవేల?"

"ఓమధురహృదయా! హేమలతా! నీకునాయందుఁ గలయను రాగముచే నీవయ్యది తొందరపాటని

చులకనగాఁ నెంచుచుంటివి. అయ్యది వివేకవిహీనత, బుద్ధిమాంద్యము. ఉన్మత్తత. నేను గర్విష్ఠుండనై చిన్నతనపుచేష్టల నీతండ్రికి బ్రాణాపాయం బొనరించితిని. నీకును నీతల్లికిని నేనొనరించిన యలజడికై హేమలతా! నన్ను క్షమింపుము."

"నరేంద్రా! నాతల్లిమన్ననకు నీవిదివఱకే పాత్రుండ వైతివి. నాతండ్రిగారియొద్ద నీపక్షమవలంబించి ఆమె యెంతయో పనిచేసినది. నీవు నిరపరాధుండవని నేనెఱుంగుదును ఇంకనిన్ను నేను క్షమియించుటకేమున్నది? నీకౌదార్య పౌరుషంబులు రెండును గూడఁగలవు. వానికిఁ దోడు ప్రశాంతభావంబును స్థిరచిత్తంబును జతసేయుము. ఈవంగదేశమున వీరనగర వంశముతోడ దుల్యమైనది మఱి యొకటి లేదు. నీపితామహునివలె నీవును ప్రగల్భుండగు ప్రభుండవై దీర్ఘాయుష్మంతుండవై మనుము."

"హేమలతా! నీక్షమార్పణంబుచే నామనోవ్యథ యెల్లదీరెను. నీకృపాభిమతంబు నాకెల్లప్పుడు తోడునీడయై యుండుఁగాక! హేమలతా! నేనింతకు మున్నెన్నియో కష్టములఁ బొందితిని. ఇంకముందెన్ని

రమూ పొందనుంటిని. ఎన్నిదురదృష్టములు వచ్చినను నిం కనుందు పౌరుష ధైర్యంబులతోడ భరించి యుండె దను. ఈకష్టమువలన నాకెన్నఁటికిని మఱపురానిపాఠ ములం గఱచితిని ”

“ అట్లనెదవేమి నరేంద్రా! కొలఁదికాలమున నీసంస్థానము మరల నీకు లభింపదా! నాతండ్రి కడు విశ్వాసముతోడఁ దనకార్యమును తాను నిర్వర్తించినాఁ డు. నాతల్లి నన్నెట్లు పెంచెనో నిన్నుఁగూడ నట్లె పెం చినది ”

“ హేమలతా! నీతల్లి పరమపావని. నాతల్లి యున్నను నన్నింతగారాబముతోఁ బెంచుననుకొనను. నేనైనను మీతండ్రి కెదిరించియెన్నఁడును పల్లెత్తుమాట యనియెఱుంగను. నిశ్చయముగ నేనాయన కెంతయో యవిధేయుండనై మెలంగితిని. ఆయన నన్ను కరుణిం చెను. హేమలతా! మనయుభయులకును వియోగంబు సంప్రాప్తంబగు సమయం బాసన్నంబైనది. మొదటి నుండియు నీవే నాసుఖంబవు. నీవే నామనోరథంబవు నీవే నాప్రాణప్రియవు.

హేమలత మొగము మరలించెను. మౌనముద్రి యయ్యెను. ఆమెకింకను బాల్యావస్థ విడువలేదు. ఈ

మాట యనునప్పటికి దానియర్థమేమో తెలియక గుం
డెలు తటతట కొట్టుకొనియెను.

"హేమలతా! నిన్ను గూర్చిన నామనోభావం బింతవఱకు నీకెఱింగించి యెఱుఁగను. ఇప్పుడు వియోగసమయము తటస్థమగుటచేఁ జెప్పవలసివచ్చెను. దీని కాద్యంతము లివియే యగునేమో? మనజన్మమున నొక్కొక్కయప్పుడు సంశయంబు లన్నియు వీడి సత్యం బొప్పుకొనవలసి వచ్చును. మనకిద్దఱకును, వియోగంబు గలుగకమున్నె యాసత్యంబు బహిరంగంబు కానిమ్ము కరుణామతల్లి యగు నీతల్లియు, క్షమాశీలుండగు నీతండ్రియు నీకరంబు నాకరంబున జేర్తురనియును, శైశవంబున మనమెంతటి యానందమున నోలలాడితిమో యట్లే మనజన్మమంతయును నానందాంబుధిం దేలియాడుదుమనియును, నెంతయో యాసపడి యుంటిని. హేమలతా! ఉచితలజ్జాప్రియదర్శినియగు నీమొగంబు మార్మొగంబు జేసెదవేల? మన మింతతడవు మసలరాదు. ఈరెండు నిమిషంబులలోనే నామనోభీప్సితంబు లెఱింగింపవలయు. రాత్రుల నప్పుడప్పుడే చుక్కల మనము లెక్కయిడుకొను చుందుముకదా. అయ్యవిమన

సుఖమా వేళ సమయంబున మనల, నవలోకించి ముసి ముసినగవులు నవ్వుచుండుననియును మనము చిన్ననాటి నుండియును సంతోష పూర్వకంబుగ నటియించిన యీ స్థలంబుల మరల నీకొంతకాల మిట్లేనటింతు మనియు నువ్విళ్లూరు చుంటిని. ఈరేయిటిగట్లున నీవిజనప్రదేశంబుల నొంటరిగఁ దిరుగుచు హేమలతా! నీవు నాతండ్రిగారి సంస్థానమునకుఁ బట్టమహిషివై యుందువనియును నాహృదయేశ్వరి వీవైయుందువనియును గలలు గని యుంటిని"

హేమలత మొగమున నానందవికార ముదయమయ్యెను. ఆనందాశ్రువులుకూడ పొడముచుండెను. వానిని బయలుపడకుండ నాపుకొను శక్తిసామర్థ్యములు హేమలతకడనుండెను. ఆమెమనంబున నేదైన నూతన వికారముదయమైనను దానినెదుటివాడు తెలిసికొనుట కామెనోట మాటయే లేదయ్యెను.

నరేంద్రుఁడు కొంతవిరతివహించి ప్రశాంత భావముతో" హేమలతా! ఇటువినుము. ఇంక నేఁజెప్పరానిదియు నీవు వినరానిదియుఁ బలుకనోపను. ప్రాణతుల్యములగునా కలలన్నియు విచ్ఛిన్నములైనవి నేను ప్రవాసగ

తుండనై యీ దేవీనగరమును విడిపోవుచుంటిని. రాజమహలున కరుగుదుము. మానసింహరాజు నా యెడఁగరుణాతరంగిత హృదయుండయ్యెను. అచ్చట నా పితామహుని చెలికాండ్రెందఱో యుండియున్నారు. వారందఱును నాకు సమరకార్యములనేర్పెదరు. రాజెక్కడికిఁబోయిన నక్కడికెల్లఁబోవుచు సంచారము చేయుచుండెదను. అన్నిరాష్ట్రములు తిరిగెదను. అట్లయినను నా హృదయము వీరనగరమునందే నిశ్చలమై యుండును సుమా! ఎన్నఁడును మఱవరాని మనోరథంబీ హృదయమునందే నిలిచియుండును. నేను వెడలిపోయినవెనుక నన్ను గుఱించి ప్రేమతో ముచ్చటించుచునైన నుందువా?”

“నరేంద్రా! నిన్ను నేనెన్నఁటికైన మఱవఁగలనా?” యనికన్నులనుండి బాష్పజలంబు లాఁపుకొననేరక వెలువరించెను.

“మధురహృదయా! కంటఁదడి పెట్టకుము. ఈమనవియోగ సమయమున నీమనస్సున కారాటము కలిగింపరాదు. మనకు వియోగముకలుగకతప్పదు. సూర్యోదయమగుచున్నది. నేను నిన్నువదలిపోవులోపల నీకొక్కయానవాలిచ్చి పోవలెనని యున్నది. ఈమాధవీలత నీవు

చిన్ననాటనుండియును మిగుల గారాబముతోఁ బెంచిపెద్దఁజేసితిని. అయ్యది యిప్పుడు పుష్పించి యౌవనప్రాదుర్భావముఁ జెందియున్నది. దీనినుండి నీకొకయానవాలొసంగెదను."

అనుచు నరేంద్రుఁడు దానితీఁగ యొకటిద్రుంచి కంకణముమాదిరిగ నొనరించి హేమలత హస్తమును మెల్లఁగఁ బట్టుకొని అతిమార్దవముగనా "మాధవీకంకణము" నామెకరంబున నలంకరించెను.

"దీనిపుష్పములు నేఁడో రేపో యెండిపోవును. కాడ మాత్రము విశేషకాలముండును. నీకు నాయెడ నెంత కాలము దయయుండునో యంతకాలము దీనిని నాజ్ఞాపకార్థముగఁ బదిలముగ నుంచుము. నాస్మరణయే నీమనస్సునఁ గలుగకుండునేని దీనినిబనికిమాలినదానిగ నెంచి విసర్జించుము"

సూర్యోదయకాలమునందలి రక్తకాంతు లాకసమున తేజఃపుంజముల వ్యక్తీకరించుచు రేఖావళులుగ నేర్పడియెను. వైశాల్యంబగు గంగాతరంగిణీ మధ్యమున రాజమహాలునగరంబు వైపుల నొకపడవ దాటుచుఁ బరిభ్రమరకుండ నొకఁడొంటరిగఁ బోవుచుఁ గన్పట్టెను. వీర

నగరరాజమందిరంబునందలి దేవాలయ సోపానంబులఁ జిన్నబాలిక యొకర్తు ఒంటరిగఁ గూర్చుండెను. నారీజన హృదయాంతర్గతంబై స్వభావజన్యంబై తొలుదొల్తనిర్గతంబగు బాష్పసలిలంబులఁ బ్రభాకరుండు పొడగాంచెను.

